# అంబాపాలి

కె. అశోక్



ఎదురుగా వున్న పీఠంమీద పానపాత్ర నుంచుతూ అంబా పాలి పక్కకు వత్తిగిలింది. ఉల్లిపొరలాంటి పల్చని పట్టు వస్త్రములలోంచి బిగువైన ఆమె అవయవ కదలికలు సముద్ర తరంగాలవలె లేచి క్షణంలోనే యథాస్థితిని పొందాయి.

ఆమె దరహాసంచేస్తూ కుమారగుప్తునికేసి చూసింది. అతడు ఆమెవైపే చూస్తూవున్నాడు.

అతడు ఆమెకంటెముందుగా నిద్ర మేల్కొన్నాడు.

ముత్యాలపరదాలోనుంచి బైటి నీలాకాశంకన్పిస్తోంది, క్రొత్తదనం విచ్చుకుంటోంది.

ఇవాళ వసంతోత్సవ పర్వదినమని - ఆమెకు గుర్తొచ్చింది; ఇవాళ తాను నగరస్వామిని. గడచిన పదిసంవత్సరాలనుంచి వైశాలీయువకులు మీనాక్షిధ్వజంతో అలంకృతమైన ఆమె వెండిరథాన్ని హిరణ్యగర్భుని మందిరంవరకు లాగుతూ వచ్చారు. ఇవాళ ఆమె విజయోత్సవం.

ప్రక్కనే ఎవరో వీణతంత్రులను మీటారు.

ఇది ఆమెను మేలుకొలుపు సమయం. నెమ్మదిగా వీణ తంత్రులను మీటి, పాటతో ఆమెను మేల్కొల్పుతారు.

పాట ప్రారంభమయింది. నీలవర్ణపు అంచుగల పరదాను తోసుకుని వసంతసమీరం శయనాగారంలోకి ప్రవేశించింది.

'ఇవాళ వసంత ప్రథమ దినసము. వసంతోత్సవరాణీకి నా శుభాకాంక్షలు.' అన్నాడు కుమారగుప్తుడు.

అంబాపాలి కించిత్ దరహాసంతో అతడికేసి చూస్తూ 'ధన్యవాదాలు! ఇవాళ నాకు రోజంతా తీరికదొరకదు...' అని అంది.

సమీపమందున్న స్త్రీకంఠం వసంతంతోపాటు తేలి యాడుతూ గదిలోకి ప్రవేశించింది.

అంబాపాలి తలగడానానుకుని చంద్రాకారంగా వంగి వళ్ళు విరుచుకుంటూ 'ఆ పాడేది చంద్రసేన' అని అంది.

కుమారగుప్తునికి ఆపేరు క్రొత్త. ఆకంఠస్వరంలోతనను పట్టి లాగుతున్న ప్రత్యేక ఆకర్షణ ఏదోవుందని హఠాత్తుగా అతడి కవగతం కాజొచ్చింది. మధురమైన సప్తస్వరాలు వీణానాదంతోకలిసి ఆరోహఅవరోహణలతో గభీరంగావుంది.

అతడు తలెత్తిచూసినప్పుడు అంబాపాలి ఎదురుగా ఒక చిత్రంకేసి చూస్తోంది. నగరంలోకెల్లా సుప్రసిద్ధుడైన సత్యకామసమర్థుని కానుక అది ... ఆ చిత్తరువు అతడు రచించిందే. అయిదుసంవత్సరాలకుపూర్వం ఇదేరోజున అత డీ గదికి వచ్చాడు. ఏదో గతస్మృతి మనస్సులో మెదలటంవల్ల ఆమె దరహాసంచేసింది. కుమారగుప్తు డిది గమనించాడు. అది విజయ గర్వాలు మిళితమైననవ్వు-అతనికి చిత్రకారుడు గుర్తొచ్చాడు.

ఒక పెద్ద విశాలమైన నావలో నెలల తరబడి ఇద్దరూ కలసి వున్నారు. కుమారగుప్తుడు రాజగృహంనుంచి వచ్చే వాడు. ఈ నావపైనే ి తడు సత్యకామ్‌ను కలుసుకున్నాడు. రాజకీయచర్చ జరిగింది. 'రాజగృహంలో పైకికన్పించే శాంతి

చిహ్నాలక్రింద భయంకరమైన అగ్నిపర్వతం కన్పిస్తోంది. బింబిసారుని బలం అతిస్వల్పం. యువరాజు అజాతశత్రువే, స్వయంగా, స్వంత రహస్యదళాన్ని నిర్మించుకున్నాడు' అంటూ ప్రారంభించాడు............

ఒకవ్యక్తి అందుకుని 'ఇది నే నంగీకరిస్తున్నాను... మీరు యధార్థాన్నే గుర్తించి వుండవచ్చు. నామట్టుకు నాకు యువరాజంటే కొంచెం భయమే' అన్నాడు. ఒకయువ కుడు అందుకుని 'రాజగృహ సైన్య సంచాలనయందు దృష్టి వుంచవలసిందిగా వృజసంఘం మల్లులను వేడుకుంది. ఇతరుల ఆక్రమణలు జరిగినప్పుడు రెండు గణతంత్రరాజ్యాలు పరస్పర సహాయం చేసుకోవాలనికూడా అర్థించింది' అని అన్నాడు.

'గణతంత్రాలపై ఆక్రమణ జరుగుతుందంటే నా కేమాత్రం నమ్మకంలేదు' అన్నాడు కుమారగుప్తుడు ఆ యువ కుణ్ణి వుద్దేశించి.

దాటివస్తున్న ఎత్తయినరాజగృహ పర్వతాలను, వాటి పైన నిర్మితమైన ధృవనిర్దేశక యంత్రాన్ని చూస్తూ ఆ యువ కుడు దీర్ఘంగా నిట్టూర్చి 'గణతంత్రాలను గురించి మీకు అంత ఎక్కువగా తెలియదు' అని అన్నాడు.

'మీరు వైశాలినుంచి వస్తున్నారా?' అని అడిగాడు కుమారగుప్తుడు.

'అవును, కొద్దికాలంక్రితం నే నక్కడే వున్నాను.'

ఆ తర్వాత ఆ యువకునికీ కుమారగుప్తునికి సన్నిహిత పరిచయం ఏర్పడింది. ఆ యువకునిపేరు సత్యకామసమర్థుడు.

అతడు తక్షశిలలో చిత్రకళ నభ్యసించాడు. అతడు తిరిగి వస్తోంది వైశాలినుంచి. ఇప్పుడు కుమారగుప్తుడు చూస్తూ వున్న అంబాపాలి చిత్రాన్నే అప్పుడా యువక చిత్రకారుడు వ్రాస్తున్నాడు వారు పదిరోజులపాటు నావలో వున్నారు. అప్పుడే చిత్రం పూర్తయింది. ఈ చిత్రానికి, కుమారగుప్తుని కొన్ని స్మృతులకూ ఎంతో సంబంధం వుంది.

ఈ చిత్రం అంబాపాలివద్దకు ఎప్పుడు వచ్చింది, ఎలా వచ్చింది అనేది అతడికి తెలియదు. సత్యకాముడుకూడా ఈ విషయాన్ని గురించి అంత ఎక్కువగా చెప్పేవాడుకాడు. మొట్టమొదట కుమారగుప్తుడు అంబాపాలి పేరుకూడా వినలేదనేదిమాత్రం నిజం. వైశాలిలో అప్పుడు అత డొక విదేశీయుడు.

పరిచారిక శయనాగారంలోకి ప్రవేశిస్తూ 'వైశాలీ సర్వ శ్రేష్ఠ సుందరికి జయం! జయం! ఇవాళ వసంతోత్సవం...' అని అంది.

అంబాపాలి నవ్వుతూ 'సునందా! నువ్వు చాలా చతురివే. వెళ్ళు, అలంకారగృహంలోని వస్తువులన్నింటిని సరిగ్గా వుంచవలసిందిగా చంద్రసేనతో చెప్పు' అంది.

సునంద వెళ్ళబోయేంతలో బైట శహనాయి విన్పించింది. ఇంతలోనే ప్రతీహారుడువచ్చి 'వసంతోత్సవ అభినందనాలు తెలియజేయటానికి యువకసామంతులు వచ్చివున్నారు' అని బిగ్గరగా అన్నాడు.

'సునందా!' అని కేక వేసింది అంబాపాలి. సునంద వెనక్కి తిరిగి ఆగిపోయింది. ఆమె కుమారగుప్తుని కేసి తిరిగి చిన్నగా నవ్వింది.

'సునందా! చూడు, వారు చూపించిన ప్రేమాను రాగాలకు అంబాపాలి చాలా సంతసించిందని సామంతపుత్రు లతో చెప్పు. రథయాత్రా సమయానికి అంబాపాలి సిద్ధంగా వుంటుందనీ, వారు వెళ్ళవచ్చునని కూడా విన్నవించు.'

శహనాయి వినిపిస్తూనేవుంది. సునంద బైటకు వెళ్ళి పోయింది. అంబాపాలి కుమారగుప్తుని కేసి చూసి 'కుమార గుప్తా, జీవితలక్ష్యమేమిటో తెలుసా?' అని అడిగింది.

కుమారగుప్తుడు దరహాసంచేస్తూ 'జీవిత లక్ష్యం సుఖము, శాంతి' అని అన్నాడు.

'తృప్తి, ఉల్లాసము, విజయము, ఇచ్ఛ' అంది అంబా పాలి......ఆమె కుమారగుప్తునికి దగ్గరగావచ్చి కూర్చుంది. చంద్రబింబంలాంటి ముఖంపై పడుతున్న నల్లని కేశరాశిని సరి చేసుకుంటూ కుమారగుప్తుని ముఖంలోకిచూసింది. 'ఈ జీవిత చక్రంమీదకు ఎక్కటం, దిగటం—అనునది వాస్తవమే, కాని అంబిక ఎక్కటమే తెలుసుకుంది; దిగటం తెలియదు. అపారమైన కీర్తి గౌరవాలు పొందటమే ఆమెకు తెలుసు. ఇవాళ్టిదినం సంవత్సరాంతం వరకు ఆమె అదృష్టాన్ని నిర్ణ యిస్తుంది' అని అంది.

కుమారగుప్తుడు ఆమె అధరములపై ముద్దిడుతూ మై మరచిపోయాడు. హఠాత్తుగా అదేసమయమందు అంబాపాలి

శహనాయిమీద అసావేరి రాగాలాపన వింది. ఆమె కుమార గుప్తుని కౌగిలినుంచి విడిపించుకుని లేచినిల్చుంది. తనదుస్తులు సరిజేసుకుని చంద్రసేనను పిలిచింది.

పదహారు పదిహేడు సంవత్సరాలయువతి చంద్రసేన ప్రవేశించింది. అప్పుడే వికసించిన సంపెంగపుష్పంవలె వుంది. విషాదంనిండిన వెలుగేదో ఆమెముఖంలోద్యోతకమవుతోంది.

'చంద్రసేనా, ఇవాళరోజంతా నువ్వు కుమారగుప్తుని వద్దనే వుండాలి' అని చిన్నగా నవ్వుతూ అంబాపాలి 'అందరి లోను వీరు నాకు ఎక్కువ ప్రియమైన అతిథి' అంది.

చంద్రసేన ఒకసారి కుమారగుప్తునికేసి చూసి, మళ్ళీ తన యజమానురాలి నుద్దేశించి 'చిత్తం!' అని అంది.

'కుమారగుప్తునికి నేను లేని లోటు బాధ కల్గిస్తుంది' అని అంబాపాలి తనలోతాను మాట్లాడుకున్నట్లుగా అంది. 'అయినా మరోమార్గ మేదీ లేదు.....ప్రియ కుమారగుప్తా! మీరు రథయాత్ర ఉత్సవాన్ని చూచుటకు హిరణ్యగర్భ మందిరమునకు వస్తారా—నాకు చాలా సంతసం కల్గుతుంది' అని, చంద్రసేన నుద్దేశించి 'నే నిహ వెంటనే సిద్ధంకావాలి. చంద్రసేనా, వెళ్దాంపద. నీపేరు చాలా అందంగా వుంటుంది' అని అంది.

# 2

'విజయవర్మా! నా రథాన్ని సిద్ధంచెయ్యి.'

విజయవర్మ భవన ప్రాంగణం గుండా రథశాలవైపు వెళ్ళాడు. భవనప్రాంగణంలో యువజనులు గుమిగూడి వున్నారు. వారిచేతులలో అడవిమల్లె, మాధవీ పుష్పాలమాల లున్నాయి. ఒకవంక సామంతపుత్రులు గుసగుస లాడుతు న్నారు. వారిలో చెవులకు తామ్రపర్ణీద్వీపపు హిమాంకజాతి పెద్దవజ్రం వ్రేలాడుతున్న యువకుడు బిగ్గరగా 'విజయవర్మా! అంబాపాలిదేవి ఇంకెంతసేపటికి బయలుదేరుతుంది?' అని అడిగాడు.

విజయవర్మ అతడివైపుకు తిరిగి శిరమువంచి నమస్క రించాడు. తరువాత అతడికి దగ్గరగా వెళ్ళి 'అంబాపాలిదేవి అలంకారగమందిరంలో వుంది. నేనిటు రథాన్నాయత్తపర్చ టకు వెళ్తున్నాను. ఆర్యపుత్రులు చాలసేపటినుంచి నిరీక్షిస్తు న్నారా?...' అన్నాడు.

విజయవర్మ సమీపమందున్న మరొక యువకునికి కూడా నమస్కరిస్తూ 'ఆర్యశ్రేష్ఠా! మీరుకూడానా?' అని అడిగాడు.

అతడు విజయవర్మ నమస్కారాన్ని స్వీకరిస్తూ 'అవును విజయవర్మా! నేనుకూడా మీ స్వామినికోసమే నిరీక్షిస్తు న్నాను' అని అన్నాడు.

విజయుడు చిరునవ్వుతో అందరికీ నమస్కరిస్తూ ప్రాంగణందాటి వెలుపల నిలిచివున్న కమ్మరులు, వడ్రంగులు, మేస్త్రీలు మొదలైన శ్రమజీవుల మధ్యగుండా రథాగారం లోకి వెళ్ళాడు. అప్పటికి జాముప్రొద్దెక్కింది. సూర్యుని లేతబంగారు కిరణాల కాంతిలో ఉన్నత భవనాలు మెరిసి పోతున్నాయి.

వీథులన్నీ కోలాహలంగా వున్నాయి. దుకాణాలన్నీ అలంకరించబడ్డాయి. విశాలమైన ప్రధాన మార్గములందు అక్కడక్కడ ద్వారములు నిర్మించబడ్డాయి. ప్రతి ద్వారమందు వివిధ కళారూపాలు ప్రదర్శించబడ్డాయి. వడ్రంగుల తెగకు చెందినవారి ద్వారం పూర్తిగా కలపతో నిర్మించబడింది. అలాగే మరొక తెగవారు అందమైన రాతి ద్వారం నిర్మించారు. కమ్మరులు లోహపుద్వారం నిర్మించారు. తోరణాలు, అలంకారాలతోను నగరమంతా కొత్త రూపం పొందినట్లుంది.

అకస్మాత్తుగా జనసందోహంలో అలజడి కల్గింది. జనం దారితప్పుకుని మార్గాని కిరువైపులా నిలబడ్డారు. ఒక సైన్యాధికారి శ్వేతాశ్వంపై స్వారీచేస్తూ అటుగుండావచ్చాడు.

అతడొక చిన్న వెండితూర్యాన్ని వూదాడు. జనం ఆసక్తితో అతని సమీపానికి కదనొక్కుకొచ్చారు. అతను జనానుద్దేశించి బిగ్గరగా 'పౌరులారా! ఒకప్రక్కకు తొలిగి మార్గాన్నివ్వండి. పరిషత్తుసభ్యులు ఇటే వస్తున్నారు. వారు

హిరణ్యగర్భుని మందిరానికి వెళ్తారు. వారికి ఏవిధమైన ఆటంకమూ కల్గించవద్దు' అని చెప్పాడు.

అతడు ముందుకు సాగిపోయాడు.

జనం మళ్ళీ గుంపుగూడారు. రాజమార్గం తిరిగి జనంతో క్రిక్కిరిసిపోయింది. మళ్ళీ అదే కోలాహలం, అదే హడావుడి ప్రారంభమైంది.

ఇంతలో ఒక బౌద్ధభిక్షువు అటేవచ్చాడు. ఆ రోజుల్లో వైశాలి వెలుపల ఆచార్య ప్రబుద్ధకేతుడు ఒక బౌద్ధారామాన్ని స్థాపించి వుండటంవల్ల బౌద్ధసన్యాసులంటే ప్రజలకు విచిత్రంగా కన్పించటం లేదు. కాని వారిని గురించిన జిజ్ఞాస ప్రజల్లో అంతగా లేదు. గణతంత్రరాజ్యమైన కారణంగా ప్రజలు రాజకీయ అధికారాలు, ప్రాపంచికసుఖాలు పొందే చూపులో వుండేవారు. వారికి యజ్ఞయాగాల్లో నమ్మకం వుండేది. వైశాలిలో హిరణ్యగర్భుని ఆలయమేగాక ఇంకా ప్రజాపతి, విశ్వదేవులు మొదలైన దేవతల ఎదుట యజ్ఞాల్లో పశుబలులు కూడా జరిగేవి.

పౌరుల్లో ఒకరు బౌద్ధ సన్యాసిని ఆపి 'భిక్షూ! వసంతోత్సవంరోజున మీ రింతవుదయమే భిక్షాపాత్ర తీసుకుని బయలుదేరా రెందుకని ?' అని అడిగారు.

'రాజన్యా, నేను ఆచార్య ప్రబుద్ధకేతులవారి శిష్యుడను, ఇది వారి ఆదేశము.'

'ఈ ప్రబుద్ధకేతులవారు ఎవరి శిష్యులు ?'

'తథాగతుని శిష్యులు'

సమూహంలోంచి మరొకరు ముందుకువచ్చి 'సిద్ధార్థ గౌతముడు — శాక్యశుద్ధోదనుని కుమారుడేగదా ?' అని అడిగాడు.

'అవును, వారే. ఆయన దట్టమైన అడవిలో తపస్సు చేసి మరణాన్ని జయించారని మీరు వినలేదా ? వారు జీవన్మరణ రహస్యాలను గ్రహించారు. ఆయన బుద్ధు డయ్యాడు.'

'సన్యాసీ, మీ పే రేమిటి ?'

'నన్ను భదంత కౌశల్యాయన్ అంటారు.'

'మీరు బుద్ధుణ్ణి చూశారా ?' అని మొదటి పౌరుడు ప్రశ్నించాడు.

'లేదు' అని భదంతుడు మృదులహాసం చేస్తూ 'నేను ఆచార్యులద్వారా వారి ఉపదేశాలను విన్నాను. ఆయన ధన్యుడు. వత్సా, నేను ఆచార్యులవద్ద దీక్ష గైకొన్నాను' అని అన్నాడు.

నడివయస్సులోవున్న వేరొకపౌరుడు భదంతునిమాట పూర్తిచేసీచేయకముందే అందుకుని 'ఆశ్చర్యమే ! నేను వారి పేరు విననే లేదు. ఈ తథాగతుడే గౌతముడని మీ రంటున్నారు. ఇప్పు డాయన ఎక్కడ వున్నాడు?' అని ప్రశ్నించాడు.

'ఆయన ధర్మచక్రపరివర్తన నిమిత్తం బయలుదేరాడు. ఆయన విషయం నా కంత ఎక్కువగా తెలియదు.'

ఒకేసారిగా మ్రోగిన తూర్యధ్వని, గుర్రాలసకిలింపులు రథచక్రముల గర గర ధ్వనులు విన్పించాయి —

'పరిషత్తు వస్తోంది.....సోదరులారా! పౌరులారా! దారిఇవ్వండి.'

జనం ఎక్కడివా రక్కడ తొలగి మార్గా న్నిచ్చారు.

లిచ్ఛవీల పరిషత్తు హిరణ్యగర్భుని ఆలయమునకు వెళ్తోంది. అక్కడ వసంతోత్సవంలో పాల్గొంటుంది. ఏడెనిమిదిమంది రాజపురుషులు రాణీల రథాలవెంట అస్త్రశస్త్రాలు ధరించి నడుస్తున్నారు.

కొద్దిసేపటికి గుంపంతా తొలగిపోయి మార్గం నిరాటంకమైంది.

మధ్యాహ్నం అవవస్తోంది. జనం మళ్ళీ గుమిగూడ సాగారు. ఇహ ఇప్పుడే అంబాపాలి రథం వచ్చింది. దానిపై వెండి బంగారాల తొడుగు వేయబడివుంది. దాని వెండి పతాకపై నేత్రాకారంలోవున్న మీనం ఎగురుతోంది. రథానికి పూన్చినవి శ్వేతాశ్వములు. వాటి లలాటములపై నల్లని తిలకం అందంగా తీర్చి దిద్దబడింది. వాటి చెవులకు వజ్రకుండలాలు వ్రేలాడుతున్నాయి. అవి సగర్వంగా మందగమనంతో నడుస్తున్నాయి. అంబాపాలి పుష్పరాశిలో మునిగిపోయి వుంది. సామంతపుత్రులు, యువతీ యువకులు పుష్పగుచ్ఛాలు, పుష్పమాలలు ఆమెపైకి విసరివేస్తున్నారు. ఆమె వాటిని సంతోషంతో స్వీకరించి మాలలను మెడలో వేసుకుంటోంది. యువకులు ఆమె రథాన్ని వెన్నంటే నడుస్తున్నారు.

అందరికళ్ళూ ఆమెనే చూస్తున్నాయి. ఆమె మెడలోని వజ్రాలహారం, అందులోవున్న వెడల్పైన పతకం

పుష్పమాలల్లోంచి మెరుస్తోంది. ఆమె కేశరాశిపై అలంక రించబడ్డ ముత్యాలసౌరు అమావాస్యనాటి ఆకాశంలో మెరిసే ఆకాశగంగను గుర్తుచేస్తూంది. ముఖంమీది స్వేద బిందువులు ముత్యాలవలె వున్నాయి. దీనివల్ల ఆమె వుక్కిరి బిక్కిరవుతున్నా ప్రసన్నంగా వుంది. యువకులు కేకలువేస్తూ పుష్పమాలలు విసరివేయటంచూసి ఆమె దరహాసంచేసోంది. ఆమె వారి హృదయేశ్వరి.

# 3

'బలికోసం పశువు !'

హఠాత్తుగా గుమిగూడివున్న జనసమూహంలోంచి ఒకరు ముందుకువచ్చి 'బలి జరుగదు' అన్నాడు. అందరి కళ్ళూ అటు కేసి తిరిగాయి. ఆ నవయువకుడు బౌద్ధసన్యాసి. యజ్ఞపురోహితుడు బ్రహ్మానంద చూశాడు. తరువాత అక్కడ చేరిన జనసమూహంకేసి, లిచ్ఛవీల పరిషత్ సభ్యులకేసి చూశాడు. వెనుకవైపున ఆకాశాన్నంటే ఆలయ సువర్ణ శిఖ రాగ్రాలు తళతళ మెరిసిపోతున్నాయి. హోమగుండంలోంచి లేచే అగ్నిశిఖలకు అవి మరింత దీప్తిమంతంగా వున్నాయి.

పురోహితుడు జనసమూహాన్నుద్దేశించి బిగ్గరగా 'వసం తోత్సవసందర్భంలో హిరణ్యాగర్భుని ఆలయమందు యజ్ఞము,

బలి అనాదికాలంగా జరుగుతూ వస్తున్నాయి. వీటిని కొనసాగిస్తూ వుండటంవల్లనే గణతంత్రం క్షేమంగా వుంటోంది. 'బలి జరుగదని– ఎవరా అనేది ?' అన్నాడు.

అందరూ మౌనం వహించారు. అంతా నిశ్శబ్దంగా వుంది.

ఆ భిక్షువు ముందుకువచ్చి 'జీవహింస చేయటంవల్ల దేశపు పునాలు దృఢంగా వుండవు. బ్రాహ్మణోత్తమా! తథాగతుడు ఉపదేశించిన అహింస, కరుణ మార్గాలు శ్రేష్ఠమైనవి. జీవహింస మహాపాపం!' అని చెప్పాడు.

'తథాగతుడా ?' అని కొన్ని కంఠాలు ఆ మాటను రెట్టించాయి– 'మాకు అవేమీ తెలియవు. బలిపశువుల్ని తీసుకురండి' అన్నారు.

'పశుబలి జరగదు. మా సన్యాసులం రక్తాన్నిస్తాం' అంటూ పట్టువస్త్రములు ధరించిన అనేకమంది బౌద్ధ సన్యాసులు హోమగుండ సమీపానికి రాసాగారు. ప్రజలు వారిని నిరోధిస్తూనే వున్నారు.

'పరిషత్తు! పరిషత్తు!' అంటూ జనంనుంచి కేకలు రాసాగాయి– 'పరిషత్తు ఈవిషయాన్ని యోచించాలి!' అన్నారు.

యజ్ఞం జరిపించే బ్రాహ్మణు లందరు వుద్రేకంతో 'ఇదంతా మోసం! వీరందరు నాస్తికులు, వేదాల్ని నిందిస్తున్నారు; పరిషత్తు వీరిని శిక్షించాలి' అన్నారు.

సరిగ్గా అదేసమయానికి అంబాపాలి రథము, దాని వెంట యువకబృందము వచ్చారు. యజ్ఞమండపంలో కోలాహలం కల్గింది. లిచ్ఛవీల పరిషత్తు లేచి నిల్చుని ఆమెను ఆహ్వానించారు. ఆమెను ఒక ఉన్నతాసనంపై కూర్చుండ జేశారు. ప్రజ లామెపై పుష్పవర్షం కురిపించారు.

కాస్సేపటికి అంతా నిశ్శబ్దం వ్యాపించింది.

పరిషత్తు సభ్యుల్లో ఒకరు లేచి నిల్చుని సమావేశమై వున్న సుజను లందరికి నమస్కరించి 'ఈ విషయాన్ని త్వరగా నిర్ణయించాలి. యజ్ఞాల్లో దైవప్రీతికై పశుబలి నివ్వటాన్ని వ్యతిరేకించటం రోజురోజుకు పెచ్చుపెరిగిపోతోంది. కాశీ, పాటలీపుత్రము, రాజగృహము, కౌశాంబీలనుంచి రోజూ వ్యతిరేకతకు సంబంధించిన వార్త లందుతున్నాయి. ఇది ఈర్ష్యవల్ల జరిగేది గాని, శక్తిని వ్యతిరేకించటం గాని కాదు. ఇది ప్రేమను వ్యతిరేకించటమే అవుతుంది. పరిషత్తు ఏదో ఒక మార్గాన్ని నిర్ణయించాలి' అని చెప్పాడు.

మరొకసభ్యుడు లేచి నిల్చుని ఈ విధంగా చెప్పాడు — "సిద్ధార్థునికీ, మహాయాజ్ఞికుడు కశ్యపునకూ ఈ విషయంలో వాదోపవాదాలు, సిద్ధాంత చర్చలు జరిగాయి. మహాయాజ్ఞికుడు కాశ్యపుడు గౌతముని♦ 'ఆర్యాష్టాంగ మార్గాన్ని' ఆమోదించాడు."

♦ ముక్తికి బుద్ధుడు చెప్పిన ఎనిమిది సూత్రాలను 'మధ్యమప్రతిపద' లేక 'ఆర్యాష్టాంగ మార్గం' అని అంటారు.

'ఆర్యశ్రేష్ఠా! ఈ విషయాన్ని గురించి ఆలోచించే ముందు, శాస్త్రిలు ఈ సందర్భంలో బలులను రద్దియించా యని, గణతంత్ర క్షేమంకోసం ఆ విధంగా జరుగుతూ వచ్చిం దనే విషయాన్ని విస్మరించరాదు. మల్లుల సంఘంలో దీనికి ఆటంకాలేవీ లేవు' అని పురోహితుడు చెప్పాడు.

'లిచ్ఛవీల పరిషత్తు సమావేశమైవున్న మండపం నూట ఎనిమిది స్తంభాలుగలిగిన నల్లరాతి కట్టడం; క్రింద కూడా నలుచదరంగల నల్లరాయి పరచబడివుంది. స్వచ్ఛమైన చలువ రాతి సింహాసనాలపై రాజపురుషులు, వారి భార్యలు, సభ తీర్చివున్నారు. ఒకవైపున ఒక ఉన్నతాసనం వుంది. దాని మీద ఒక పెద్ద బంగారుపీఠంపై లిచ్ఛవీలరాజు కూర్చుని వున్నాడు. అక్కడక్కడా సేవకులు నిల్చుని వున్నారు.

అందరూ ఈ విషయాన్నే చర్చిస్తున్నారు. మండప మంతటా కోలాహలంగా వుంది.

'లిచ్ఛవీల పరిషత్తు నిర్ణయం ఏమిటి?' అని ఒక సన్యాసి ప్రశ్నించాడు.

లిచ్ఛవీలరాజుకు, ఇతరపరిషత్తుసభ్యులకు ఈవిషయంపై చాలాసేపటివరకు చర్చ జరిగింది. తర్వాత సింహాసనము సమీపాన కూర్చునివున్న ఒక రాజసభ్యుడు లేచి నిల్చుని 'పరిషత్తుకు బలియివ్వటం అంగీకారమే. కాలం మారుతుందనే విషయాన్ని పరిషత్తు ఆమోదిస్తుంది; కాని వైశాలివా కోర్కెమాత్రం ఇదే' అని చెప్పాడు.

జనసమూహంలో ఒకభాగం 'మేము జీవహింస కోరడం లేదు' అని బిగ్గరగా అనేకపర్యాయాలు కేకలుపెట్టారు.

పురోహితుడు కలిగించుకొని 'నరశ్రేష్ఠులారా! యజ్ఞాల్లో ఇచ్చే బలి హింస కానేరదు. ఒక పెద్ద కార్య సాఫల్యానికి చిన్నస్వార్థాన్ని త్యజించటమే నియమము. మనం ఈ బలిద్వారా మనదేశానికి పుణ్యాన్ని సంతరిస్తున్నాం' అన్నాడు.

'ఈ విషయంలో శాస్త్రవేత్తల, పెద్దల అభిప్రాయం ఏమిటి ?' అని ఒక సభ్యుడు లేచి అడిగాడు.

'పెద్దలందరి అభిప్రాయం తెలుసుకొనుటకు సమయం కావాలి' అని పరిషత్తుపెద్ద చెప్పాడు.

అందరూ శాంతం వహించారు. ఇహ ఇప్పుడు జర గాల్సిందేమిటి ?

సింహాసన సమీపమందు కూర్చున్న రాజప్రముఖుడు లేచి 'ఈ వ్యవహారంలో ప్రస్తుతం బలి అంగీకారమే' అని చెప్పాడు. ఆ మాట చెప్పిందేతడవుగా పురోహితుల మంత్రో చ్చారణ ప్రారంభమైంది. బలిపశువులు తీసుకురాబడసాగాయి.

ఉన్నట్టుండి ఏబదిమంది బౌద్ధసన్యాసులు ముందు కొచ్చారు. వచ్చి బలి పశువుల్ని నిలబెట్టేచోటును ఆక్ర మించుకుని నిల్చున్నారు. ఆ సమూహంలోంచి ఒక గంభీర మైన కంఠస్వరం విన్పించింది. ఆ వచ్చినవ్యక్తి ఆచార్య ప్రబుద్ధకేతుడు. ఆయన తన శిష్యుల నుద్దేశించి బిగ్గరగా 'తథాగతుని పుత్రులారా ! యజ్ఞమండపాన్నుంచి ఇవతలకు

వచ్చేయండి. మనది ప్రేమమార్గం. బలవంతంగా పశుబలిని ఆప యత్నించం. మీ ప్రాణాలు పోతాయనే భయంవల్ల వైశాలీపౌరులు బలిని ఆపివేయవచ్చు. కాని అది అంతరాత్మ ప్రేరేపణవల్ల, హృదయ పరివర్తనతో మాత్రం జరుగదు. తథాగతుని ఉపదేశాలను అర్థం చేసుకునేవాళ్ళు చెప్పేది వింటే అది హింసాపూర్వమని బోధపడుతుంది.

గుంపు నెమ్మదిగా కదలసాగారు. బౌద్ధసన్యాసులు ఆచార్యుని వద్దకు తిరిగి వచ్చేశారు

ఆచార్యుడు చాలా గంభీరముద్ర వహించాడు. ఆయన లిచ్ఛవీల పరిషత్ సభ్యుల నుద్దేశించి 'ఈ లిచ్ఛవీ పరిషత్ తథాగతుని మతాన్ని అర్థం చేసుకోవాలి. ఆత్మోన్నతికి మార్గాలు బయట వున్నవి కావు. పశుబలం దేశబలం కానేరదు. మానవజాతి, ప్రతిజాతిమనిషీ తమ కర్తవ్యాలను గురించి అర్థం చేసుకోవాలి. శుభాశుభాల్ని గురించి వాస్తవ విషయాన్ని తెలుసుకోవాలి' అని చెప్పాడు.

'ఆచార్య ప్రబుద్ధకేతూ! మీది వేద, బ్రాహ్మణ మార్గంకాదు' అన్నాడు యజ్ఞపురోహితుడు ఆయనన్నుద్దేశించి.

'ఇది మనుష్యుని మార్గం. దానిని అర్థం చేసుకునేది హృదయం' అని ప్రబుద్ధకేతుడు చిరునవ్వు నవ్వి 'నోరు లేని ఈ పశువుల్ని బలియివ్వటంవల్ల దేశకళ్యాణం జరుగదు. త్వరలోనే మహాత్మ బుద్ధుడు ఇక్కడకు వస్తారు. అప్పుడే వైశాలికి పరీక్ష. ప్రజల్ని అప్పటికి ఆయత్తం చేయటమే ప్రబుద్ధకేతుడు చేసేపని. తథాగతుని ఆజ్ఞ! భిక్షులారా, నా వెంట తిరిగి రండి!' అన్నాడు.

# 4

వైశాలిలో సాయంసమయం. సాయంత్రంకావటంతో కోలాహలంకూడా హెచ్చింది. యువతీ యువకులు ముఖ్యంగా రాజశ్రేష్ఠులతో సంబంధమున్నవారు శ్వేతాశ్వములు పూన్చిన రథాల్లో రాజమార్గాన వెళ్తూ వున్నారు. అక్కడక్కడ రంగురంగుల దుస్తులు ధరించి జనం గుంపులు గూడి వున్నారు.

కాని మనమిక్కడ తెలుసుకోబోయేది పట్టణంలోని మరోభాగం విషయం. అక్కడ జనం ఇంతగాగుంపులుబడీలేరు, దేదీప్యమానమైన ఇంత వెలుగూలేదు. అప్పుడప్పుడూ నిర్జనంగావున్న ఆవీధుల్లో కన్పించే స్త్రీ పురుషులు, పిల్లలు లేమిలో బ్రతికే జనం నలె కన్పిస్తారు. నగరంలోని ఈ ప్రాంతంలో శ్రమజీవులు, పల్లెకారులు, వేటగాళ్ళు, కసాయిలు మంగళ్ళు, కమ్మరులు, నేసకులు మొదలైన తక్కున వర్గాల వారు, ఆర్థిక దృష్టితో పతనమైనవారుగా వుంటూవుంటారు. ఈ ఇరుకైన వీధిలోనే ఒకచోట క్రొత్తగా మద్యపు అంగడి తెరన బడింది. దుకాణంలో దీపం వెలిగించారు. అది చాలా మందంగా వెలుగుతోంది. దుకాణంలో విచిత్రమైన కూజాలు, పానపాత్రలు వున్నాయి. బైట కూర్చుండటానికి స్థలముంది. అంగడిలో ఒక వృద్ధుడు కూర్చుని వున్నాడు. మధ్యాహ్నంనుంచే అతడు కొట్టు తెరచి కూర్చున్నాడు. కాని బేరసారాలేమీ లేవు. ఖాళీగా కూర్చుని కూర్చుని

విసిగిపోయి వున్నాడు. ఇవాళ వసంతోత్సవ పర్వదినం. శ్రమ జీవులందరికి పనిపాటలు వుండవు. అయినా ఒక్కరూ రాలేదు.

చాలాసేపు నిరీక్షించి అతడు లోపలికి తొంగిచూస్తూ అమ్మాయీ, సుభాగా!' అని కేకేశాడు.

'ఎందుకూ? కస్తూరి నందుతున్నాను నాన్నగారు!' అని లోనినుంచే తీక్షణంగా జవాబిచ్చిందొక కంఠం.

'ఇవాళ్టికి ఎవరూ వచ్చేట్లు లేదమ్మా!' అన్నాడు బిగ్గరగా.

'ఇవాళ అందరూ పెద్ద ఆలయానికి వెళ్ళారు నాన్న గారూ! జమదగ్గి ఎక్కడికి వెళ్ళాడు?' అని లోనినుంచి మళ్ళీ అదే కంఠం విన్పించింది.

అప్పటికే వృద్ధుడు నిద్రకునుకులో మునిగిపోయాడు. ఆ అమ్మాయి మళ్ళీ అదే ప్రశ్న అడిగింది. ఎవరూ జవాబు చెప్పలేదు. కొంచంసేపాగి ఆమే దుకాణంలోకి తొంగి చూసింది. వృద్ధుడింకా అలాగే కునికిపాట్లు పడుతున్నాడు. పాన పాత్రలమీద ఈగలు ముసురుకుంటున్నాయి; దుకాణ మంతా మద్యం కంపుతో నిండివుంది.

ఇంతలో ఆ వీధిలో వస్తున్న యువకుడు ఆ బాలికను చూసి నవ్వుతో మెరసిపోయాడు. బాలిక నోరుమూసుకొని చేతితో తండ్రికేసి సంజ్ఞ చేసింది. నెమ్మదిగా తలుపుమూసి లోనికి వెళ్ళింది. కాస్సేపటికి ఇద్దరూ ఆ సందులో ఒక అతి నిర్జనప్రదేశానికి చేరుకున్నారు.

'శిలాజీ!' అని బాలిక యువకుని కేసి చేయిచాస్తూ 'నువ్వు వృద్ధునిపై ఏదో మంత్రం ప్రయోగించావు. సరిగ్గా ఇదే సమయానికి నిద్రపోతాడు' అని చిరునవ్వు నవ్వింది.

శిలాజి ఆమెచేతిలో ఏదో వస్తువునుంచి గుప్పెట మూసివేశాడు. ఆమె దానిని వక్షానికి కట్టుకున్న వస్త్రంలో దాచుకుంది. ఆ విధంగా చేయటంలో వక్షానికి బిగించుకున్న ఒకవైపు వస్త్రం తొలగిపోయింది. ఆమె ధరించిన వెండి దండ కూడా కన్పించింది. యువకుడు అది చూసి దరహాసం చేశాడు.

తరువాత వారిద్దరూ ద్వారంచాటున మరో మూలకు ఒదిగి ప్రేమసంభాషణ నారంభించారు.

ఈ విధంగా ఒక గంట సమయం గడచిపోయింది. వృద్ధునికి మెలకువ వచ్చింది. అతడు తృళ్ళిపడిలేచి తెరచి వున్న అంగడి నలుమూలలా దృష్టి సారించాడు. బయటకు తొంగిచూశాడు. నిశ్శబ్దంగావుంది. విచిత్రంగా ముఖంచిట్లించాడు, కిటికీదగ్గర చెవిఒగ్గి విన్నాడు. లోపలకూడా నిశ్శబ్దంగావుంది. తలుపుతోసుకుని నెమ్మదిగా లోనికి వెళ్ళాడు. నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ తన పదధ్వనికి తానే భయపడుతున్నట్లుగా తిరిగి దుకాణంలోకి వచ్చాడు. వృద్ధుడు మద్యపు అంగడి ప్రారంభించక పూర్వము కమ్మరి అయివుంటాడు. కొలిమిచక్రం అక్కడే ఒకమూల పడివుంది. ఆ చక్రంతిప్పేకర్ర తీసుకున్నాడు.

ఆ సందులోని నిర్జన ప్రదేశంలో యువతి, యువకుడు ఇంకా మాటాడుకుంటూనే వున్నారు. అకస్మాత్తుగా వృద్ధుడు తలుపు నెట్టుకుని వారిమీద పడ్డాడు. వృద్ధుని కర్ర వచ్చి యువకుని బుజంమీద పడింది. వృద్ధుడు బిగ్గరగా అరవడంతో గాబరాపడి అతడు పారిపోయాడు. అతడు పారిపోవటంవల్ల వృద్ధుడు, కోపాన్నంతా ఆ అమ్మాయి మీద చూపించాడు. నానాతిట్లూ తిడ్తూ బాదుతున్నాడు.

'ఛీ కుక్కా... ఛండాలపుదానా...నీచురాలా...'

బాలిక ఇహ నిర్భయంగా వృద్ధుణ్ణి తొలగిపొమ్మని హెచ్చరించి, అతణ్ణి పడద్రోసుకుని బజారువేపుకు పరుగెత్తింది. వృద్ధుడు కూడా వెంటనే తెప్పరిల్లుకుని ఆమె వెంట పడ్డాడు. అతడి కంఠస్వరం వీథంతా ప్రతిధ్వనించింది. ఇంతలోనే ఇద్దరు విచిత్రవ్యక్తులు ఆ వీధిలోకి వచ్చారు. వృద్ధుడు బాలికను తరుముకురావటం విరమించి ఆమెకేసి కొరకొర చూడసాగాడు.

ఆ వచ్చిన వ్యక్తులు వృద్ధునికి పరిచితులే కానటంవల్ల వాళ్ళనుచూచి అతడు సిగ్గుపడ్డాడు.

'మగ్గశిరా! ఎందుకామె నలా కొడ్తున్నావ్?' అని వారిలో ఒకవ్యక్తి వృద్ధుణ్ణి అడిగాడు.

వృద్ధుడు చాలా వినయంగా 'అయ్యా! దీని నడత మంచిదికాదు. ఇప్పుడదే, ఆ కుర్రాడితో......' అంటూ వుండగా ఆమె కోపంగా చూస్తూ 'మళ్ళీ అదేమాట, అన్నే మాట!' అంది బిగ్గరగా.

వృద్ధుడు తెల్లముఖం వేశాడు. నెమ్మదిగా 'ఛండా లపుదాన!' అని గొణిగాడు. ఆగంతకుల కేసి తిరిగి 'మద్యం కావాలా?' అని అడిగాడు.

వచ్చినవారిలో పెద్దవాడు 'ఈమె నీ కేమవుతుంది?' అని అడిగి బాలిక కేసి సైగచేశాడు.

రెండవవ్యక్తి వైశాలిభాషలో 'ఈమెను అమ్మమని అడుగు.' అన్నాడు. మొదటివ్యక్తి చులకనగా అదేభాషలో 'పోనిద్దూ! మన మేం చేసుకుంటాం ఈమెను? కాని...చూడు... చూడటానికి ఆరోజున రాజగృహంలో సెట్టికి అడవిలో దొరికిందే, ఆ అరిష్టలాగానే వుంది అచ్చంగా!' అన్నాడు.

రెండవవ్యక్తి చిరునవ్వునవ్వి 'అది చాలాకాలంనాటి విషయంగదూ!' అని వృద్ధునికేసి తిరిగి 'పద, దుకాణానికి వెళ్దాం.' అన్నాడు.

వృద్ధుడు కుమార్తె కేసి చూశాడు. ఆమె చాలా ఆసక్తిగా ఈ యిద్దర్నీ చూస్తూంది. వారివెనుక ఆమెకూడా దుకాణానికి వచ్చి లోనికి వెళ్ళిపోయింది. వృద్ధుడు దుకాణం లోకి వెళ్ళాడు.

'ఏ మద్యం ఇవ్వమంటారు?'

'ఏదో ఒక టీవ్వూలే!' అన్నాడొకడు. రెండవ వ్యక్తి ఒక నాణాన్ని అతనిముందుకు విసరివేశాడు. ఆ కపాహార ణాన్ని (ఆనాటి నాణెం) చూసి వృద్ధునికళ్ళు ఆనందంతో మెరిశాయి. 'రెండా?' అని అడిగాడు.

రెండుపాత్రలు నింపి వారి కందించాడు. ఆ తరువాత వైశాలిని గురించిన విషయాలపై సంభాషణ జరిగింది. వెళ్ళే

ముందు వారిలో పెద్దవాడు 'ఏమయ్యా! ఒక బేరం చేస్తావా?' అని అడిగాడు.

వృద్ధుడు ఆశ్చర్యంగా 'ఏమిటది బాబూ?' అని అడిగాడు.

'ఒక బేరం!'

రెండవవ్యక్తి అందుకుని 'మాకొక దాసీ కావాలి. ఈమె నీ కేమవుతుంది?' అన్నాడు.

'బాబూగారూ! ఈమె నాకూతురే!' అని జవాబిచ్చాడు వృద్ధుడు.

ఆ పెద్దవాడు బిగ్గరగానవ్వి, 'అబద్ధం, నీజుట్టు పది సంవత్సరాలక్రితమే పండిపోయింది. (భాషలో) అమ్మాయి అందంగానే వుంది. మంచి దాసీయే' అన్నాడు.

'లేదండీ. నేను చెప్పేది అబద్ధం కాదు. ఆమె నా కుమార్తే. ఓసుభాగా!' అంటూ పిలిచాడు.

సుభాగ దూరంగాలేదు. అక్కడే తలుపులోనుంచి చూస్తూనేవుంది. రెండు గండుతుమ్మెదలు మెరుస్తున్నాయి. చిన్నవాడు అటుకేసే చూస్తూవుండటం గమనించి 'ఏం, చేసుకుంటావా?' అని అడిగాడు పెద్దవాడు.

చిన్నవాడు వికృతంగా నవ్వాడు. పెద్దవాడు వృద్ధుని దగ్గరగానంగి 'చూడు, నావద్దధనముంది...బంగారముంది...కావాలా?' అన్నాడు. చిన్నవాని కేసి చూసి నవ్వుతూ 'మాకొక దాసి కావాలి' అన్నాడు.

వృద్ధునికళ్ళుసంతసముతో మెరవసాగాయి. 'లేదండి, నేను ఈ మెను అమ్మను. ఈ మెనాకు మూర్తే... నాభార్యకడుపునే పుట్టింది' అన్నాడు.

ఆ ఇద్దరూ నవ్వారు. వృద్ధుడు 'అమ్మా! సుభాగా! అని పిల్చాడు. సుభాగా గట్టిగా తలుపువేసి చప్పుడు చేసుకుంటూ లోనికి వెళ్ళి పోయింది.

కాస్సేపటివరకు వృద్ధునికీ, ఆ ఇద్దరికీ మధ్య మెల్లగా సంభాషణ జరిగింది. తరువాత ఆ యిద్దరూ వెళ్ళిపోయారు—

ఇది మధ్యాహ్నం జరిగిన విషయం.

సాయంతమయేసరికి వృద్ధునికి రేజీకటి రోగముంది. అందుచేత అతడు కొంచెం ముందుగానే, వెలుగు వుండగానే, దీపం వెలిగించుకుని కూర్చునేవాడు. ఇవాళకూడా అత అలాగే దీపం వెలిగించుకొని కూర్చున్నాడు. కాని ఇవాళ అతడి మనస్సు ఏమీ భాగాలేదు.

# 5

వైశాలివృజిసంఘపు రాజధాని. దాని నలువైపులా మూడువరుసల ప్రహారీ. దానిలో అక్కడక్కడా ద్వారాలు పైకి కాపలా గోపురాలు వున్నాయి. ఈ గోపురాల మీది నుండి చూస్తే చాలామైళ్ళవరకు కన్పిస్తుంది. రాజమార్గాలు విరివిగా కన్పిస్తాయి. కాపలా వాళ్ళవద్ద ఇత్తడి తూర్యాలు వుంటాయి. మధ్యమధ్య వాటిని వూదుతూ ద్వారపాలకుల్ని

హెచ్చరిస్తూవుంటారు. నగరరక్షణకు నగరరక్షకులని ప్రత్యేకంగా ఒకశాఖ వేరుగా వుండేది. కాపలావారికీ దానికీ సంబంధం వుండదు. సంఘానికి రాజు అంటూ ఎవరూ వుండరు. ఒక పరిషత్తు పరిపాలనచేస్తూ వుంటుంది. ప్రతి ఏడుసంవత్సరాలకు ఒకసారి ఎన్నికలు జరుగుతాయి. ఎన్నుకోబడ్డవారు నియమపూర్వకంగా పరిషత్తులో పాల్గొంటారు. వారు ఒకటిగా వుండి ఒకే మాటమీద ఐక్యంగా వృజిసంఘకార్యాలను నెరవేర్చేవారు. వారు వృజిచైత్యాలను (దేశపు ఆలయాలను) వృజిధర్మాన్ని (దేశీయసంస్థల్ని, నియమాల్ని) పాలించేవారు.

నగరంలో శిల్పులకు, వ్యాపారులకు సంఘాలున్నాయి. శిల్పుల సంఘాలు శ్రేణు లనబడతాయి. వివిధశిల్పులకు వేరువేరు శ్రేణులుండేవి. ఒక్కొక్కదానిలో వెయ్యేసిమంది కూడా వుండేవారు. ప్రతిశ్రేణిప్రధాన జేట్టక్ అనో, ప్రముఖుడనో అంటారు. ఆ శ్రేణినిబట్టి కమ్మరిజేట్టక్ (కమ్మరిశిల్పసంఘ ప్రధాని) అని, ఇలాగే ఇతరవృత్తులవారికి కూడాను. జల-స్థలాల నియమితులకు అడవులశాఖలకు కూడా శ్రేణులుండేవి. శిల్పుల్ని అదుపులోపెట్టటం, నడపటం అంతా శ్రేణి అధీనంలో వుంటుంది. వివిధపరిశ్రమల సమీకరణ ఆనాటి సంఘంలో ప్రధానాంశంగా వుండేది. నగరంలో వివిధవృత్తుల వారి కార్ఖానాలు, బైటనుంచివచ్చేవస్తువిక్రయశాలలు వేరువేరుగా ఉండేవి. శ్రేణులసరుకులు లోని అంగళ్ళలో అమ్మేవారు. వ్యాపారులకుకూడా సంఘాలుండేవి.

వీటిని నిగమ్ అంటారు. వాటిప్రధానిని సెట్టిఅంటారు. నగరంలోని నిగమ్ లన్నిటినుంచి ఒకవ్యక్తి ఎన్నుకోబడే వాడు. అతణ్ణి నగరసెట్టి అంటారు. ఆ పదవి నగర రాజకీయ పారిశ్రామిక జీవితంలో ప్రముఖంగా ఎంచబడేది. శిల్పుల (వివిధవృత్తుల శ్రమజీవులు) శ్రేణులకంటే నిగమ్‌లకు ఎక్కువ విలువ నిచ్చేవారు.

ఇవాళ ఉత్సవం నగర శెట్టిగారింటివద్ద. అతడి కుమారుడు సూర్యమణి తక్షశిలలో విద్యార్థి. అతడివాళే తన విద్యాధ్యయనాన్ని పూర్తిగావించుకుని వచ్చాడు. ఆరోజుల్లో వైశాలి నుంచి రాజగృహం, సాకేతము, శాకలము తక్షశిలలగుండా ఒక పెద్దరాజమార్గం మధ్యదేశంనుంచి వాయవ్యంగావెళ్ళింది. అతడీ మార్గానే తిరిగివచ్చాడు. అతడివెంట స్నేహితుడు హేమాంకుడు కూడా వచ్చాడు.

సూర్యమణి ఉన్నతమైన సౌవీర దేశపు సుందరాశ్వం పైవస్తున్నాడు. అతడి మిత్రుడు ఒక పర్వత గుర్రంపైవస్తున్నాడు. వెనుక కంబోజ కంచరగాడిదలమీద అతడి సేవకులు, పుస్తకాలు దుస్తులు వగైరాలున్నాయి. అతడివెంట ఒక ఖాళీ రథం వస్తోంది. అది ప్రభాత సమయం.

నగరం వెలుపల వున్న ఒక ఉద్యానవనంలో నగర సెట్టి వారికి స్వాగతమిచ్చాడు. నగరంలోని ప్రముఖవ్యక్తులందరూ ఆహ్వానించబడ్డారు. అంబాపాలి కూడా.

సూర్యమణి గుర్రంపైనుంచి దిగి తండ్రి పాదాలను స్పృశించాడు. హేమాంకుడు పెద్దలందరికి నమస్కరించాడు.

సూర్యమణి తండ్రికి, తదితర బంధుమిత్రులకు, తన మిత్రుణ్ణి పరిచయం చేశాడు. అతడు చంపాపౌరుడు. దృఢమైన గోధుమవర్ణ శరీరం, ఆజానుబాహువు. సూర్యమణికంటే అతడి విగ్రహం ఎక్కువ ఆకర్షకంగా వుంటుంది.

'ఇతడు నా మిత్రుడు హేమాంకుడు. ఈయన చికిత్సా శాస్త్రాన భ్యసించాడు. ఇతడు ఆత్మ-పరమాత్మల నంగీకరించడు' అన్నాడు సూర్యమణి.

అని అతడు హేమాంకునికేసిచూచి మందహాసం చేశాడు. నాకు ఇష్టం, అంగీకారం కానివి ఏవో ఆతర్వాత చెప్పుమణీ! ఇక్కడకు నగరం ఎంతదూర ముంటుంది?' అన్నాడు హేమాంకుడు.

నగరసెట్టి అందుకుని 'నాయనా హేమాంక్, నువ్వూ నాపుత్ర సమానుడవే. మా అతిథివి కూడాను. అంతేగాదు నువ్వు నగరాని కంతటికీ అతిథివి. మావద్ద ఏమీ సంకోచించకు. మీ ప్రయాణంనిరాకటంకంగా సాగిందా?' అనడిగాడు.

ప్రయాణమంతా క్షేమంగానే జరిగింది. ఒకచోట మాత్రం సూత్రం తెగిపోయింది, అందుచేత కొంచెం అసౌకర్యం కలిగింది. మీ పరిషత్తుకు, రాజగృహానికీ మైత్రీసంబంధాలు లేవా?' అన్నాడు హేమాంకుడు.

'రాజగృహంలో నేను పరిషత్తును గురించి చాలా విషయాలు విన్నాం. అక్కడ మేమొక రాజపురుషుని అతిథులుగా వున్నాం.' అన్నాడు సూర్యమణి. నగరసెట్టి జవాబేమీ చెప్పలేదు. అతడు వెనక్కితిరిగివారికి సర్వసౌకర్యాలు

సమకూర్చేందుకు సేవకులకాజ్ఞాపిస్తున్నాడు. సాయంసమయం వరకు ఆ వుద్యానవనంలోనే వుండిపోయారు.

సాయంత్రమవగానే చాలా ఆడంబరంగా వారు నగరంలోకి చేరుకున్నారు. ఆరాత్రి ఒక పెద్ద ఉత్సవాన్ని ఏర్పాటు చేశారు. అందులో వైశాలి రాజపురుషు లందరూ పాల్గొంటారు.

విందు ముగిసింది. నగరసెట్టిగారి బలవంతంవల్ల అంబా పాలి నృత్యంచేయటానికి సిద్ధపడింది. వెంటనే ఆమె భవనానికి, నృత్యపరికరాలు_ ఇతర కళాకారులకోసం సేవకుల్ని పరుగెత్తించారు. ఇవాళ అంబాపాలితోపాటు కుమారగుప్తుడు కూడా విందుకు ఆహ్వానించబడ్డాడు.

అంబాపాలి నృత్యముచేయుటకు లేచినిల్చుని కాలికి కట్టిన చిరుగజ్జల ధ్వనిచేసింది. ఒకవైపున వీణ, మరోవైపున మృదంగము. ఆమె ముందు సభికులందరికీ సమస్కరించి ఒక పర్యాయం చుట్టూ కలయ జూచింది. కుమారగుప్తుని కేసి చూచి చిరునవ్వు చిందించి నాట్యాన్నారంభించింది.

అతిథి గృహపవనంలో సంగీత, నృత్య, వాయిద్య తరంగాలు లేస్తున్నాయి. అందరూ మంత్రముగ్ధులై అంబా పాలికేసిచూస్తున్నారు. సూర్యమణి అదేపనిగా హేమాంకుని వైపు ప్రశంసాదృష్టితో చూస్తున్నాడు. సభికులందరి ప్రశంసల మధ్య నృత్యం చాలా సేపటివరకు జరిగింది. నృత్యం సమాప్తంచేసి అంబాపాలి పాటపాటంది.

'నా పులుగు వచ్చింది ! నా చింత వాలి ది !
ప్రియమైన నాపులుగు ! పరదేశములనుంచి
తిరిగి వచ్చెను పులుగు ! ప్రియమైన నా పులుగు.
పారాణి పూస్తాను ! సంకెలలు వేస్తాను,
ముద్దుల హద్దుల్లో బంధించి వేస్తాను !
ఉప్పొంగి నా మనసు – ఆనంద డోలికల !
చూశార నా పులుగు ? తిరిగివచ్చెను పులుగు !
పరదేశములనుంచి ! ప్రియమైన నా పులుగు !'

ఇది ప్రజాదరణ పొందినపాట. నగరసెట్టి ఆమెను అభినందించాడు. యువకులు పుష్పమాలలు విసిరారు, ఆమె పైకి. సభికుల తరఫున ఒక వజ్రహారం బహూకరించబడింది.

సభముగిసేసరికి రాత్రి చాలాప్రొద్దుపోయింది. అంబాపాలి వెళ్తూవుండగా సూర్యమణి ఆమెవద్దకు వచ్చి 'నా మిత్రుడు మీ నృత్యంచూచి చాలాసంతృప్తి చెందాడు. గురుజనులయెదుట మిమ్మల్నభినందించలేక పోయాడు.' అని అన్నాడు.

అంబాపాలి నవ్వుతూ 'ఓహో! అదా, మీ హేమాంకుడా? నే నాయన్ని ఆహ్వానిస్తున్నాను' అని అంది.

సూర్యమణి హేమాంకుణ్ణి పిలిచాడు: 'అంబాపాలి దేవి నిన్ను పిలుస్తూంది.'

హేమాంకుడు వచ్చి 'ధన్యవాదాలు. మీ రీయన మాట నమ్మనద్దు. నిజానికి ఈ విషయంలో నా కంతగా తెలి

యదు. మే మిప్పుడిప్పుడే విద్యాలయాన్ని వదలి వస్తున్నాం. మే మింకా చాలా నేర్చుకోవాలి' అన్నాడు.

అంబాపాలి దరహాసం చేస్తూ, 'నేర్చుకోవాలిసింది అంబాపాలివద్ద ఏమీ లేదు ; హేమాంక్...కాని అంబాపాలి ద్వారం నీ కోసం తెరిచేవుంటుంది. ఆర్యకుమారగుప్తా, మీ రెక్కడ వున్నారు ?' అంది.

అప్పటికే కుమారగుప్తుడు రథంమీద ఆసీనుడై వున్నాడు. అక్కడినుంచే 'ఇక్కడే-రథం దగ్గర' అని జవాబిచ్చాడు.

సగంరాత్రి గడచిపోయింది. అంబాపాలి పాపటి బిళ్ళనూ, శిరోభరణాలనూ తీసి కుమారగుప్తుని చేతికిచ్చింది. నిల్చునివున్న రథంమీద వెన్నెల్లో ఆమె శిరోజాలు నుదురుపై నాట్యం చేస్తున్నాయి. ఆమె ప్రేమగా కుమారగుప్తుని కేసి చూసింది. మరేమీ మాట్లాడలేదు.

రథం వైశాలి రాజభవనాలను, రాజవీథులను దాటి పడమటి ద్వారంవైపుగా అంబాపాలి భవనానికేసి వెళ్తూ వుంది.

గోపురాలపై బాగా వెలుగుగా వుంది.

కాపలావాళ్ళు మేల్కొని పహరా యిస్తున్నారు. భవనంచెంత ఒక నగర రక్షకుడు 'ఎవరి దా రథం ?' అని కేకేశాడు.

'అంబాపాలి దేవిగారిది' అని విజయవర్మ బదులు పలికాడు.

'దేవికి జయం జయం!'

మళ్ళీ నిశ్శబ్దం.

విశాలమైన సింహద్వారంగుండా వెళ్ళేటప్పుడు అంబాపాలి 'ఇవాళ వెన్నెల ఎంత మనోహరంగావుంది!' అని అంది.

కుమారగుప్తుడు ఆమె చేయిపట్టుకుని రథంమీాది నుంచి దించి శయనాగారానికి పంపి, తన పడకగదికి వెళ్ళిపోయాడు.

పున్నమ చంద్రుని ప్రకాశం పాలనదివలె ఉప్పొంగుతూ తెల్ల చలువరాతి ధరాతలంపైన, గోపురాలపైన ప్రవహిస్తోంది. అదేసమయానికి చంద్రసేన మేల్కొని బైటకు వచ్చింది. కుమారగుప్తుడు ఆమెను చూశాడు – ఆమె ముఖం పాండురంగావున్నా ఆకర్షణీయంగా వుంది. ఆమె తలలో విరజాజి పుష్పాలమాల అలంకరించబడివుంది.

ఒక క్షణం అతడు ఆగి, గదిలోకి వెళ్ళిపోయాడు.

# 6

ఒకనాడు కుమారగుప్తుడు అంబాపాలిని ఇంటికి వెళ్ళుటకు అనుమతి కోరాడు. 'రాజగృహాన్నుంచి శుభవార్త లేమీా రావటంలేదు. ఈ మధ్యనే ఒక మిత్రుడు వైశాలికి వచ్చాడు. రాజగృహ మంత్రి మండలికీ, అజాతశత్రురాజుకు మధ్య ఏదో విషయంలో తీవ్రమైన అభిప్రాయ భేదాలు వచ్చి

నట్లు అతడిద్వారా తెలిసింది. ప్రధానామాత్యులు బంధి ఖానాలో వున్నారట – తండ్రిగారు ఆరోగ్యంగా లేరట' అని చెప్పాడు.

చిన్నతనంనుంచే కుమారగుప్తుని జీవితం యాత్రల్లో గడచిపోయింది. అతడు ఒకచోట నిలచివుండే మనిషి కాదు. ఐశ్వర్యపు మోహమేమీూ లేదు అతడిలో. విరాగులంటే మంట కూడా అతడికి. అతడు జీవితాన్ని భోగవస్తువుగా తలచే వాడు.

అతనితండ్రి రాజగృహపు ప్రధాన సేనానాయకుడు. ఒక తమ్ముడు కిశోరగుప్తుడు తండ్రివద్దనే వుంటున్నాడు. అతడు అజాతశత్రుమహారాజు అంగరక్షకుడు. తండ్రి కుమార గుప్తుని వివాహం చేయదలచాడు కాని, అత డందుకు సిద్ధ పడలేదు.

'ఒకపర్యాయం నేను దేశమంతా తిరిగిరావాలి. అప్పుడు మీూ ఆజ్ఞను శిరసావహిస్తాను. కాని ఈ విషయంలో నే నేమీూ తొందరపాటు చేయను' అని అతడు తండ్రితో చెప్పాడు.

తండ్రి అనుభవశాలి. ఆయన చిరునవ్వునవ్వి 'నీ యిష్టం! నేను నీ వయస్సులోవున్నప్పుడు బింబిసార మహా రాజు వెంట గాంధారదేశం వెళ్ళాలని పట్టుబట్టాను. ఆనాటి యుద్ధాన్ని స్మరిస్తేనే వళ్లు పులకరిస్తుంది. ఇప్పుడున్న ఉత్సాహం వుండవలసిందే ... ... సరే, తిరిగి తిరిగి అలసి పోయినప్పుడు ఇక్కడకురా. వివాహం చేసుకుని నన్నీ పదవి

నుంచి విముక్తుణ్ణి చెయ్యి. నీ స్వదేశం నీ సేవను కోరుతుంది. ఆ సమయంకూడా వస్తుంది నాయనా!' అని అన్నాడు.

వృద్ధ సైన్యాధిపతి ఆశీర్వాదంపొంది ఇప్పటికి అయిదు సంవత్సరాలు అయింది. అప్పుడే కుమారగుప్తుడు రాజగృహం నుంచి బైలుదేరింది, మూడు సంవత్సరాలకు పైగా అతడు దేశదేశాలన్నీ తిరుగుతూ గడిపాడు. శ్రావస్తి, కపిలవస్తు, అహిచ్ఛత్ర, మధుర, ఇంద్రప్రస్థము, తక్షశిల, గాంధారము, రాకకము, మరుకచ్ఛము, విదిశ, కళింగ, తామ్రలిప్త, చంప మొదలైన దేశాలగుండా – దాదాపు ఉత్తరాపథమంతా తిరిగి – ఒకనాటి సాయంత్రానికి అతడు మళ్ళీ రాజగృహం చేరుకున్నాడు. ఆ రోజుల్లో రాజగృహంలో తిరుగుబాటు జరిగింది. అప్పుడు సింహాసనంమీద వుంది అజాతశత్రువు, *సింహపాదం గూఢచారులదే ప్రజలపై పెత్తనంగా వుంది. చాలావిషయాల్లో కుమారగుప్తుడు తండ్రి ఇంటికి వెళ్ళకుండా పట్టణంలో తక్కువకులాల ప్రజలు వుండే ప్రాంతంలో మకాం వేశాడు. అది ఒక సత్రంలాంటిదే. రహస్యంగా దాగివుండి రాజ్యంలోని అభివృద్ధిని చూసే బయటపడాలని అతడి వుద్దేశ్యం. జీవితాన్ని అనుభవించటంలో రహస్యంగా దాగివుండటం అతడికి ఆనందంగావుండేది. అక్కడ ఒక

---

* అజాత శత్రువు రహస్యదళంపేరు 'సింహపాదం' దీని సహాయంతోనే అతడు తండ్రినిచంపి సింహాసన మెక్కాడు. సింహపాదం (సింహపు పంజా) అతడి తళచిహ్నాం. ప్రస్తుతం వాళ్ళందరూ దేశంలో గూఢచారులుగా పనిచేస్తున్నారు.

కమ్మరి కన్యయందు ప్రేమ కల్గిందతడికి.

ఇది అతడికి ఒక క్రొత్త అనుభవం. హీనంగా ఎంచ బడే ఈజాతి కన్యయందు తన హృదయంలో కల్గిన చక్కలి గింతలకు_అతడు చాలా గర్వించాడు, సంతసించాడు. విషయం చాలావరకు పోయింది. చివరకు ఒకనాడు ఆ బాలిక తండ్రికీ, కుమారగుప్తునికి చాలా వాగ్వివాదం జరిగింది; దానితో అతడు ఆ నగరప్రాంతంనుంచి వెళ్ళిపోవల్సివచ్చింది. ఆతర్వాత సింహపాద గూఢచారులకు అతనియందు అభిమానం కలిగి నీడవలె అతడి వెన్నంటి తిరగసాగారు. చివరకు వాళ్ళల్లోనే ఒకనియందు అసంతృప్తితో మద్యశాలలో కుమారగుప్తుడు కత్తి దూయటంకూడా జరిగింది. ఈ విషయం జరిగిన తరువాత తాను ఆ రాజగృహం వదలి వెళ్ళటమే మంచిదని భావించాడు. అతడారాత్రే వైశాలివైపుకు బయలుదేరాడు. ఇక్కడ అంబాపాలిని కల్సుకోవటం జరిగింది, అనతికాలం లోనే ఆమెకు ప్రేమపాత్రుడయ్యాడు.

కొందరి ఆత్మలు లోహ నిర్మితాలో లేక మద్య నిర్మి తాలో అయివుంటాయి. అటువంటివాళ్ళు ఒకచోటగాని, ఒక వ్యక్తినిగాని, ఆమె అంబాపాలే కావచ్చు-కట్టుబడివుండలేరు. క్రిందుమీదు తెలియకుండా ప్రళయంగా వరదప్రవాహంవలె కట్టలు తెంచుకు ప్రవహించగోరతారు.

వారు ఎన్నోచోట్ల తమ చరణచిహ్నాల స్మృతుల్ని వదలివస్తారేకాని తిరిగి మళ్ళీ ఎప్పుడూ అటుకేసి తిరిగి చూడరు. కుమారగుప్తుడు అటువంటి హడావుడిమనిషి. ఉ తే

జనము, రోమహర్షణమే అతడి జీవిత మూలమంత్రమగా అన్నట్లుంటుంది.

కుమారగుప్తుడు ఇంటివిషయం ప్రస్తావించినప్పుడు అంబాపాలి నవ్వేసింది. 'మీరు కోరేదేమిటి? జడలోంచి జారిన పుష్పంనలె విడిబడిపోవడమా? నే నివాళే సేవకుడ్ని రాజగృహానికిపంపి వాస్తవ విషయాల్ని తెలుసుకు రమ్మంటాను. నేనుకూడా కొంచెం గాలిమార్పు కోరుతున్నాను' అని అంది.

కుమారగుప్తుడు దరహాసం చేశాడు.

అంబాపాలి విచారంగా అతనికేసిచూస్తూ 'కుమారగుప్తా! నేను చెప్పేది నిజమే! నేను మరెవరికోసమూ ఇంత నగరు ఇంత మమకారంతో ఆలోచించలేదు. నీ యీ దరహాసంతో నేను చాలా ఇరుకునపడిపోతున్నాను. నీవు జీవితాన్ని ఆటగా ఎంచుతున్నావ్!' అంది.

'జీవితాన్ని నీ వేమనుకుంటున్నావు?' అన్నాడు కుమారగుప్తుడు.

అంబాపాలి కొంచెం ఉద్రేకపడి 'ఈ తర్కంతో నువ్వు నన్నెక్కడకు జార్చదలచావో నాకు తెలుసు; అయినప్పటికి మన దృష్టికోణాల్లో భేదం వుంది. నేను జీవితాన్ని ఐశ్వర్యము, విలాసము, ప్రేమ, మధ్యపానంగా ఎంచుతున్నానని నువ్వు నాచేత చెప్పించదలుస్తుంటే, పోనీ అలాగే అంటాను' అని అంది.

కుమారగుప్తుడు మౌనం వహించాడు.

'ఒకరి జీవితం నిండుగా వుంటుంది; అది ఇతరులెవరికీ చోటివ్వదు. అది తనకుతానే పరిపూర్ణంగా వుంటుంది. మరొకరి జీవితం ఆకాశంవలె శూన్యంగా వుంటుంది. అందులో ఎన్నో నక్షత్రాలు, గ్రహమండలాలూ, జ్యోతి చక్రాలు, వస్తూ పోతూ వుంటాయి. పోయేవాటిని ఆకాశం పట్టుకుని వుంచలేదు...అర్థమవుతుందా ఇది ?' అని అంబా పాలి మళ్ళీ అంది.

కుమారగుప్తుడు ఆమెకేసి తిరిగి నిట్టూరుస్తూ 'ఎందుకు అర్థంగాదు. కాని రెండురకాల జీవితాలూ తమ ప్రత్యేక పద్ధతులు గలవే. తోకచుక్కను పట్టుకోవాలన్నా కుదరదు. ఏమంటావ్? ఏ మాలోచిస్తున్నావ్ ?' అన్నాడు.

అంబాపాలి 'చంద్రసేనా !' అని చంద్రసేనను కేకేసింది.

కొద్దిసేపటివరకు ఇద్దరూ మౌనంగానే కూర్చున్నారు. గది తలుపులు తెరుచుకున్నాయి. అది అంబాపాలి స్వంత మద్యపాన గది. అక్కడికి ఒక చంద్రసేనకు మాత్రమే ప్రవే శానుమతి వుంది. 'చంద్రసేనా రెండుపాత్రల ఆసవం తీసు కురా !' అంది ఆమె.

గన్నేరు పుష్పాకారంలో చలువరాతి పీఠంవలెవున్న ఒక పల్చని పట్టువస్త్రంలో చుట్టబడివున్న మద్యపు కూజాను తీసి రెండుపాత్రల్ని నింపింది చంద్రసేన. ఆసవం నింపేటప్పుడు అంబాపాలి ఆమెకేసి చూస్తోంది. అంబాపాలి కుమారగుప్తుని వంకచూసి 'చంద్రసేనకు తన పని ఎలా చేసుకోవాలో బాగుగా తెలుసు' అని అంది.

కుమారగుప్తుడు చంద్రసేనకేసి ఒకసారి చూశాడు. అతడి మనస్సులో ఆనాటిరేయి వెన్నెల్లో విరిసిన చంద్రసేన తళుక్కుమంది. అంబాపాలి సైగచేయటంతో చంద్రసేన గదినుంచి బయటకు వెళ్ళిపోయింది.

పానపాత్రను కుమారగుప్తుని పెదవుల కందిస్తూ 'జీవితాన్ని గురించి ఆలోచించి మనస్సును పాడుచేసుకోవటం కంటే జీవితాన్ని అనుభవించటమే మంచిది' అని అంది అంబాపాలి.

ఇద్దరూ తమ పాత్రల్ని ఖాళీచేశారు. కుమారగుప్తుడు కొద్దిగా వంగి ఆమె అధరాల్ని చుంబించాడు. 'అంబికా, నీ వన్నది నిజమేనా? జీవితాన్ని అనుభవించడమే ఏకైక సత్యమా?' అని అన్నాడు.

ఇంతలో గంటలు మ్రోగాయి. రాత్రి మొదటిజాము గతించిపోయింది.

అంబాపాలి లేస్తూ 'కుమారగుప్తా! ఎందుకనో ఇవాళ మనసు ఉద్విగ్నంగావుంది. నాకేమీ ప్రశాంతతలేదు. నువ్వో నీ గదిలో విశ్రమిస్తావా లేక నా గదిలోనా?' అని ఆమె నవ్వింది. కుమారగుప్తుడుకూడా లేచినిల్చున్నాడు. అతడామె జుట్టులోనికి రెండువేళ్ళు జొప్పించి గుండ్రంగా చుట్టి వదిలేశాడు.

అతడు ద్వారంవరకు వెళ్ళి వెనుదిరిగి అంబాపాలికేసి చూశాడు. ఆమె నిజంగానే అలసిపోయినట్లుంది. 'నా గదికే వెళ్తున్నాను' అని చెప్పాడు అతడు.

హఠాత్తుగా అంబాపాలి అతణ్ణి వెనక్కి పిలిచి 'కుమారగుప్తా, ఒకమాట వినివెళ్ళు. మనిద్దరం ఒక సంవత్స రంకంటే ఎక్కువగానే కలిసివున్నాం. నేను జీవితంలో ఎన్నడు ఇంత ఉద్రేకాన్ని, ఆవేశాన్ని అనుభవించలేదు. నువ్వొచ్చావు. నీతో కూడా ఇతరులయెడ వలెనే ఆటలాడా లనుకున్నాను. నే నది చేయలేకపోయాను. నే నిప్పు డిహ దహించుకపోతున్నాను. నువ్వు నన్ను పూర్తిగా ప్రేమించ టంలేదని నే ననుకుంటున్నాను. కుమారగుప్తా, ఎంత ఆశ్చర్య మైన విషయం!' అని అంది.

కుమారగుప్తుడు ముందుకువచ్చి ఆమెచెయ్యి పట్టు కున్నాడు. సంపంగిపువ్వులవలె వున్న ఆమె చేతివ్రేళ్ళను ముద్దిడుతూ 'అంబాపాలి! నువ్వు ఉద్రేకపడుతున్నావు. నేను వెళ్దా మనుకున్నవిషయం నిన్నింత వుద్రేకపరచింది, నేను వెళ్ళను' అని చెప్పాడు.

అంబాపాలి తననుతాను నిగ్రహించుకుంటూ 'అది కాదు కుమారగుప్తా! నువ్వు వెళ్ళవచ్చు. నే నిహ నిన్ను పట్టి బంధించివుంచాలని యత్నించను' అంది.

కొంచెం ఆగి మళ్ళీ ఆమె 'కాదు, నువ్వు నన్ను సరిగ్గా అర్థంచేసుకోలేదు. నేను చెప్పింది నిజమే. నేను అంబా పాలిని కాదేమో ననిపిస్తోంది నా.కిప్పుడు. నా హృదయం పగిలిపోతోంది. నేను మరెప్పుడూ ఇలా వుండి ఎరుగను కుమారగుప్తా!' అని అంది.

కుమారగుప్తుడు ఆమెను వదలి పానపాత్రను తీసుకుని కూజానువంచి దానిని నింపాడు, తన పెదవులతో దానిని

తాకి అంబాపాలివద్దకు తెచ్చి నవ్వుతూ 'ఇదిగో, ఇది నిన్ను కుదుట పరుస్తుంది' అన్నాడు.

అంబాపాలి నవ్వుతూ పాత్రను ఖాళీచేసింది. విచిత్ర కంపనం, ఒక విచిత్రమైన ఉత్సాహం కల్గినట్లనిపించింది. ఈసారి ఆమె స్వయంగానే పానపాత్ర నింపుకుని లతలు అల్లబడిన మెత్తని పట్టుతివాసిపై కూర్చుంది. కుమారగుప్తుడు కూడా దగ్గరే కూర్చుని ఆమె అందించిన పాత్రలో నాల్గోవంతు త్రాగేశాడు. అంబాపాలి నెమ్మదిగా పాత్రను ఖాళీ చేసింది. ఆమె కంఠంలో కంపన ప్రారంభమైంది; అందులో ఆశ్చర్యకరమైన చురుకుదనం, ఆకర్షణ వున్నాయి. 'కుమారగుప్తా! జీవితంలో విలాసంగా, ఉల్లాసంగా గడచిన క్షణాలనే నీ అంబిక సత్యమని భావించింది. ఆమె భావించింది తప్పు అని చెప్పేందుకు ఎవరున్నారు? కాని అదీ జరుగవచ్చు. ఇహ జరగలేనిదంటూ ఏముంది? దాహం, దాహం! జీవితం దాహం! అగ్ని! అగ్ని! జీవితం అగ్ని! అంబాపాలి దప్పిగొని వుంది. అంబాపాలి దహించుకుపోతోంది' అంది. ఆమె కుమారగుప్తుని ఒడిలో పవ్వళించి వుంది. కొద్ది క్షణాల్లోనే ఆమె నిద్రలో మునిగి పోయింది.

# 7

అంబాపాలి ప్రేమ మందిరంలో ఇద్దరు క్రొత్త వ్యక్తులు ప్రవేశించారు. లేక అంబాపాలే వైశాలిలోని ఇద్దరు వ్యక్తుల జీవితాల్లో ప్రవేశించిందనైనా అనవచ్చు; ఇదే వాస్తవానికి అతిచేరువలోవుంది.

ఆ వ్యక్తు లెవరు ?

సూర్యమణి, హేమాంకుడు.

ఇద్దరు మిత్రులు......ఇద్దరూ నెమ్మది నెమ్మదిగా పరస్పరం దూరమై పోయారు, అంబాపాలికి అతి సాన్నిహిత్యానికి చేరుకున్నారు.

సూర్యమణి......నగరసెట్టి పుత్రరత్నము. అతడు కవి. అతనిలో స్త్రీత్వం ఎక్కువపాలులో వుంది. సంపెంగవలె కోమల శరీరం. తన పద్ధతిలో అతడు అందమైనవాడే, కాని పురుషత్వ మనేది పేరుకైనా లేదు.

హేమాంకుడు......చంపా దేశపు కోశాధికారి ఏకైక పుత్రుడు, అతడే ప్రపంచానికి చెందిన మనిషి. జీవితము, ఆత్మ, పరమాత్మల విషయంలో అతడికి కొన్ని స్వంత అభిప్రాయాలున్నాయి. నిండైన నిడుపాటి విగ్రహం! శరీరంలోనూ, ముఖ్యంగా కళ్ళల్లో ఆకర్షణ, పురుష చిహ్నాలు వున్నాయి.

అది మూడవజాము పగటిపూట. అంబాపాలి నిద్ర నుంచి మేల్కొనేసరికి సేవకుడు సెట్టిపుత్రుని రాక నెరింగించాడు. చెదిరిపోయిన దుస్తుల్ని సరిచేసుకుంటూ ఆమె అతిథి గృహంలోకి వెళ్ళింది. 'వారిని తీసుకురా!' అని సేవకుని కాదేశించింది.

సూర్యమణి ఒంటరిగా వచ్చాడు. ఇంతవరకు మిత్రు లిద్దరూ కలిసే వచ్చేవారు. అంబాపాలికి చాలా ఆశ్చర్యం కల్గింది. ఆమె మృదుహాసంతో 'ఏం సెట్టి పుత్రా, ఇవాళ మీ మిత్రుడు ఎక్కడికి వెళ్ళాడు?' అని అడిగింది.

సూర్యమణి నవ్వుతూ 'అతడొక పరిశోధనలో మునిగి వున్నాడు......ఎందుకు ? ఏం మీకు ఆశ్చర్యంగావుందా ? ఎందుకని ?' అని అతడు బిగ్గరగా నవ్వేశాడు. 'నా మిత్రుడు చాలా విచిత్రమైనవ్యక్తి అంబాపాలిదేవి !' అని అన్నాడు.

అంబాపాలి అతణ్ని సోఫాలో కూర్చుండజేస్తూ 'మీరు చెప్పింది నిజమే, ఆయన చేసే పరిశోధన ఏమిటో నేనూ వింటాను చెప్పండి' అని అడిగింది.

'అత డొక వికృతమైన పిల్లిపిల్లను తీసుకున్నాడు. చాలావారాలనుంచి అతడు ఆ పనిలోనే వున్నాడు. రక రకాల ఆమ్లాలు, భస్మాలు, లేహ్యాలు తినిపించి దానిని అందంగా చేయాలనుకుంటున్నాడు.'

'ఇది అతడు తక్షశిలలో నేర్చుకున్నాడా?' అని అంబాపాలి నవ్వింది.

సూర్యమణి వుత్సాహంగా 'ఆచార్య శ్వేతపదుడు అతడ్ని చాలా ప్రశంసించేవాడు. ఈ శిష్యుడు చికిత్సా శాస్త్రంలో గొప్ప మార్పు తీసుకు వస్తాడని ఆయన అంటూ వుండేవాడు. అక్కడకూడా అతడీవిధంగానే పరిశోధన చేస్తూ వుండేవాడు. నిజంగానే అతడు చాలా విచిత్రమైన మనిషి!' అని అన్నాడు.

అంబాపాలి కళ్ళు నిద్రమత్తుగా వున్నాయి. వాటిల్లో ఒక వైచిత్ర్యం వుంది. సూర్యమణి అది గమనించాడు. తెలుపు-నలుపు కొంచెం ఎర్రనైన ఈ నేత్రాలకే అతడు ముగ్ధుడైపోయేది.

అంబాపాలి కొంచెం అవకాశం యీయవలసిందని విన్నవించి కుమారగుప్తుని శయనాగారానికి వెళ్ళింది. అతడింకా నిద్రపోతున్నాడు. అతడిచెంత ఏదో కథల పుస్తకం పడివుంది. అది వ్రాతప్రతి. తాటియాకుల్ని తిన్నచేసి వాటిమీద ఏదో లేపనం పూశారు.

ఆమె పుస్తకం తెరిచిచూసి తిరిగి అక్కడే పెట్టేసింది.

కుమారగుప్తుని ముఖంమీద స్వేదబిందువులున్నాయి. ముఖంమీదపడ్డ జుట్టు అంటుకుపోయింది. ఆమె నెమ్మదిగా స్వేదాన్ని తుడిచి, వెంట్రుకలు సరిచేసింది. ఆమె నిజంగానే కుమారగుప్తుడినుంచి వేరుగావుండలేకపోయింది. అతడు లేని వైశాలి అంబాపాలికి శూన్యమే. ఆమె వంగి నెమ్మదిగా వికసిస్తూ వున్న పొన్నపువ్వులా వున్న అతని పెదవుల్ని

ముద్దుపెట్టుకుంది. అంబాపాలి పెదవుల వెచ్చదనానికి, ప్రదేశానికి కుమారగుప్తుడు చలించాడు. నెమ్మదిగా శాంతించి వత్తిగిలి మళ్ళీ నిద్రలో మునిగిపోయాడు.

అంబాపాలి కొద్ది క్షణాల వరకు అక్కడే నిల్చొని అతన్ని చూస్తూ వుండిపోయింది. తర్వాత గదినుంచి వెలుపలకు వచ్చి తిన్నగా స్నానాగారానికి వెళ్ళి ముఖం కడుక్కొని వచ్చింది.

అలంకార గృహంలోకి వెళ్ళి మబ్బురంగు వస్త్రం ధరించి, నీలవర్ణపు వల్లెవాటు వేసుకుంది. అద్దం ముందు నిల్చుంది...ఆమె అందంలో ఏమీ మార్పు రాలేదు. ఇవాల్టి వరకు కూడా ఆమె వైశాలి మొత్తంలో సర్వశ్రేష్ఠ సౌందర్యవతే. ఉల్లాస గర్వాలతో ఆమె కళ్ళు మెరిశాయి.

ఇంతలోనే చంద్రసేన గదిలోకి వచ్చింది. అంబాపాలి అప్పటికింకా అద్దంముందే నిల్చునివుంది. ఇందులో విచిత్రమేమీ లేకపోయినా అప్పుడామెకు ఎందుకనో చంద్రసేనపై కోపం వచ్చింది.

'ఏం చంద్రా, ఇంకా మరెవరైనా వచ్చారా?' అని అడిగింది.

'అవును దేవీ! ఆర్యహేమకుడు వచ్చారు.'

'కాస్సేపు నువ్వక్కడ కూర్చొని వారిని ఆనందపర్చ లేకపోయావా?' అని ఇంకొంచం కఠినంగా 'చంద్రసేనా, నువ్వు సహాయం కూడా చూడాలి' అంది.

ఆమె సనుయూన్నేమి చూస్తుంది? చూసినా చంద్రసేన నిశ్చయించలేదు. తన యజమానురాలి ప్రవర్తనకు ఆమె ఆశ్చర్యపడింది. ఆమె చెక్కిళ్ళు ఎరుపెక్కాయి.

'పచ్చనిపిల్ల!' అనుకుంది అంబాపాలి చంద్రసేన వెళ్ళినతర్వాత; 'ఓహో!' అని ఆమె అద్దంముందు నిల్చుని బిగ్గరగా నవ్వుకుంది.

ఇది ఈర్ష్యకు మొదటి సోపానం.

నిజంగానే ఆమె ఈ పచ్చనిపిల్లను చూసి ఈర్ష్యపడుతుందా? ఆమె, వైశాలిలోని సర్వశ్రేష్ఠ సుందరేనా? మళ్ళీ ఆమె అతిథి గృహంలోకి వచ్చినపుడు సాయం సమయపు ప్రథమచిహ్నాలు పొడచూపుతున్నాయి. మిత్రులిద్దరూ చంద్రసేనతో సంభాషిస్తూ వున్నారు.

'మిమ్మల్ని చాలాసేపు కూర్చోబెట్టివుంటాను. అదీ నా భయం' అని అంబాపాలి హేమాంకునుద్దేశించి అంది.

'లేదు, అదేమిలేదులెండి! మా మిత్రులిద్దరం చంద్రసేనతో మాట్లాడుతున్నాం' అన్నాడు హేమాంకుడు సహజ ధోరణిలోనే. 'మిత్రులు' అనే మాటను అతడు కొంచెం నొక్కి పలికాడు. అది సూర్యమణి నుద్దేశించే.

అంబాపాలి చిరునవ్వుచిందిస్తూ 'అది సరే, మీరేదో విచిత్ర ప్రయోగం చేస్తున్నారట!' అని కూర్చుంది. చంద్రసేన మెల్లగా కదిలిపోయి వెళ్ళిపోయింది.

హేమాంకుడు బిగ్గరగానవ్వి విచిత్రంగా చూశాడు అంబాపాలికేసి. ఆ తర్వాత సూర్యమణివంక చూశాడు.

'ఇది మా మిత్రుడు చెప్పివుంటాడు. (మళ్ళీ మిత్రుడనేమాటను నొక్కిపలికాడు.) దేవీ! అంబాపాలీ! మన జీవితమే ఒక గొప్ప ప్రయోగం. మీరు, నేను, నా మిత్రుడు (పెదవులు వంక్రించాయి) ఏం చేస్తున్నాం? ఒక ప్రయోగమేనా లేక మరేదన్నానా? అటువంటిదే నేనొక పరిశోధన చేస్తున్నాను. అయితే మార్గం వేరు. చేస్తూవుంది మాత్రం ఒకేపని' అన్నాడు హేమాంకుడు.

అంబాపాలి మందహాసం చేస్తూ 'మహాశయా, క్షమించాలి. మీకు విచిత్రంగా వుండటం ఇష్టం. అంతేగదూ?' అంది.

ఆమాట హేమాంకునికిసూటిగాతగిలింది. కాని అతడు వెంటనే నిగ్రహించుకుని గంభీరంగా 'ప్రతి మనిషీ అంతర్గతంగా విచిత్రమైనవాడే. నేను అర్థం చేసుకుంది ఇదే. చికిత్సశాస్త్రాన్ననుసరించి మనం అందరం ఒకేరకంగా వున్నా విచిత్రమైనవాళ్ళమే. ప్రకృతిలో వైరుధ్యం వున్నంతగా సమానత్వం లేదు. (చిరునవ్వు నవ్వి) మీరు వైశాలి మొత్తంలో అందరికంటే విచిత్రమైన స్త్రీలుగారా?' అన్నాడు.

'ఇది నేను పొగడ్త అనుకోనా?' అని కళావిహీనమైన ముఖంతో అడిగింది అంబాపాలి.

చటుక్కున హేమాంకుడు కాఠిన్యం వహించి 'నేనివాళ్టివరకు ఏ స్త్రీని ప్రశంసించి వుండలేదు దేవీ! నేను అందర్నీ విచిత్రంగానే భావించాను. ప్రశంసాపాత్రులుగా ఎవ్వర్నీ భావించలేదు' అని అన్నాడు.

అంబాపాలి అరుణిమం దాల్చింది. సూర్యమణి ముఖంలో వ్యతిరేక చిహ్నాలు ప్రస్ఫుటమయాయి. 'నేను మిమ్మల్ని గుర్తించటంలో పొరబడలేదు హేమాంక్' అంది మెల్లగా అంబాపాలి.

'హేమాంక్ ! నిజంగా నువ్వు చాలా విచిత్రమైనవాడివి. ఏం దేవి! నేను చెప్పానుగదూ!' అన్నాడు సూర్యమణి.

అతడు అంబాపాలివైపుకు తిరిగాడు. అంబాపాలి కొంచెం కోపంగా, రెప్పవేయకుండా హేమాంకుని కేసి చూస్తోంది. సర్వశ్రేష్ఠ సుందరి కిది నిజంగానే అయిష్టం కలిగించే విషయం. చతురుడైన హేమాంకు డిది గ్రహించాడు. అతడు చిరునవ్వు నవ్వుతూ ఆమె కేసి చూశాడు.

అతడు అదేవిధంగా వక్రదరహాసంతో 'నేను ముఖస్తుతి చేసేవాడిని కాదనుకుంటున్నాను' అన్నాను.

'నేను అందమైన యువతిని ప్రశంసించటానికి కవిత్వం వ్రాయను దేవీ. క్షమించు.'

కవి సూర్యమణిని, అంబాపాలి నుద్దేశించి ఒకే మాటలో వ్యంగ్యభావం వుంది.

సూర్యమణి విలవిల లాడాడు.

వెంటనే అంబాపాలి విషయాన్ని మార్చేదృష్టితో 'హేమాంక్ చాలారోజుల్నుంచి నువ్విటు రానేలేదు, నీ మాటలధోరణి కూడా మారింది (చిరునవ్వుతో) నీ పరిశోధన......' అంటూ వుండగా హేమాంకుడు మధ్యలోనే

అందుకుని 'నిజంగానే మీతో పోటీపడి జయించటం చాలా కష్టం. నేను సుశ్రుతుణ్ణి ఎక్కువగా చదివాను. కొన్ని నాడుల్లోని రక్తపరివర్తనవల్ల ఒక కురూపియైన స్త్రీ (మందహాసం చేసి) ఉదాహరణకు వైశాలి సర్వశ్రేష్ఠ సౌందర్యవతి కాగల్గుతుంది' అని చెప్పాడు.

అంబాపాలి చిరునవ్వు మరింత వికసించింది. 'అయితే మీరు వైశాలిలోని స్త్రీలను బాగా ఆకర్షించ గలుగుతారు. మీ ఈ పరిశోధన ఎప్పుడు విజయం పొందుతుంది'? అని అడిగింది.

హేమాంకుడు నవ్వి 'మీకు భయపడాల్సిన అవసరం ఏమీలేదు. నిశ్చయంగానే, పరిశోధన ఇంతలో ఫలించే సూచనలేమీ లేవు. నే నిప్పుడు పరిశోధన చేసేది స్త్రీమీద కూడాకాదు' అన్నాడు.

'మీరు దేనిమీద పరిశోధన చేస్తున్నారో నేను చెప్ప గలను' అంది అంబాపాలి నవ్వుతూ.

హేమాంకుడు కొంచెం సిగ్గుపడుతూ 'నా పరిశోధనన్ని గురించి నేను సిగ్గుపడాల్సిన అవసరమేమీ లేదు. సౌందర్యాన్ని, యౌవ్వనాన్ని స్థిరంగావుంచే రసాయన పదార్థాన్ని నేను పరిశోధిస్తున్నాను' అని చెప్పాడు.

'సౌందర్య, యౌవ్వనాల అమరత్వం!' అని అతడు అదేమాటను రెట్టించాడు. ఆ మాటలు అంబాపాలిమీద బాగా పనిచేశాయి. ఆమె తెలుసుకోవాలనే ఆసక్తితో అతని ముఖంలోకి చూడసాగింది. అంబాపాలినేత్రాలు దరహాసంతో

కాంతివంతంగా వున్నాయి. ఇటువంటి రసాయనం విషయంలో ఆమె కేమాత్రం నమ్మకం కలగడంలేదని ఆమె ముఖ లక్షణాలవల్ల స్పష్టమవుతుంది.

ఆమె ఏమాత్రం చలించకుండా 'మీరు విజయం పొందేట్లు భగవంతు డనుగ్రహించుగాక ! సౌందర్యాన్ని మీరు వైశాలిలోని ప్రతియువతికీ పంచిపెట్టినా అంబాపాలికి ఏమాత్రం దుఃఖం కలుగదు; విచారమూ లేదు' అని అంది. ఈమాట అని ఆమె నవ్వి ఒకక్షణం ఆగి 'ఈ అమరయావ్వనం అంత కోరతగిందికాదు హేమాంక్...ఏం కవీ ?' అని ఆమె సూర్యమణికేసి చూసింది. ఆమె విచిత్రమైన దరహాసంతో లేస్తూ 'ఇహ నేను శలవు తీసుకుంటాను, నువ్వొళ్తావా సూర్య మణి ?' అంది.

# 8

సన్యాసులారా ! ఆనందుడు చెప్పిన తర్వాత తథాగతుడు సంఘంలో స్త్రీలను చేర్చుకుంటానికి కూడా అనుమతి నిచ్చి వున్నాడు. వారు 'థేరీ' లని పిలువబడుతారు. వారి విహారాలు ప్రత్యేకంగా వుంటాయి. వారి దీక్షసంబంధమైన ఏర్పాట్లుకూడా ప్రత్యేకమైనవి' అని ఆచార్య ప్రబుద్ధకేతువు ఉపదేశించాడు.

'వృద్ధమహాశయా, మృత్యువు స్త్రీరూపంధరించి తథా గతుణ్ణి ఆశపెట్టింది. అటువంటప్పు డిది శుభప్రదమైన దవు తుందా ?' ఒక భిక్షు ప్రశ్నించాడు.

'నీకు సందేహం వుండటంలో తప్పేమీ లేదు. భిక్షు లారా! సందేహమే మనల్ని సత్యం వేపుకు తీసుకుపోతుంది. తథాగతుడు సందేహించాడు_'ఆనందము, కోర్కెలు, ఐశ్వ ర్యములతో కూడిన దేహము ఏమిటి ? దుఃఖము; కష్టము, జరామరణాలు ఇవి అనాదినుంచీ వున్నవేనా? ఇవిసత్యమేనా? అంధకారము, వెలుగు అనేవి సత్యానికివుండే రెండు విభిన్న వస్తువులా? జీవితరహస్యం ఏమిటి ? ఈ సందేహంతోనే ఆయ నలో జిజ్ఞాస జనించింది. ఆయనకు సమాధానం లభించింది. నీ సందేహం సరియైనదే. మరణమంటే భయంవుంది. స్త్రీఅంటే భయంవుంది. స్త్రీమృత్యువు. కాని మృత్యువునుంచి పారిపో వటంవల్లనే గౌతముడు బుద్ధుడయ్యాడా! బుద్ధుడు యోధుడై వుంటాడు. అతడు సత్యము, అహింస, సమానత్వ-సంఘర్షణ లనే ఖడ్గం ధరించి మృత్యువుతో తలపడ్డాడు. చివరకతడు తథాగతు డవగల్గుతాడు. ఆత్మను విముక్తిదెసకు నడిపించే వాడే నిజానికి శుభాకాంక్షి. శుభం లోన వుంటుంది.' అని చెప్పాడు.

అందరూ శాంతంగా వింటున్నారు. వృద్ధ ఆచార్యుడు ఇంకా చెప్తూనేవున్నాడు—'జ్ఞానంపొందిన ఆయన మాటల్ని నమ్మండి. శుభాశుభాలు, లోన _ బయట అంటూ ఏమీ లేవు. నిర్ణీతమైన ఒక చక్రంవలె ఈ జీవితం దానంతటదే

తిరుగుతూవుంటుంది. దీనికి ఎప్పుడు, ఎలా గమనం వచ్చింది; ఎవరీ గమనాన్నిచ్చారు — అనే ప్రశ్నలు మనల్ని వాస్తవాన్నుంచి దూరంచేస్తాయి.

'భిక్షులారా! ఈ చక్రంపై మనస్థానం ఏమిటి? మనం మన గమనాన్నికూడా దీని గమనాని కనుకూలంగా మార్చుకోవాలా? లేక ప్రతికూలంగానా? ప్రపంచాన్నుంచి విరక్తి చెందటం తథాగతుని మతంగాదు. జీవితంలోని మహత్తరమైన ప్రశ్నలయెడ దానికి ఆసక్తి వుంది. కాని అది ప్రశ్నల్ని పట్టుకుని వ్రేల్లాడుతూ కూర్చోదు. మానవునివల్లనే మతాలన్నీ, అయితే తథాగతుడు ఇంతకంటేకూడా ముందుకుపోయి 'ప్రాణి అనేదాని నిమిత్తమే మతాలన్నీ' అని చెప్పాడు. అంటే దీనివల్ల ఏం తెలుస్తుంది? మతమనేది అందర్నీ కూడ దీసుకుని నడుస్తుందనే. అది సహకారం. ఇది వ్యక్తికోసం కూడాను. అంతకంటే సమాజంనిమిత్తం ఇంకా ఎక్కువ అది వ్యక్తికీ వ్యక్తికీ, వ్యక్తికీ ప్రపంచానికి వున్న సత్సంబంధాన్ని చెప్తుంది. జీవితంలోని అన్ని అవయవాలకు సంబంధాన్ని ఏర్పరచే తథాగతుని మతానికి జయం కల్గుగాక!'

'ధర్మానికి జయం కల్గుగాక!' అని ప్రతిధ్వనించారు భిక్షులందరూ.

'ఈధర్మాన్ని పరిపూర్ణంగావుంచే సంఘంవర్ధిల్లుగాక!' అన్నాడు ఆచార్యుడు. 'సంఘం వర్ధిల్లుగాక!' అని భిక్షులందరూ నినదించారు.

'సంఘానికి ప్రాణసమానమైన బుద్ధుడు వర్ధిల్లుగాక'

'బుద్ధుడు వర్ధిల్లుగాక!' కంఠాలన్నీ మార్మోగాయి.

ఆచార్యుని ఉపదేశం సమాప్తమయింది.

భిక్షులు భిక్ష నిమిత్తం నగరంలోకి వెళ్ళారు. నలుగు రేసి కలిసి ఒకటిగా వెళుతూవుండేవారు.

'ఈ సంవత్సరం వసంతోత్సవ సందర్భంలో బలి జరుగుతుందా?' అని ప్రశ్నించాడు ఒక భిక్షు.

ఆచార్యుడు విచారవదనంతో 'తథాగతుని మతం ప్రేమమతం. ద్వేషం ద్వేషాన్ని రూపుమాపదు, ప్రేమ ద్వేషాన్ని జయిస్తుంది. అంచేతే క్రితంసంవత్సరం నేను బలిని నిరోధించేప్పుడు అడ్డువచ్చాను... ఈ సంవత్సరంకూడా మనం శాంతం వహించాలి' అని చెప్పాడు.

'అయితే ఇలా ఎంతకాలమని?' అని ప్రశ్నించాడు ఒక భిక్షువు.

'ప్రజలు తమంతటతాము ఆపనంతకాలమూ. భిక్షూ! నెమ్మదిగా నిర్ణీత గమనంతో ఆ చక్రగమనం పరివర్తన చెందుతుంది. తథాగతుని మతం లోకలోకాల్లో వ్యాపిస్తుంది. ఇది వ్యాప్తిచెందటం మనం ఇప్పుడే చూస్తున్నాం. పశుబలి ఆగిపోతుంది' అని మందహాసంచేస్తూ 'కాని, యువకుడా, ఇదంతా ఇప్పుడప్పుడే ఒక్కరోజులో జరుగదు' అన్నాడు.

ఆయన మౌనం వహించాడు. వారెప్పుడు నగర పశ్చిమద్వారంనుంచి ప్రవేశిస్తున్నారు. ద్వారపాలకుడు భక్తి భావంతో ప్రబుద్ధకేతునికి నమస్కరించాడు.

'బుద్ధం శరణంగచ్ఛామి ! శుభం ! నగరంలో క్షేమమేనా ?' అన్నాడు ఆచార్యుడు.

ద్వారపాలకుడు నమస్కరిస్తూ 'జయం ! నగరంలో క్షేమమే' అని చెప్పాడు.

ఆచార్యుడు భిక్షులతోపాటు ముందుకు సాగిపోయాడు. ద్వారపాలకుడు 'ఎంత ఆశ్చర్యం ! ఇంతమనుష్యులు వీరే భిక్షులైపోతే నగరం సన్యాస నిలయమవుతుంది. వీరందరూ సంసారాన్ని త్యజిస్తున్నారా ?' అన్నాడు.

'అలా అయితే మన కిహ శలవే !' అన్నాడు అతడి తోటివాడు.

'అవు నవును, అప్పు డిహ— ఈ కోట గోడలు, కటకటాలు ఎందుకు? చోరులభయం, సెట్టులు, శ్రేణులు వారికి భయపడ్తారు. డబ్బేలేనప్పుడు చోరు లెందుకు వస్తారు ? బంగారం ధర పెరిగిందని నువ్వు విన్నావా ?'

'ఇక్కడ బంగారం ఎవరిదగ్గరుందిగనుక? ఇక మనదగ్గరుందే, దానికి ధర హెచ్చటం— తగ్గటం అనేది లేదు.'

'అవు నవును. మనమిప్పుడు మాట్లాడుతుంది శలవును గురించికదూ ! వైశాలి పాడుబడిపోతే నువ్వేంచేస్తావు ?'

'ఏం ? కావల్సినన్ని పనులున్నాయి. కమ్మరం, వడ్రంగం ఎన్నిపనులులేవు?...జనమిక ఇండ్లల్లోవుండరా ?'

వుంటారు, కానీ...నువ్వీబౌద్ధుల నివాసం చూశావా ఎంత వికృతంగా వుంటుందో?'

ఇంతలో మాంసం తట్టల నెత్తుకొని కొందరు చండాలుర నగరంలోకి ప్రవేశించారు. మొదటి ద్వారపాలకుడు వారిని ఆపి 'ఎక్కడినుంచి తెస్తున్నారు? ఎక్కడికి తీసుక పోతున్నారు? దుకాణాలకా, సంతలకా?' అని అడిగాడు.

'సంతలకే బాబూ!'

ద్వారపాలకుడు తృషిత నేత్రాలలో గంపలకేసి చూశాడు. 'ఏమి మాంసమిది?' అని అడిగాడు ఆశగా.

'లేడి, అడవిపక్షులు వగైరాలది.'

'మీవద్ద చేపలున్నాయా?' అని ద్వారపాలకుడు రెండవవానికేసి తిరిగి 'వీరికి అనుమతిపత్రా లిద్దామా?' అని అడిగాడు.

చండాలురకేసి కనుసైగచేసి 'మీకు అనుమతిపత్రం లభిస్తుందిలే. మీ యిష్టం, వైశాలిలోని సంతలన్నీ తిరగొచ్చు మీరు. అంగళ్ళకుమాత్రం వెళ్ళగూడదు' అని నవ్వుతూ 'ఇందులో తాజాగా వుండేది?' అని అడిగాడు.

'అంతా తాజాదే. మీ కేదన్నా కావాలా?' అని ఒక చండాలుడు గంపను దించుకున్నాడు. ద్వారపాలకుడు పైన కప్పివున్న వస్త్రాన్ని తొలగించి చూచాడు.

'ఏదో ఒకటివ్వు. త్వరగా కానీ. నీకు అనుమతిపత్రం ఇస్తాం. అందులో మహాద్వారపాలకుని అనుమతి వుంటుంది. నీ వద్దనున్న మాంసం శ్రేష్ఠమైనదని దాన్నిలో వ్రాసి వుంటుంది. మీ రెందరు?'

కాన్సేపట్లో బేరం కుదిరిపోయింది. అనుమతిపత్రం తీసుకొని చండాలురు సంతలకేసి వెళ్ళిపోయారు.

రెండవ ద్వారపాలకుడు చిరునవ్వుతో 'శర్మిష్టా, బేరం చేయటం నీకు బాగా తెలుసునే' అన్నాడు.

మొదటి ద్వారపాలకుడు తన దుస్తులు వదలి పౌర దుస్తులు ధరించసాగాడు. ఇంతలో గుర్రముల గిట్టల ధ్వని విన్పించింది. అతడు వదలిన దుస్తుల్ని పైన వేసుకొని ఖడ్గం తీసుకొని అటునిటు తిరగసాగాడు. ఇంతలో కొందరు గుర్రపురౌతులు వచ్చారు. వారిలో ముందున్నవానిని చూసి ద్వారపాలకు లిద్దరూ నమస్కరించారు, గుర్రాలు ఆగిపోయాయి.

'నగరంలో క్షేమమేనా?'

'క్షేమమే. సైన్యాధికారికి జయం!' అన్నాడు మొదటి ద్వారపాలకుడు.

రౌతులు గుర్రాలను మడిమలతో అదలించి నగరు నుంచే బైటకు వెళ్ళిపోయారు.

ఆ తర్వాత ద్వారపాలకు లిద్దరికీ కాస్సేపు సంభాషణ జరిగింది. బాగా ప్రొద్దెక్కింది. రాత్రంతా కాపలాకాసిన ద్వారపాలకుడు తననంతు మాంసం తీసుకుని వెళ్ళిపోయాడు. మరొకక్షణంలో భిక్షులు తిరిగివచ్చి తమ విహారంవైపుకు వెళ్ళిపోయారు.

విహారంలో కొందరు తాటియాకులమీద ప్రబుద్ధ కేతుడు వ్రాసిన ఉపదేశాల్ని చదువుతున్నారు.

వారు లేచి నిల్చుని ఆచార్యుని చేతిలోని కమండ లాన్ని అందుకున్నారు.

సాయంత్రం ఉపదేశ సమయమందు ప్రబుద్ధకేతుడు 'భిక్షులారా! లెక్కనుబట్టి బుద్ధుడు త్వరగా ఈ నగరానికి రానున్నారని తెలుస్తుంది' అని చెప్పాడు.

భిక్షులకళ్ళు ఆనందంతో మెరిశాయి. 'తథాగతుని యిష్టం!' అన్నారు అందరూ.

'ఆయన రాకకు ప్రత్యేకమైన ఏర్పాట్లేమీ అవసరం లేదు. ఆయన వచ్చేంతవరకు పరిషత్తు బలిని ఆపివేస్తుంది. అనేకమంది పౌరులు తథాగతుని శిష్యులవుతారు. ఇది నేను జ్యోతిష్యంద్వారా తెలుసుకున్నాను' అని ఆచార్యుడు చెప్పాడు.

'మరి మా కేమి ఆజ్ఞ?'

'నేను లెక్కనిపట్టి తెలుసుకున్న విషయ మేమంటే; వైశాలిలోని వేశ్య అంబాపాలి, ఆమె ప్రేమికుడు కుమార గుప్తుడు ఈ ధర్మచక్ర పరివర్తనలో ప్రముఖంగా పాల్గొం టారు. నేను వారికి జాబువ్రాసి తెలియజేస్తాను. తర్వాత తథాగతుని కోర్కె నెరవేరుతుంది.'

ఆచార్య ప్రబుద్ధగుప్తుడు బుద్ధునికిముందు మహాకశ్య పుని శిష్యుడు. ఆయన తాంత్రికవిద్యను బాగా అధ్యయనం చేశాడు. బౌద్ధుడైనతర్వాత ఆయన దానిని బౌద్ధమతప్రచారం కోసం వినియోగించేవాడు, లేకపోతే లేనేలేదు. తాంత్రిక

విద్యకు జ్యోతిష్యం తెలియటం కూడా అవసరం. అంచేతే ఆయనకు లెక్కగట్టటం బాగా తెలుసు.

ఆ రోజు ఆయన రెండు ఉత్తరాలు వ్రాశాడు. ఒకటి కుమారగుప్తునికి, మరొకటి అంబాపాలికి.

# 9

కుమారగుప్తుడు హేమాంకుని మాటల్తో ధైర్యం కోల్పోయాడు. అతడి జీవితం ఇంతవరకు నిద్రితమైయున్న అగ్నిపర్వతంలాంటిది. ఇప్పుడు దానిలో బ్రద్దలవటానికి ముందుండే లక్షణాలు కన్పించసాగా యతడికి. ఆ రోజున అంబాపాలి సూర్యమణి, హేమాంకులను సాగనంపినతరువాత మళ్ళీ ఉద్రేకపడింది. అతడు కించపర్చటం ఆమెకు పూర్తిగా అసంతృప్తి కల్గించింది. తానొక ప్రేమికునికి తన సర్వస్వాన్ని అర్పించింది. అదే యీడుగల మరొక యువకుడు తన నింత చులకనగా చూడడమంటే ఆమెకు అసంతృప్తే కల్గింది. ఆనాటినుంచి హేమాంకుడు వచ్చినప్పుడు ప్రతిసారి తాను కూడా దగ్గర వుండటమే మంచిదని భావించాడు కుమారగుప్తుడు. నెమ్మది నెమ్మదిగా అతడు హేమాంకుని మాటల్ని ఖండించసాగాడు. హేమాంకుడు తన వ్యంగ్య బాణాలను అతడిమీదికికూడా వదల నారంభించాడు.

ఈ నలుగురు వ్యక్తులకు మధ్య ఒక విచిత్రమైన సంబంధం ఏర్పడివుంది. అదే సమయంలో అంబాపాలి, కుమారగుప్తులకు ఆచార్య ప్రబుద్ధకేతుని జాబులు అందాయి. అంబాపాలి కిలకిల నవ్వుతూ ఉత్తరాన్ని కుమారగుప్తుని మీదకు విసిరేసింది. కాని కుమారగుప్తుడు గాంభీర్యం వహించాడు.

'అంబాపాలీ, ఆచార్య ప్రబుద్ధకేతుడు నాకు తెలుసు. ఆయన తేలికభావంతో దీని నెంతమాత్రం వ్రాసియుండరు. ఆయన గొప్ప గణితజ్ఞులు' అన్నాడు కుమారగుప్తుడు.

అంబాపాలి అదేవిధంగా నవ్వుతూ 'కుమారగుప్తా! నే నీ గణితాలను, ఈ జ్యోతిష్యాన్ని నమ్మను. ఇది ఆచార్యుల వారి ప్రచారబుద్ధి' అని అంది.

అతడు మౌనం వహించాడు. అతడు తన దృష్టిని అంబాపాలిపైనుంచి మళ్ళించాడు. కాస్సేపు ఇద్దరూ మౌనం వహించారు.

చివరకు కుమారగుప్తుడు మౌనభంగంచేస్తూ 'అంబాపాలీ, మనం ఒక పెద్ద చక్రంమీద ఎక్కాల్సివస్తుందనే కన్పిస్తుంది. దానిమీదకు ఎక్కి మనమిక దిగలేము. కాని అందులో నే మనకు, ప్రపంచానికి శుభం కల్గుతుంది. ఆచార్యుల వారి ఈజాబు దానికి సంకేతమే' అన్నాడు.

అంబాపాలి అనుమానంగా అతని కేసి చూచింది.

'నేను నీకు చెప్పాను గదూ, హేమాంకుని మాటలు విన్నప్పుడే అతడు నా జీవితంలోకి అమంగళం తీసుకొచ్చా

డని గ్రహించాను. ఆకర్షణీయమైనదైనా అతి ఘోరమైన కల్పన నొకదాన్ని నా ముందుంచాడు. అతడి అమర యౌవనం...' అని ఆమె అనగా కుమారగుప్తుడు అందుకుని 'నాకు తెలుసు. నీలాంటి స్త్రీకి కల్పన శాంతపర్చేదిగా వుంటుంది. హేమాంకుడు ఇది నీముం దెందుకు వుంచాడో నువ్వు గ్రహించావా?' అన్నాడు.

అంబాపాలి తలాడించింది.

కుమారగుప్తుడు నవ్వాడు. 'నువ్వు చాలా అమాయకురాలివి. అతడు నీ జీవితంలో అడుగుపెట్ట గోరుతున్నాడు' అన్నాడు కుమారగుప్తుడు.

అంబాపాలి మందహాసంచేస్తూ 'నువ్వు చెప్పేది నిజమే. అతడు ద్వేషంద్వారా నా జీవితంలో ప్రవేశించ గోరుతున్నాడు.' అని వంగి కుమారగుప్తుని లలాటాన్ని ముద్దు పెట్టుకుంది.

'మీ పురుషులందరూ చాలా యీర్ష్యాళువులు' అని అంబాపాలి స్నిగ్ధదృష్టితో అతడికేసి చూస్తూ 'నువ్వు ఇది గ్రహించినందుకు నేను నిన్నేమీ అభినందించను' అంది.

కుమారగుప్తుడు గంభీరభావంతో 'అంబా, నువ్వెంత పెద్ద భూకంపానివో నీకు తెలియదు. నువ్వు నవ్వుతున్నావు. ఇది నీకు తెలియదుగాని ఇదొక ప్రవాహం. మేమందరం నిస్సహాయులం. ప్రవహిస్తూ అగ్నిపర్వతపుశిఖరాగ్రానికి రావటం ప్రేలుడులోపడి మృత్యువును పొందటం—ఇదే నియమం' అని అన్నాడు.

తటాలున అంబాపాలి కూడా గాంభీర్యం వహించి 'అయితే ఆ నియమం పూర్తియగుగాక !' అని 'కుమార గుప్తా, నేనుకూడా జీవితాన్నిగురించి ఆలోచించాను. ప్రతి పర్యాయం నేను నియమం పూర్తవుతుంది అనే నిశ్చయానికే వచ్చాను. నేను, నువ్వు, అతడు ! ఏం ? సమాధానంలేదు, జవాబేలేదు. నేనొకవేళ వృధ్వివలె క్రిందికి కుంచించుకు పోతుంటే అదే ఆకర్షణ—పతనం—ఇదే నియమం. నా సౌందర్య మింకా చల్లబడలేదు. స్త్రీ ప్రేమ ఎప్పుడూ చల్లబడదు. గుమారగుప్తా, నీకా సమర్థుడు తెలుసా ?' అంది.

కుమారగుప్తుడు అంగీకారంగా తలాడించాడు.

'ఒకసారి అతడు నా జీవితంలో ప్రవేశించ దలచాడు' అని ఆమె కొంచెంగా నవ్వి 'నీవద్ద దాచాలని నే నెప్పుడూ యత్నించలేను. సమర్థుడు వచ్చాడు, ఎందరో యువకులు వచ్చారు. ఇవాళ నేను వాళ్ళను స్వప్నంలో చూసినా భయంతో కంపించిపోతాను. నేను వాళ్ళతో ఆటాడాను. వాళ్ళ రెక్కలు కాలిపోయాయి. నే నా మంటలు మెరుస్తూండ టము చూసి ఆనందంతో కేకలేశాను—నన్ను కేంద్రంగా చేసుకుని నాచుట్టూ ఎన్నోనీడల ఆకారాలు తిరుగుతూ వుండటం నేను స్పష్టంగా చూస్తున్నాను. వారి పెదవులు శుష్కించిపోయాయి, వారిశరీరాలు కృశించి ఎముకలప్రోగు లయాయి, వారి కళ్ళనుంచి ఎడతెగని జలప్రవాహం ప్రవ హిస్తుంది. ఆరోగ్యవంతులు, దృఢకాయులైన ఆ యువకులు నేడు ప్రేతాలు' అంది. అని ఆమె ఆగిపోయింది.

మళ్ళీ అకస్మాత్తుగా తీవ్రపడి 'దోషి ఎవరు? అంబాపాలా? సమర్థుడా? ఆ యువకులా? దోషులెవరు కుమారగుప్తా? అప్పుడే నువ్వొచ్చావు. నా అంతట నేనుగా నీ చుట్టూ తిసుగుతూ దహించుకపోసాగాను. మొదటిపర్యాయం ఒక భీషణమైన, సముద్రాన్నే ఇంకింపజేయగల దాహం నాలో గూడు కట్టుకుంది. కాని ప్రశ్న బహిరంగమేనా? దోషిఎవరు?' అంది. కుమారగుప్తుడు ఆమె చేతిని నిమురుతూ 'దోషి ఎవరా? ఎవరూ దోషికారు. కాని అంబికా, ఆచక్రం ఇప్పుడిహా ఆగిపోయింది. నాకు ఆచార్య ప్రబుద్ధగుప్తుని మాట గుర్తొస్తుంది. కాని మరోవిషయం—అప్పుడు నేను గాంధారంలో వుండేవాడిని, ఒకనాడు నేను పర్వతాలమీద తిరుగుతున్నాను. వసంతకాలం. అక్కడక్కడ బండల చాటునుంచే చెట్లు కనిపిస్తున్నాయి. అక్కడ నే నేమి చూశానో తెలుసా?' అని అడిగాడు.

అంబాపాలి బదులు పలకలేదు. ఆమె పరధ్యానంగా వుంది. ఏదో ఆలోచనలో మునిగివుంది.

"నేనేం చూశానంటే— తెల్లని చిన్ని దుస్తుల్ని నిండుగా ధరించి ఒకయువతి—మంచువలె తెల్లగావుంది—నన్ను పిలుస్తూ వుంది. నేనామెవద్దకు వెళ్ళాను. ఆమె తన ముఖంమీది అడ్డును తొలగించింది. 'ఏం, నువ్వు భయపడటంలేదా?' అని అడిగింది. నేను నవ్వాను.

'నేను నీ జీవితపు అలజడిని గుర్తించాను. కుమారగుప్తా, నువ్వు నిర్మల ప్రవాహంవలె ప్రవహిస్తావు. అలాగే

ప్రవహిస్తుంటావు ... అలాగే ... ప్రవహించటం ... ప్రవహించటం ఇతరులకు మినహాయింపే, నీకుమాత్రం నియమం. నువ్వొక గొప్పపరివర్తనకు సహాయకుడ వవుతావు' అంది ఆమె. 'నువ్వెవరు ? నేను నీ కెలా తెలుసు ?' అని అడిగాను. 'అది నీకు తెలియదు. నువ్వొక గొప్ప పరివర్తనకు సహాయకుడ వవుతావు. కాని ప్రపంచం నిన్ను మర్చిపోతుంది; నీతో సంబంధ ముంటే ఒక యువతిని ప్రపంచం గుర్తుంచుకుంటుంది. చాలా ఆశ్చర్యమైన విషయంగదూ ?' అంది.

నిజంగానే నాకు ఆశ్చర్యం కల్గింది.

'నే నా యువతి ఆత్మను. నువ్వామెను వెదుకు. మీా రిద్దరూ ఒక మహత్తరమైన సూత్రంలో ముడివడి వున్నారు' అని చెప్పింది ఆమె. ఆ తర్వాత ఆమె అంతర్థానమైపోయింది. అంబాపాలీ ఆమె నన్ను ఎన్నినాళ్ళు పిచ్చివాణ్ణిగా చేసిందో నీకు తెలుసా ?"

అంబాపాలి కళ్ళు చిరునవ్వుతో మెరిశాయి. ఆమె నవ్వుతూ 'కుమారగుప్తా, నువ్వు నా ఆత్మను చూశావు. నాకు అది తెలియనే తెలియదు. పురుషులందరూ కవులేనా ? నీకు తెలుసా ఇది ? వారు కలలుగంటారు. అందమైన స్త్రీ వారి కలలకు సహాయపడుతూ వుంటుంది' అంది. అని ఆమె నవ్వింది.

మూాడురోజుల నంతరం అంబాపాలి స్వప్నంలో తనను పిలుస్తూన్న ఒక శ్వేతహస్తాన్ని చూసింది. ఆమె ముందుకు వెళ్ళింది, ఇంకా ముందుకు వెళ్ళింది, ఇంకా

ముందుకు వెళ్ళింది. చివరకు సముద్రతీరం వరకు వెళ్ళి ఆగి పోయింది. అక్కడ ఒక పెద్దనావ ఆమెకై నిరీక్షిస్తూ వుంది.

ప్రధాన నావికునికి నమస్కరిస్తూ 'నే నెక్కడికీ వెళ్ళ దలచడంలేదే. నే నిక్కడే సంతృప్తిగా వున్నాను. నన్నిక్కడి వరకు ఎవరు తీసుకొచ్చారు ?' అని అడిగింది.

నావికుడు విచిత్రంగా నవ్వాడు. 'దానినే అదృష్టం అంటారు. నువ్వు మా వెంట రావాలి' అన్నాడు.

నెమ్మదిగా ఆమెను తీసుకొని నావ సముద్రగర్భంలో ముందుకు సాగుతు ది.

భయంతో అరుస్తూ ఆమె మేల్కొంది.

కాస్సేపటి తర్వాత తన ఈ విచిత్ర స్వప్నానికి ఆమె నవ్వుకుంది. కాని కుమారగుప్తునికి ఆమె ఏమీ చెప్పలేదు.

అదృష్టం ఆమెను ఆకర్షిస్తుందా ?

# 10

వృద్ధుని దుకాణం ముందు జనం గుమిగూడి వున్నారు. రకరకాల చినిగిన దుస్తులు ధరించిన దుర్వాసన కొడుతున్న జనం వచ్చి మద్యం సేవిస్తారు. కాని ఈ గుంపు చేరడానికి కారణం వేరు.

అతడి కుమారుడు జమదగ్గి నగర రక్షకుల చేతికి చిక్కాడు. వాళ్ళతణ్ణి కొట్టుకుంటూ దుకాణం దగ్గరకు

తీసుకొచ్చారు. 'ఇదిగో ఇతణ్ణి చూడు, నీ కొడుకే గదూ ?' అని అడిగాడు వృద్ధుణ్ణి.

'అవునండి' అని, 'ఏమిటిరా ఇది ?' అని అడుగుతూ ఆ పాతకర్రనే తీసుకుని ఆ కుర్రాడిని పెడిపెడి బాదసాగాడు.

అక్కడ మూగిన జనం కుర్రాడిని విడిపించారు. వృద్ధుడు రొప్పుతూ రోజుతూ, కుర్రాడిని తిడ్తూ, తన విచిత్ర పాన పాత్రల మధ్యకు వెళ్ళి కూర్చున్నాడు.

'మరి కుర్రవాడి నింత విచ్చలవిడిగా వదిలేశా వెందుకని ?' అని ప్రశ్నించా డొక నగరరక్షకుడు.

'అన్నదాతా ! ఈ విశ్వాసఘాతుకుణ్ణి......(కుర్రవాని కేసి క్రోధంగా చూస్తూ)...వీణ్ణి నేను తీసుకొచ్చేశాను. ఇన్నేళ్ళు పెంచి పెద్దచేశాను, ఇవాళ్టికి వీడు నన్ను వదిలి పోతున్నాడు.'

మద్యం సేవించేవారిలో ఒక వ్యక్తి 'కాలం మంచిది కాదు. అయినా ఎంతైనా పరాయిబిడ్డ మనవాడవుతాడా?' అన్నాడు.

వృద్ధుడు గద్దిస్తూ 'పరాయివా డెవరు ? ఏమిటి నువ్వనేది ? అప్పుడు వీడు పసికందు. నెత్తురుగుడ్డు. ఉఫ్ అంటే ఎగిరిపోతాడు. ఇంతకాలం హృదయంలో పెట్టుకు పోషించాను. వ్యర్థుడు !' అన్నాడు.

కుర్రవాడికేసి, ఆ మనిషికేసి వృద్ధుడు మిరిమిరి చూశాడు. ఇంతలో అక్కడున్న నగరరక్షకు లిద్దరూ అతడి

కంట బడ్డారు. అతడు తేరకుని వారి నుద్దేశించి 'బాబూ! కూర్చోండి, మద్యం సేవిస్తారా?' అని అడిగాడు.

'నేను మద్యం సేవించను' అన్నాడు వారిలో ఒక వ్యక్తి. అతడు గొప్పవారివలె మాట్లాడుతున్నాడు. అందు కతడికి చాలా గర్వం. అతడి నడక-నాణ్యంకూడా ఉన్నత శ్రేణుల్లోని వారివలెనే వుంటాయి. అక్కడున్నవా రందరూ అతడికేసి చూశారు. వారిలో ఒకడు మందహాసం చేశాడు. ఇది ఆ నగర రక్షకుడుకూడా గమనించాడు.

'నేనూ మద్యం సేవించాను. మద్యం సేవించటానికి కారణం స్త్రీ. నేను స్త్రీని ప్రేమించటం వదిలేశాను. మద్యం సేవించటంకూడా.' అన్నా డా నగరరక్షకుడు.

రెండవ నగర రక్షకుడు అతడికేసి చూసి చిన్నగా నవ్వాడు. అత డొక స్థూపాకారంగల పిన్నెమీద కూర్చు న్నాడు. వృద్ధుడు నింపినమద్య పాత్ర నందించాడు. అతడు దానిని త్రాగేశాడు.

మొదటి నగరరక్షకుడు చాంచల్యము, చురుకుదనంతో ఎర్రనయిన నేత్రాలతో అటు నిటు చూడసాగాడు.

అత డీవిధంగా పక్కచూపులు చూడడం గమనించిన ఒక సజ్జనుడు 'ఏం మగ్గా, నీ కూతు రెక్కడా కన్పించ లేదే!' అన్నాడు.

ఈ ప్రశ్న విని నగరరక్షకుడు సిగ్గుపడ్డాడు; మిగిలినవా రందరూ త్రుళ్ళిపడ్డారు. అక్కడవున్న వెలితేమిటో అక

స్మాత్తుగా అందరికీ బాధకల్గించింది. వాళ్ళందరూ ఆశగా వృద్ధుని కేసి చూడసాగారు.

అంగడికి ఎక్కువనుంది వచ్చినప్పుడు 'ఓ సుభాగా, అమ్మాయి సుభాగా!' అని పిలుస్తూ వుండేవాడు.

'ఏమిటి నాన్నా?' అంటూ సుభాగ తలుపు వారగా చూసేది. 'అమ్మా, ఇదిగో అతిథులు, అతిథులు! వీరికి పాత్ర లందించమ్మా!' అని త్రాగేవాళ్ళ కేసి చూసి ముసిముసినవ్వు నవ్వేవాడు. 'నాచేతులు పీక్కుపోతున్నాయి, వయస్సు మళ్ళిందిగదూ!' అనేవాడు వాళ్ళతో.

సుభాగ విచిత్రమైన పాత్రల్లో మద్యంనింపి వారికి అందించేది. ఆమె చిందించే చిరునవ్వులతో మద్యం మరింత నిషాగా వుండేది.

ఒక్కొక్కళ్ళయితే సుభాగతో పరిహాసాలాడేవారు.

'మగ్గా, నీకూతురు మాకు అంబాపాలి!' అన్నాడు ఒకనాడు ఒకవ్యక్తి.

'ధన్యవాదాలు!' అన్నాడు వృద్ధుడు కృతజ్ఞత తెలియ బరుస్తూ. ఆమె చేతిలోని పాత్రను అతడిమీద ఒలికించింది, ఆ యువకుడు మద్యంతో తడిపోసియాడు.

తమ అంబాపాలి అక్కడ లేకపోవటం ఇవాళ వారికి విచిత్రంగానే వుంది; వాళ్ళు చాలారోజుల్నుంచి ఆమెసంగతే మర్చిపోయారు.

వృద్ధుడు నవ్వుతూ మెల్లగా—'ఆమె బంధువులింటికి వెళ్ళింది; చూస్తూనే వున్నారుగా ఈడొచ్చినపిల్ల; ఒక యింటి దాన్ని చేసెయ్యాలింక' అన్నాడు.

'ఆమెను అమ్మెయ్యి' అన్నా శోకడు.

వృద్ధుడు కోపాన్నభినయిస్తూ 'సరల్గా, నువ్వికనుంచి నా అంగడికేసి రావద్దు. నీ నోరు మంచిదికాదు. సుభాగ నా కూతురని నీకు తెలుసుగా' అన్నాడు. నగరరక్షకులకేసి చూస్తూ 'పెద్దవాళ్ళంటే అన్నీ అమ్ముకుంటారు. గోవులు, ఎద్దుల్ని' దాసదాసీల్ని, భూమిని, భవనాల్ని, అమ్మాయిల్ని అన్నీ అమ్ముకుంటారు. ఈ మృగశిర ఒక పద్యానే అమ్మి తాడు. అంతటితోనే సంతోషపడ్తాడు' అన్నాడు.

ఇంతలో కుర్రవాడు అందుకుని 'నాన్నా, నువ్వు చెప్పే దంతా అబద్ధమే. అక్కను అమ్మేశావుగా?' అన్నాడు.

వృద్ధునికి క్షణకాలం నోటివెంట మాట పెగల్లేదు. మరుక్షణంలోనే కుర్రవాడిమీదికి లంఘించి క్రిందపడవేసి బాదసాగాడు.

క్రిందపడి దెబ్బలుతింటూకూడా కుర్రవాడు 'నువ్వా మెను అమ్మేశావు. ముమ్మాటికీ అమ్మేశావు. అక్క చెప్పింది గదా—మొదట...' అంటూనే వున్నాడు. వృద్ధుడు గొడ్డునలె రొప్పుతున్నాడు. చటుక్కున కుర్రవాడు వృద్ధుని చెయ్యి పట్టుకుని కరవటంతో అతడు 'అబ్బా' అని అరచి కొట్టటం మానేశాడు. 'విశ్వాసఘాతకుడా!' అని తన చేతికేసి చూసుకోసాగాడు.

నిల్చునివున్న నగర రక్షకుడు వృద్ధుణ్ణి శాంతపర్చి 'ఇదంతా మాకు తెలుసు. ఆ బాలిక నీ కూతురుకాదు. ఈ కుర్రవాడుకూడా నీ కుమారుడుకాడు. నువ్వు చేసింది వీళ్ళను

పెంచడమేగా ? 'నేను నిన్ను నగరాధిపతిదగ్గర హాజరు పెడ్తాను' అన్నాడు.

వృద్ధుడు లేచి నిలుచున్నాడు. అతడి కళ్ళనిండా నీళ్ళు నిండాయి. 'అన్నదాతా, ఆ పాండురి వాడివెంట పారిపోయింది' అంటూవుండగా మళ్ళీ కుర్రవాడు అందుకుని 'ఆమె పారిపోలేదు' అన్నాడు.

కాస్సేపటికి అంతా శాంతపడింది. నగరరక్షకు లిద్దరూ ఒకచోట కూర్చున్నారు. ఇద్దరూ మద్యం సేవించ నారంభించారు.

శుద్ధపాలీ నని గర్వించే స్త్రీ నిందకుడైన ఆ నగర రక్షకుడు తన మొదటిమాటను పూర్తిగా మర్చిపోయాడు. మిగిలినవారుకూడా ఆమాటను మర్చిపోయారు.

ఒక నవయువకుడు వచ్చాడు. మెదలకుండా ఒకమూల కూర్చున్నాడు. వృద్ధుడు చాలాసేపటివరకు అతడివంక చూడనేలేదు.

'నువ్వెంతగా పాలిపోతున్నావేం శిలాజీ ?' అన్నాడు వృద్ధుడు. యువకుడు మందహాసం చేశాడు.

శిలాజీ సమాధానం చెప్పలేదు. చివరి కతడు 'నేను చాలారోజులుగా ఇటు రావటంలేదు. నాకూ మద్యం ఇవ్వు' అన్నాడు.

'నువ్వు మద్యం తాకేవాడివే గాదుగా ?' అని వృద్ధుడు సహజస్వరంతో అడిగాడు. అంతలోనే అతడి మనస్సులో ఏదోవిషయం మెదిలింది; మరి మాట్లాడలే దతను. యువకుడు

మద్యం సేవించాడు. తర్వాత వెళ్తూ వెళ్తూ 'త్వరలోనే పరిషత్తు ఎన్నిక జరుగుతుంది. నగరపెద్ద చాలా పని అప్పగించాడు' అని తన ఆత్మసంతోషం కోసం తనకు తానే చెప్పుకున్నట్లు అని, ఎవరివైపు చూడకుండానే వెళ్ళిపోయాడు.

అప్పటికే అందరూ అధికంగా మద్యం సేవించారు. నగరరక్షకు లిద్దరికీ ఒకవిషయంలో తీవ్రంగా వాగ్వివాదం ప్రారంభమయింది. ఇద్దరూ ఒకే అమ్మాయిని ప్రేమిస్తున్నారట. మత్తు తలకు ఎక్కేసరికి ఇద్దరూ తలపడ్డారు.

'నాసంగతి నీ కేం తెలుసు ? ఈ పని నేను స్వయంగా చేశాను. నేను నీబోటి నగరరక్షకులతో మాట్లాడనుకూడాను' అన్నాడు ఒకడు.

అతడు స్వచ్ఛమైన పాలీభాష మాట్లాడుతున్నాడు.

ఇంతలోనే సమస్య విషమించిపోవటం, రెండవ నగర రక్షకుడు కత్తిదూసి దెబ్బవేయటంతో చూస్తూ చూస్తూ వుండగానే ఇద్దరూ కత్తులతో పోరాడసాగారు. జనం ఎక్కడివా రక్కడ చెదరిపోయారు. వృద్ధుడు అంగడి మూసివేసుకున్నాడు.

చాలాసేపు ఇలాగే జరుగుతూవుంది. ఇంతలో ఎవరో బిగ్గరగా 'కత్తులు దించండి' అనటం వినవచ్చింది. వృద్ధుడు తొంగిచూశాడు. ఒక రాజపురుషుడు కంబోజి అశ్వంపై అటే వస్తున్నాడు.

ఇద్దరూ కత్తులుదించి శాంతించారు. ఒకడి భుజం నుంచి రక్తం ధారగట్టింది. రెండంగుళాలలోతు గాయమైంది.

'మీ రిద్దరూ దేన్ని గురించి పోట్లాడుకుంటున్నారు? రాత్రింకా ప్రొద్దుపోకముందే అంగడి మూసేశారేం?' అని ప్రశ్నించాడా వచ్చిన వ్యక్తి.

ఇద్దరూ ఒకరిముఖం ఒకరు చూసుకున్నారు.

'ఇది మా స్వవిషయాన్ని గురించే; దేశాని కేమీ సంబంధంలేదు' అని చెప్పాడు స్వచ్ఛమైన పాలీనే గర్వించే నగరరక్షకుడు.

'ప్రజాతంత్ర ప్రకారం నేను మిమ్మల్ని బంధిస్తున్నాను. సైన్యాధికారి ఆజ్ఞ ఇది. మీరు మద్యంసేవించి దేశశాంతికి భంగకరంగా వ్యవహరించారు.'

ఇంతలోనే అనేకమంది అశ్వారోహకులు వచ్చి నగర రక్షకుల్ని చుట్టుముట్టారు. వాళ్ళు వెళ్ళిపోయినతర్వాత వృద్ధుడిక అంగడి తెరచుటకు సాహసించలేకపోయాడు. అతడు లోనికి వెళ్ళిపోయాడు. అక్కడ నిన్నవండిన అన్నం వుంది.

'జమదగ్గీ' అని అతడు బిగ్గరగా పిల్చాడు. 'బాబా నువ్వు అబద్ధమాడావు' అన్నాడు జమదగ్గికూడా బిగ్గరగా.

వృద్ధుడు ముఖం చిట్లించాడు. అతణ్ణి కొట్టాలని లేస్తూనే మళ్ళీ అంతలోనే శాంతించాడు. 'రా, రా! పోట్లాడకు. మీ అక్క మళ్ళీ వచ్చేస్తుందిలే' అన్నాడు. అని అతడు చిన్నగానవ్వాడు. ఇద్దరూ భోజనంచేశారు. కుర్రాడిని

నిద్రబుచ్చి వృద్ధుడు తానూ పడుకున్నాడు. అతడు పసుండి నీలాకాశం కేసి చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు. కాస్సేపాగి అతడు తన జేబు తడుముకున్నాడు. బంగారునాణాలు వచ్చాయి చేతిలోకి. గుప్పెడు బంగారునాణాలు. మద్యం అమ్మిన కపాహారశాల్ని దుకాణంలోనే వదిలేశాడు.

అర్ధరాత్రి గడచిపోయింది. వృద్ధుడు నిద్రపోతున్నాడు. జమదగ్ని అతణ్ణి కరుచుకుని పడుకుకున్నాడు. అకస్మాత్తుగా ద్వారం చెంత కెవరో వచ్చారు. 'నాన్నా' అన్నారు.

అది సుభాగ కంఠస్వరం.

వృద్ధుడు మేల్కొనలేదు. అతడి కేదో ధ్వని విన్పించి నట్లుంది, చిరునవ్వు నవ్వాడు. అదంతా స్వప్నమా ? సుభాగ, ఇంకే మొస్తుంది సుభాగ! కళంక విషాదఛాయ అతడి ముఖంలో స్పష్టపడింది. నిద్రపోతున్న జమదగ్నిని చూసి అతడి నడుము తడుము తూ 'నేను చేసిం దిది పాపమే' అన్నాడు.

చైత్రోత్సవానికి వైశాలిలో ఒకరోజు వేడుకలు జరుపుతారు. రాజ్యాంతరపున నాటకాలు జరుగుతాయి. ఈ సంవత్సరం జమదగ్ని నాటకాన్ని ఎన్నుకున్నారు.

నాటకం జరుగుతూంది.

మధ్యలో దృశ్యపరివర్తన సమయంలో కొంత వ్యవధి వుంటుంది. ఆ సమయాన వెలుతురు ఆర్పివేయబడింది. మళ్ళీ దీపాలన్నీ వెలిగినప్పుడు రంగస్థలంమీద ఒక విచిత్రవ్యక్తిని చూశారు ప్రేక్షకులు. ఆ వ్యక్తి పైనుంచి క్రిందివరకు నల్లని దుస్తులువేసుకుని వున్నాడు. గోధుమవర్ణపు చేతులు, భయంకరమైన క్రూరమృగం కళ్ళవంటి మెరుస్తున్న నేత్రాలు మాత్రమే కన్పిస్తున్నాయి.

కథాసందర్భంలో ఇటువంటి విచిత్రపాత్రలు ఎక్కడా లేవు. జనం ఆశ్చర్యవిచిత్రాలతో గట్టిగా కరతాళధ్వనులు చేశారు.

ఆ భయంకరనేత్రాలు మరింత మెరిశాయి. ఆ విగ్రహం రంగస్థలంనుంచి గర్జిస్తూ 'వైశాలిపౌరులారా, మీరిప్పుడు నాటకం చూడటంలేదు. మీరుకూర్చున్న నాట్యగృహ మిప్పుడు బందిఖానా. ఒక్కరైనా బయటికి వెళ్ళటానికి వీలులేదు, లోనికిరావటానికీ వీలులేదు. మీ రొక ప్రశ్నకు జవాబు చెప్పాల్సివుంది. దాన్ని మీరు నిరాకరించ వీలులేదు. ప్రజాతంత్రంలో ఒకరి తప్పులు పౌరబాట్లకు అందరికీ బాధ్యత వుంటుంది. మీరు......' అనేంతలో జనంలో కలకలం

బయలుదేరింది. విగ్రహం గర్జిస్తూ 'శాంతంగావుండండి! మీ మీ స్థానాల్లోంచి ఎవరూ కదలవద్దు. మీ ఎదుట ఇప్పుడు నిల్చునివుంది; చోరశ్రేష్ఠుడైన నృసింహుడు. ప్రతీకార భావంతో అతడిహృదయం దహించుకుపోతూంది...... నృసింహుడు.' అతడికంఠధ్వని లోన, బైట అంతటా ప్రతి ధ్వనించింది. జనం భయకంపితులైపోయారు.

'లిచ్ఛవీల ఈ పరిషత్తులో ఒక వ్యక్తి వున్నాడు. అతడు ఒకప్పుడు ఒక అసహాయురాలైన బాలికను బలాత్కారం చేశాడు. ఆమెను రక్షించేవారెవరూ లేరని అప్పుడతడికి తెలుసు. కాని నేడామె అసహాయురాలుగాదు. నేనామెను ఇక్కడకు తీసుకొచ్చి ఆమె మర్యాదకు భంగం కల్గించ దలుచుకోలేదు. కాని ఇది సత్యం. అమాత్యులు స్వర్ణసేనులుంగారు తమ హృదయాన్నొకసారి పరిశోధించుకోవాలి' అన్నాడు నృసింహుడు.

ప్రేక్షకజనమంతా నిశ్శబ్దంగావుంది. అందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు. 'వృద్ధ అమాత్యా!' అందరూ ఆశ్చర్యంగా ఎదురుగా కూర్చుని వున్న రాజ్యపరిషత్తు కేసి చూశారు.

నృసింహుడు కాస్సేపాగి 'లిచ్ఛవీ రాజపురుషులారా! మీకు తెలుసు. ఈ ప్రజాతంత్రానికి చీడపట్టటం ప్రారంభ మయింది. ఇదిగో వైశాలికేసిచూడండి ఇక్కడ; వినోదాలు, వేడుకలు, భోగాలు అన్నివేపుల నర్తిస్తున్నాయి. ఈ విధంగా ప్రజాతంత్రం సుస్థిరంగా మనగల్గుతుందా? మీరు రాజ

గృహపు సింహపాదులపేరు విన్నారా ? వారిక్కడ ప్రవేశించారు. అజాత శత్రువు గూఢచారులు మీలో కలతలు పెట్టాలనుకుంటున్నారు. మీవల్ల అయితే వారిని వెతికి పట్టుకోండి. మీ చుట్టూ ఒక సుడిగుండం తిరుగుతూంది. కాని మీ రా వైపే చూడటంలేదు. అమాత్యా, మీకే అభియోగాన్నంగీకరిస్తున్నారా ?' అన్నాడు.

అకస్మాత్తుగా వృద్ధ అమాత్యుడు తెల్లబోయాడు. లేచి నిల్చుని 'నేనే ప్రప్రథమ పొరపాటును అంగీకరిస్తున్నాను' అని చెప్పాడు.

భయంకర నేత్రాలు తళుక్కుమన్నాయి. నృసింహుడు చేయి చాచాడు. నల్లని ముసుగు క్రింద ఆ చేతిలో ఖడ్గం వుంది. ఆతడా ఖడ్గాన్ని అమాత్యునికేసి విసిరేశాడు.

అతడు కఠినంగా, కర్కశస్వరంతో 'మరణదండన! వైశాలి చోరసంఘం మీకు మరణదండన విధిస్తుంది !' అన్నాడు.

జనంలో కోలాహలం జరిగింది.

నృసింహుడు ఇంకా బిగ్గరగా 'సంఘం పెట్టిన ఆదర్శాలను ఆమోదించి నడుచుకోవటం ప్రతి ఒక్కని కర్తవ్యం, ధర్మంకూడా. అమాత్యులవారొక ఆదర్శాన్ని హత్య చేశారు......బైటనుంచి సహాయం లభించదు...అమాత్యా, మీరు ఆత్మహత్య చేసుకోవాలి' అన్నాడు.

హటాత్తుగా స్వరసేనుడు నవ్వాడు. 'చోరరాజా ! న్యాయ నిర్ణయాధికారం నీకు లేదు. వైశాలిపరిషత్తు నిన్ను

అరాచకవాదియని, దేశద్రోహియని నిర్ణయించిం దెవ్వడో!' అన్నాడు.

'చోరసంఘం వైశాలి పరిషత్తు నియమాల కంటే ఉన్నతమైంది. ఎన్ని ఘోర్యాలను రాత్రియందు అంధకారం చాటున జరుగుతున్నాయో న్యాయాధీశులు చూడలేరు. మా చోరసంఘం అటువంటి ఘోరాలన్నింటినీ విచారిస్తుంది.'

'నిజంగానా ?'

'నేను నీకు సమయ మిస్తున్నాను' నృసింహుని కంఠం గర్జించింది.

'ముఖ్యద్వారంలో ఎవరున్నారు ?' అన్నా డతను.

ఒక నల్లని ఆకారం ఒకమూలనుంచి ముందుకువచ్చి తమ సంకేతభాషలో ఏదో చెప్పింది. సమయం గడిచిపోతూ వుంది.

వృద్ధునిచేతులు ఖడ్గం తీసుకుంటూ కంపించాయి. కాని అతడు ఖడ్గాన్ని తనపై ప్రయోగించుకోలేదు. నెమ్మదిగా అతడు రంగస్థలంకేసి అడుగులువేస్తున్నాడు.

'స్వర్ణసేనా ! ఆసల్యం చేస్తున్నావు' అని గర్జించాడు దస్యుడు.

అమాత్యుని కంఠస్వరంకూడా తీవ్రంగానే జవాబిచ్చింది, 'నృసింహా, దస్యుపరిషత్తు తరఫున నిన్ను బంధిస్తున్నాను.' ఆయన మరికొంత ముందుకుసాగాడు.

నృసింహుడు వికటాట్టహాసం చేశాడు. అతడు రెండో చేత్తో మెరుస్తున్న ఖడ్గాన్ని బైటకుతీశాడు. 'దస్యుసంఘం నీకు మరణదండన విధిస్తుంది.'

మరుక్షణం కత్తులు కలిశాయి. వృద్ధఅమాత్యుడు చురుకుగా దస్యునిఖడ్గాన్నెదుర్కొంటున్నాడు.

నల్లని ఆకారాలు రంగస్థలంవేపుకు రాసాగాయి. అంతలో అంబాపాలికంఠస్వరం ధ్వనించింది. 'నృసింహా, నేను నిన్నెరుగుదును'

నృసింహుడు అదేవిధంగా పోరాడుతూనే 'ఇది అంబా పాలి కంఠస్వరమే! నీవు నన్నెరుగవు' అన్నాడు.

'అలాఅయితే నేనా కంకణాన్ని గుర్తుచేయాల్సి వుంటుంది. ఆనాటి రేయి శ్వేతపర్ణ అడవిలో నువ్వు......'

దస్యుడు ఎగిరి దూరంగావెళ్ళి నిల్చున్నాడు 'అంటే అర్థం? అంబాపాలీ, నువ్వు నామీద దెబ్బతీస్తావా?'

అంబాపాలి నేత్రాలు చురుకుగా ఆనందంతో మెరిశాయి. 'నేను పొరపడలేదని తెల్సుకున్నావుగా! అంబా పాలి వైశాలికి ఋణపడివుంది......నేను నిన్ను పరిచయం చేయనా?' అని అంది.

నృసింహుడు రొప్పుతూ రంగస్థలంపై ఒక పక్కకు తప్పుకొంటూ 'అమాత్యా, ఇవాల్టికి బ్రతికిపోయావు. కాని ...ఒకనాటికి నువ్వు ప్రాణాలను వదులుకోవాల్సిందే' అన్నాడు.

మరుక్షణంలోనే రంగస్థలంనుంచి దుమికి ఆ నల్లని ఆకారాలతోపాటు ఎక్కడో మాయమై పోయారు.

మళ్ళీ నాటకం ప్రారంభమైంది. కాని ప్రేక్షకులు అదే విషయాన్ని చర్చిస్తున్నారు. అంబాపాలికూడా కొంచెం ఉద్విగ్నత చెందింది. నాటకం మధ్యలోనే ఆమె నాటక భవనంనుంచి తనకేసి ఆసక్తితో చూస్తున్న ప్రేక్షకుల చూపులనుంచి ఆమె బయటకు వెళ్ళిపోయింది. అక్కడ ఆమె రథం నిల్చివుంది.

# 12

క్రమక్రమంగా వైశాలిజీవితంలో అనిశ్చలత రాసాగింది. క్రొత్త పరిషత్తు ఎన్నికలు దగ్గరపడుతున్నాయి. రాజకీయ కోలాహలం హెచ్చసాగింది. ఆనాటి దస్యుశ్రేష్ఠుడు నృసింహుని హెచ్చరిక జనంలో ఒక అలజడిని రేకెత్తించింది. రాజగృహపు సింహపాదులంటే వైశాలి రాజపురుషులు భయంతో భీతి చెందుతున్నారు. రాజగృహంనుంచి వచ్చే యాత్రికులపై నగరరక్షకులు గట్టి నిఘావేశారు. అజాతశత్రువు సైన్యాన్ని సమీకరిస్తూన్నాడని తెలియవచ్చింది. అందులోవున్న ఉద్దేశ్యమేమిటో ఎవరికీ తెలియదు. రాజగృహానికి కొద్దిదూరంలో ఒకదట్టమైన అడవిచెంత ఒకపెద్ద నౌకాసైన్యాన్ని చూశామని కొందరు యాత్రికులు చెప్పారు. వాటిమీద సైనికదుస్తుల్లో ముఖంమీద నల్లనిముసుగులువేసుకున్నవాళ్ళున్నారని చెప్పారు; ఈవిషయాలు వైశాలిలోఉద్రేకవాతావరణాన్ని కల్గించాయి. వైశాలివెలుపలవున్న కలపతో

నిర్మించిన రక్షణగోడల్ని దృఢతరం చేయసాగారు. గోపురాల మీద సైనికులకాపలా ఏర్పాటయింది. నగరంచుట్టూ రెండు కందకాలున్నాయి. వాటినిండా నీళ్ళువదిలారు. నగరమంతా ద్వీపంవలె కన్పించసాగింది.

జనం వంతెన్నపైనుంచి అటుఇటు వస్తూ ఆశ్చర్యంతో క్రింద ప్రవహించే నీటికేసిచూస్తేవారు.

తూర్యానినాదం చేసుకుంటూ సేనానాయకులు రాజ వీథులగుండా తిరుగుతూ 'ప్రజాతంత్ర రక్షణకై మనపౌరులు నడుం బిగించి సిద్ధంగావున్నారా?' అని అరుస్తూ చెప్తూ వుండేవారు.

వారిచుట్టూ జనం గుమిగూడేవారు. వాళ్ళువారికి పరి స్థితులన్నీ బోధపర్చేవారు.

కాని వైశాలిదేశంలో తెగులుప్రారంభమైంది. రాజ పురుషుల భవనాల్లో సంగీత, నృత్యాలు, మద్యపాన సేవన యథావిధిగానే జరుగుతున్నాయి.

స్వర్ణసేనుని భవనంలో అతడికుమారుడు మిత్రులతో సమావేశం జరుపుతున్నాడు. అతడి కుమారుడు భీమసేనుడు. అమాత్యుడు ఈభవనాన్ని వదలివేసి లోపలనున్న మరొక భవనంలో వుంటున్నాడు.

'మిత్రా, భీమస్సేనా! ప్రస్తుతం ఈ నగరం అంత సుర క్షితంగా లేదని నువ్వుగమనిస్తూనే వున్నావుగా! మనం అతి త్వరగా జాగ్రత్త పడాలి' అన్నాడు ఒక వ్యక్తి.

'ఇది అజాతశత్రుని ఒక రాజకీయ ఎత్తుగడ. అతడు వైశాలి పరిషత్తును భయపెట్ట తలచాడు. నృజనఘం చేతిలో వుండికూడా ఖడ్గమేనని మనం వారికి చెప్పాలి' అన్నాడు మరొక యువకుడు.

'ఇది చూడండి, నాన్నగారిని నేను ద్రోహిగా భావించ టంలేదు. ఇంత పాతవిషయాన్ని పట్టుకొని అంగీకరించడమే పొరపాటు. ఆ నృసింహుడు సింహపాదుల.........' అని భీమసేనుడు అంటూ వుండగా మొదట సంభాషణ ప్రారంభిం చిన రాజపురుషుడు 'అది యథార్థంగాదు, భీమసేనా! కాదు, కాదు......అతడు ఎంతమాత్రం వాళ్ళల్లోని మనిషి కాడు. వైశాలి గ్రామప్రజలు అతన్నెంత అధికంగా భావిస్తారో నీకు తెలుసా?' అన్నాడు.

'ప్రజలు దేశద్రోహులు! వైశాలి దేశభక్తికి దీన్ని నేను అవమానంగా భావిస్తున్నాను.'

'కాని నృసింహుడు సామాన్యదస్యుడు కాదు. అతడు దస్యుల్ని సమీకరించి వారిని ఉన్నతమార్గంలో నియమిం చాడు. ఇది మీ రంగీకరిస్తారు గదా?'

'ఇదికూడా నేనంగీకరించను. ఈ మధ్యనే అతడు నగరంలోని ధాన్యపు అంగళ్ళను దోచుకున్నాడు. అందుకు మీ రతణ్ణి దోషిగా భావించరా?'

అందరూ మౌనం వహించారు.

'అతడా ధాన్యాన్ని శ్రీహట్టగ్రామంలోని ప్రజలకు పంచి పెట్టాడని తెలిసింది!' అన్నాడు ఒక యువకుడు.

మళ్ళీ అందరూ మౌనం!

తిరిగి ఆయువకుడే 'శ్రీహట్టలో ఈసంవత్సరం పంటలు సరిగ్గా పండలేదు. ఈ వసంతోత్సవసందర్భములో అక్కడినుంచి పూర్ణరాజభోగం రాలేదు' అన్నాడు.

భీమసేనుడు ఆ మౌనాన్ని గ్రహించాడు. 'అక్కడి భూస్వాములు పూర్తిగా బలి నివ్వటంలేదని గ్రామపెద్దఅంటున్నాడు. ఇప్పటి కింకా అతడు పూర్తిబలి నిప్పించడానికి ప్రయత్నిస్తున్నాడు. ఒక సేనానాయకుడు కూడా అక్కడికి వెళ్ళాడు' అన్నాడు.

'మహామాత్యులకుబలిలభించకపోవడానికి ఒక కారణం వుంది. గ్రామస్థులు బౌద్ధ సన్యాసులై పోతున్నారు. వారు తమ వృత్తుల్ని వదిలేస్తున్నారు. అందుచేతే వ్యవసాయదారుల గిరాకీకూడా హెచ్చింది. భూమిని దున్నేవారు తగ్గిపోతున్నారు' అన్నాడు బన్నతుడు.

అతడు చెప్పింది యోచించాల్సిందే ననేది స్పష్టమే. అందరూ దాన్ని గురించే ఆలోచించసాగారు. 'ఆవిధంగా ఎందుకుంది? అలాఅయితే దేశరక్షణ ఎలా సాధ్యం?' అని అడిగా రొకరు.

'ఆక్రమణభయం వుండనే ఉంది. అతిత్వరలో మన ధాన్యాగారాల్ని భర్తీచేసుకోవాలి. కాని పరిస్థితి ఇలా లేదు. ఆక్రమణ సమయంలో వ్యవసాయం జరగనే జరుగదు. ఈ

ధాన్యాగారాల మీదే దేశజీవితం ఆధారపడివుంది' అన్నాడు భీమసేనుడు.

గదంతా ప్రకాశంగా వుంది సువాసనా ధూపం వెలుగుతోంది దాస దాసీలు మౌనంగా మద్యాన్నందిస్తున్నారు. ఇంతలో ఒక సేవకుడు ప్రవేశించి 'శ్రీవనరక్షకులు ద్వారమందు నిరీక్షిస్తున్నారు' అని చెప్పాడు.

'ఇప్పుడా? మళ్ళీ రమ్మని చెప్పు' అన్నాడు భీమసేనుడు. సేవకుడు వెళ్ళిపోయాడు. కాస్సేపటికి మళ్ళీ తిరిగి వచ్చి 'అయ్యా అవసరమైన కార్యమంటున్నారు.' అని చెప్పాడు.

'ప్రవేశపెట్టు' అని భీమసేనుడు చలువరాయి, దేవదారు పీఠాలపై వున్న పానపాత్రల కేసి చూడసాగాడు.

'రాజగృహసమాచారా లేమిటి?' అని అడిగాడు శౌక యువకుడు వసంతుణ్ణి.

'సేనజిత్ పై దాడిజరగటం ఖాయమనే నావుద్దేశ్యం. కాని ఈ పర్యాయం అజాతశత్రువు వారిని ఓడించలేడు' అని చెప్పాడతడు.

యువకుడు ప్రశ్నార్థకంగా అతడికేసి చూశాడు.

'శ్రావస్తి సైన్యంలో కాంపిల్య, గాంధార సైనికులు చేర్చుకోబడ్డారు. గాంధార జనులు మనదేశంలో అన్ని ప్రాంతాలవారికంటే బలిష్టులు—'

ఇంతలో వనరక్షకుడు ప్రవేశించాడు. నమస్కరించి 'అయ్యా, శ్రీకి పడమటివైపు అడవిలో ఇవాళ దస్యుసంఘ సమావేశం జరుగనున్నది' అని చెప్పాడు.

అందరూ ఆసక్తిగా అతడికేసి చూశారు. 'ఇంతకూ నువ్వు కోరేదేమిటి?' అని అడిగాడు భీమసేనుడు.

'తమ ఆజ్ఞ ఏమిటి? నే నిప్పుడు లిచ్ఛవిరాజుగారివద్ద నుంచే వస్తున్నాను. వారు తమ అభిప్రాయాన్ని అడిగారు. ఒక జాములో 5000 మంది సైనికులు అక్కడికిచేరుకోగలరా?' అన్నాడు నగరరక్షకుడు.

కాసేపు మౌనంగా వుండి భీమసేనుడు 'దస్యుసంఘ సమస్య ఇంత తేలిక్కైనదికాదని లిచ్ఛవిరాజుకే తెలుసు. ఈ పరిస్థితిలో మనం తగాదా కొని తెచ్చుకోలేము. సైనికులైతే దొరకవచ్చు కాని, ఈ విషయాన్ని పరిషత్తుముందుంచాలి' అని అన్నాడు.

'పరిషత్తు ఏర్పాటు అంత త్వరగా ఎలా సాధ్యపడు తుంది?'

'ఒకసారి పరిషత్తు ఈ విషయాన్ని గురించి యోచిం చింది. కాని ఒక నిర్ణయం చేయలేకపోయింది. సరే, మీరెం దరున్నారు?' అని అడిగాడు భీమసేనుడు.

'అయిదు వందలు.'

'శ్రీహట్టి ప్రాంతపు రక్షణోద్యోగులు మీ వెంట రాలేరా?'

'దీనికి ప్రధాన రక్షణోద్యోగి అనుమతిపత్రం కావాలి.'

కొంచెం యోచించిన పిదప 'ప్రధానోద్యోగి తరఫున నేను వారిని బంధిస్తాను. ఏం, వా రెందరుంటారు?' అని అడిగాడు భీమసేనుడు.

'వారి ఈ సమావేశంలో వైశాలి, శ్రీహట్టి, కౌశల, శ్రీపట్టణపు దస్యు ప్రముఖులందరూ వుంటారు. వారు ఏడు వందలమంది వరకు వుంటారని నా ఉద్దేశ్యము.'

'నృసింహుడు కూడా హాజరవుతాడా?'

'తప్పకుండాను.'

'నువ్వు లిచ్ఛవిరాజుతోను, మా తండ్రిగారితోను సంప్రదించు. సైన్యం అవసరంకలిగితే నాకు కన్పించు. నా అభిప్రాయం వారికి తెలియజెయ్యి. ఇహ వెళ్ళు.'

వనరక్షకుడు వెళ్ళిన తరువాత కాసేపటివరకు ఇదే విషయాన్ని గురించి సంభాషణ జరిగింది. మళ్ళీ తిరిగి మద్య పానం ప్రారంభమయింది.

దాసీలు సుగంధమద్యాన్ని పాత్రల్లోనింపి వారికి అందిస్తున్నారు. వారు దాసీలతోను, తమలోతాము పరిహాస వినోదాలాడుతూ సేవిస్తున్నారు.

ఇంత నే అందెల ధ్వనితో గది నిండిపోయింది. గుండ్రంగా వున్న ఆ గదిలోనికి వున్న మూడు ద్వారాల గుండా సౌందర్యవంతులైన నర్తకీలు ప్రవేశించారు. వారి పాదాలు లయప్రకారం పడుతున్నాయి.

వారిని చూడగానే భీమసేనుడు 'ఓహో! మీరొచ్చారూ! మిత్రులారా, వీరందరి ఆరోగ్యసుఖాలకై అందరము మరొకసారి త్రాగుదాం' అన్నాడు.

నర్తకీమణులు వారి సమీపానికి వచ్చి నమస్కరించి కూర్చున్నారు. దాసీ చేతినుంచి పానపాత్రను తీసుకుని భీమసేనుడు ఒక నర్తకికి అందించాడు.

'నృత్యానికిముందు మదిరాపానం! మిత్రులారా, అప్సర కన్యలకు పానంచేయించండి' అన్నాడు. నర్తకీమణు లందరూ వారిచేతుల్ని ముద్దుపెట్టుకుని పాత్రల్ని ఖాళీచేశారు. తరువాత వారే పాత్రల్నినింపి మిత్రులముం దుంచారు. 'నేను రూపకళ చేత్తో తాగుతాను' అన్నాడు వసంతుడు చిరునవ్వు చిందిస్తూ.

'అయితే మిత్రమా! నిన్నుచూసి నేను ఈర్ష్యపడాలి' అన్నా డొక యువకుడు నవ్వుతూ. రూపకళ అనే నర్తకి అప్పుడే భీమసేనునికి పానపాత్ర నందిస్తుంది.

'ఈ పాత్రను వసంతుని కివ్వు రూపకళా!' అన్నాడు భీమసేనుడు. అని నెమ్మదిగా ఆమెను తన కేసి లాక్కొని ముద్దుపెట్టుకున్నాడు అతడు.

దాసీలు అందమైన ఒక పెద్ద ఘటంనిండుగా మద్యాన్ని తెస్తున్నారు. వారికాళ్ళు కంపిస్తున్నాయి. 'మీరు బాగా సేవించారా మదలేఖా?' అని అడిగాడు భీమసేనుడు.

వారిలో ఒకామె సిగ్గు నభినయిస్తూ చురుకుగా చిరునవ్వుతో అతడికేసి చూసింది. భీమసేనుడుకూడా నవ్వాడు. మిత్రులారా, దాసీలు మద్యం సేవించడం మంచిదికాదు. మదలేఖా! ఇటురా,'

భవనంలో వున్న దాసీలందరిలో మదలేఖ క్రొత్తది. ఆమెను భీమసేనుడు స్వంతంగా కొన్నాడు. ఆమెను లొంగ దీసుకొనుటకు అతడు చాలారోజులుగా ప్రయత్నం చేస్తు న్నాడు. కాని మదలేఖ ఏవిధంగానూ ఆత్మసమర్పణ కావిం చడంలేదు. ఇవాళ భీమసేనుని ఆదేశానుసారమే అనుభవం గల పాతదాసీలు మధలేఖకు పూర్తిగా త్రాగించారు.

మదలేఖ అతనిదగ్గరకు వచ్చింది. రూపకళ వసంతు నికి పాత్ర నందిస్తుంది. ఇతర నర్తకీమణులుకూడా పాత్రలు నింపి అందిస్తున్నారు.

'మదలేఖా, యువతులు మద్యం సేవించరు' అన్నాడు భీమసేనుడు అని నవ్వాడు.

'మదలేఖా! నువ్విక్కడే కూర్చో' అని భీమసేనుడు మదలేఖను తనచెంతనే కూర్చోబెట్టుకున్నాడు. 'ఈ పాత్రను నువ్వు లేపలేవు' అని అతడు ప్రేమగా ఆమె కేసి చూశాడు. మదలేఖ చిరునగవుతో సిగ్గుగా తలవంచుకొంది. నృత్యం ప్రారంభమైంది.

చాలాసేపటివరకు నృత్యం, దానితోపాటు వినోద విలాసాలు జరుగుతూ వున్నాయి. ఆ ఘటంలోని మద్యం చాలా మత్తుగా వుంది. అది అందర్నీ చైతన్యవిహీనుల్ని చేసింది.

నృత్యం ఆగిపోయింది. గదితలుపులు మూయబడ్డాయి. నర్తకీమణులు యువకులచెంతకు వచ్చి కూర్చోసాగారు. పర స్పర ప్రేమసంభాషణలు ప్రారంభమయాయి. మదలేఖమినహా

మిగతా దాసీలందరూ వెళ్ళిపోయారు. తాను ప్రేక్షకురాలిని మాత్రమే అయినట్లు, ఇందులో తనకేమీ భాగంలేనట్లు ఆమె సిగ్గుతో కుంచించుకపోయి, అర్ధనిమీలిత నేత్రాలతో ఆ దృశ్యాన్ని చూడసాగింది.

అర్ధరాత్రి దాటిపోయి వుంటుంది. హఠాత్తుగా సేవకుడు 'శ్రీహట్టి రక్షకోద్యోగి ద్వారంచెంత వున్నారు, అయ్యగారికి తెలుసా?' అని బిగ్గరగా అనటం విన్పించింది.

తూలుతూ తూలుతూ, భీమసేనుడు వెళ్ళి తలుపు తెరిచాడు. 'ఇది రక్షకోద్యోగిని కలుసుకునే సమయం కాదు. అతణ్ణి లిచ్ఛవిరాజు అనుమతి పొందమను' అని చెప్పాడు. సమాధానంకోసం నిరీక్షించకుండానే అతడు తలుపులు మూసివేశాడు.

మత్తుతో, ఎరుపెక్కిన నేత్రాలతో, చేతులు పెనవేసుకుని భీమసేనుడు మిత్రబృందంకేసి చిరునవ్వుతో చూస్తూ 'ఇప్పుడిహ వైశాలి భోగవిలాసాల నగరంగా లేదు. దస్యుల, శత్రుల సమస్యలను పరిష్కరించటంలోనే యౌవనమంతా గడచిపోతుంది' అన్నాడు.

'మనం తామ్రపర్ణి వెళ్దాం. అక్కడ పురుషుల్ని ఆకర్షించి మైమరపించే యక్షిణీకన్య లుంటారట' అన్నాడొక యువకుడు.

చైతన్యరహితమౌతున్న మదలేఖను కౌగలించుకుంటూ 'అయినా వైశాలిలో ఇంకా ఒక యక్షిణీకన్య వుంది' అన్నాడు భీమసేనుడు.

అతడామెకు చేయూతనిచ్చి నిలబెట్టి 'మిత్రులారా ఆ రెండుగదుల్లోనూ మీ పడకలకు ఏర్పాటు చేయబడింది, మర్చిపోవద్దు. ఈ రా మీకు ఆనందం కల్గుగాక!' అంటూ ఆమెను తూర్పువైపు గదిలోకి నడిపించుకు వెళ్ళాడు. గదిలో ప్రవేశించేముందు ద్వారంలో అతడు తన బాహుపాశంలో బంధించబడివున్న పచ్చని ప్రాణహీనంగా వున్న యువతికేసి చూసి, తిరిగి తన మిత్రులకు నమస్కరించాడు.

# 13

ఆ రోజుల్లోనే బుద్ధుడు వైశాలికి వచ్చాడు. కాని నగరంలోకి రాలేకపోయాడు. వైశాలినగరం వెలుపల ఒక గ్రామంలో ఆయన బసచేశాడు. ఆయన రావటంవల్ల వైశాలిలో ప్రత్యేకమైన కోలాహలమేమీ జరుగలేదు. ప్రజలు అజాతశత్రుని ఎత్తుగడల్ని గురించిన తర్కవితర్కాల్లో పూర్తిగా మునిగివుండడంతో బుద్ధుని రాకకు అంత అనురక్తులు కాలేదు.

బుద్ధుడు ఒంటరిగా రాలేదు. ఆయనవెంట సారిపుత్రుడు, మొగ్గలాయిన్, ఆనందుడు, గోపాలుడు మొదలుగాగల వృద్ధసన్యాసులు, రాహుల్‌తల్లి, కిశాగౌతమి, శుభ మొదలగు క్రొత్తగా దీక్షబొందిన స్త్రీసన్యాసినులు వచ్చారు. వారు ప్రబుద్ధకేతుని సంఘారామానికి వచ్చి ఉపదేశాలిస్తూ, ప్రచారం చేస్తున్నారు. వారి వయస్సిప్పుడు 75 సంవత్సరా

లుంటుంది. కొద్దిరోజు అక్కడవుండి బుద్ధుడు వెళ్ళి పోయారు. వారు వెళ్ళగానే బౌద్ధసంఘం ద్విగుణీకృతోత్సాహంతో నగరంలో ప్రచారం ఆరంభించింది. ఆచార్యప్రబుద్ధకేతునిద్వారా దీక్షపొంది బుద్ధునిపేరు మాత్రమే వినివున్న వారు బుద్ధుణ్ణి దర్శించగలిగారు. వారి విశాల వక్షస్థలాన్ని దీర్ఘబాహువుల్ని, వెడల్పాటి లలాటాన్ని, శాంతమైన జ్ఞానముద్రను చూసి ఆకర్షితంకాని వ్యక్తి అంటూ వుండడు. వారి చుట్టూ దయ, కరుణ, మైత్రీవాతావరణం మూర్తీభవించి వుంటుంది. బుద్ధుడు ఉపదేశిస్తాడు, కాని వారి వ్యక్తిత్వం అంతకుముందే ప్రశ్నలన్నింటికి సమాధానం చెప్తుంది. బుద్ధుడు వెళ్ళిపోయిన తర్వాత ప్రచారం ఎక్కువ ఫలప్రదమైంది. ప్రజాభిరుచి రాజకీయ సమస్యలనుంచి శీఘ్రంగా మళ్ళటం ఇందుకు కారణం. వైశాలిలోని ధర్మభీరువులు, ఆనందప్రియులు, ప్రజాతంత్ర అలజడుల్లో చౌకబారు వుద్రేకం పొందే పౌరులు, మగధ అంటే వున్న భయంనుంచి విముక్తులయారు. అజాతశత్రుని లక్ష్యం కోశల. బుద్ధుడు శ్రావస్తినుంచి బయలుదేరినప్పుడే పట్టణం ముట్టడించబడింది. బుద్ధుడు తన అనుచరులతోపాటు అచిరావతిని నావలద్వారా దాటవలసివచ్చింది. అటు ఆక్రమణ జరుగుందనే భయంతో ప్రసేనజిత్తుడు ఇటువైపున నదిపై వున్న వంతెనను విరగ్గొట్టించాడు.

భోగవిలాస ప్రియులైన వైశాలి యువకుల కిహ తీరిక చిక్కింది. అప్పుడు వారు కళ్ళు తెరచి తమచుట్టూ చూశారు.

తథాగతుడు వైశాలికి వచ్చాడు, వెళ్ళిపోయాడు. వార్తది విన్నప్పుడు చాలా ఆశ్చర్యం చెందారు. బలికి వ్యతిరేకంగా ప్రతి సంవత్సరం పెరిగిపోతున్న వ్యతిరేకతను, క్రొత్తగా దీక్ష పొందిన పౌరుల ఉత్సాహము అన్నీ వారికి తెలిశాయి. ఆ విచిత్రవ్యక్తి ఎలా వుంటాడు? వారిని చూచి వచ్చిన పౌరులు, బుద్ధునిలోని సౌమ్యముద్రను, అద్భుత ఆకర్షణను గురించి చెప్తున్నారు.

బుద్ధుడు వైశాలికి వచ్చిన వార్తను అంబాపాలి కూడా వింది. కాని ఆమె కుమారగుప్తునివద్ద దాచింది. ఆమెకుకూడా లోపల తన విలాసమయ జీవితంయెడ విరక్తి కలుగుతూనే వుంది. కోశల మగధ యుద్ధంకంటేగూడా భయంకరంగా ఆమె లోపలి సంస్కారాలు సంఘర్షిస్తున్నాయి. ఇంతకూ కుమారగుప్తుడు ఏమిటి? ఆమెకు ఒక ఆటబొమ్మ, మనో వినోద పరికరం. ఇదే ఐశ్వర్య వ్యసనాలకు చిహ్నం. కుమారగుప్తుడు కూడా తెలిసి తెలియకుండా వైరాగ్యంవేపుకు మొగ్గుచూపుతున్నాడు. ఇదేమీ అసంతృప్తికరమైన విషయం కాకపోయినా, వీలైనంతకాలం అంబాపాలి దీనిని ఆపి వుంచాలనుకుంటోంది.

జ్యేష్ఠమాసంపౌర్ణమినాటిరేయి. అర్ధరాత్రమవుతుంది. ఆకాశం స్వచ్ఛంగా నీలంగా వుంది. పగటి వెచ్చని వాతావరణంతర్వాత రాత్రి చల్లని హాయినిచ్చే గాలి వీస్తోంది. అంబాపాలి మద్యంసేవించి, రాత్రి మొదటి జామునందు విలాసాల్లో అలసి, పగటివేడిమికి బాధపడివుండటంవల్ల ఆదమరయ

లుగా వున్న దొడ్లోకి వచ్చింది. కుమారగుప్తుణ్ణి నిద్రపోతుండగా వదలివచ్చింది. దొడ్డిమధ్య ఒక పెద్ద శిలా సింహం నిర్మించబడి వుంది.

దాని కిరువైపులా రెండు తెల్ల చలువరాతి పీఠాలున్నాయి. అంతటా నిశ్శబ్దం అలముకొనివుంది. ఆ పీఠాల్లో ఒకదాని పైఅంబాపాలికూర్చునివుందిఆమెచంద్రుని కేసిపైవంక చూస్తూసింహపువిగ్రహానికిఆనుకొనిఅలాగేనిద్రపోయింది.

రాత్రి ఆఖరిజాము గడుస్తూవుండగా ఆమెకు మెలకువ వచ్చింది. ఎవరో తాకినట్లనిపించింది. అతడు కుమారగుప్తుడే. ఆమె పూర్తిగా కళ్ళు తెరచి అతడికేసి చూసింది. ఈకొద్దినిద్ర నల్లనేఆమెఅలసట పోయినట్లనిపించింది. హాయిగావుందిప్పుడు. కుమారగుప్తుడు అలసటతో వెల వెల పోతున్నాడు.

అంబాపాలి అతణ్ణి తనకు తగ్గరగా కూర్చొనబెట్టుకొని తానూ కూర్చుంది. ఆ పీఠంమీద యిద్దరు కూర్చోవటం చాలా కష్టమయిన పని.

'మేల్కొన్నావేం?' అని అడిగింది ఆమె.

'అంబికా, నువ్విక్కడ ఎప్పటినుంచి పడుకుని వున్నావ్?' అని కుమారగుప్తుడు అడిగాడు.

'ఎప్పటినుంచా? నే నిప్పుడే వచ్చాను. ఎంతోసేపై వుండదు' అని అంది.

కుమారగుప్తుడు ఒక క్షణకాలం మౌనం వహించి 'నేను కలగంటున్నాను' అని అంబాపాలివంక చూస్తూ కళావిహీనంగా మందహాసం చేశాడు.

'ఏమి స్వప్నం?' అని ఆమె కుమారగుప్తుని చెయ్యిపట్టుకుని 'కుమారగుప్తా! నాకు స్వప్నాల్లో నమ్మకం లేదు. నేను వాటిని మర్చిపోతూవుంటాను. అదే మోసంగా తయారై, ఎండమావుల్ని మన ఎదుట సృష్టిస్తుంది, మనం మేల్కొని వాటిని వాస్తవమని భావించి బాధపడుతూ వుంటాం' అని అంది.

'అది అంగీకరిస్తాను. కాని ఇవాళకూడా అదేపూర్వపు స్వప్నం! అప్పుడిహ దీనిని స్వప్నమనే ఎలా అనుకుంటాం?' అన్నాడు కుమారగుప్తుడు.

'గాంధారంలో కన్పించన ఆ పరిచితురాలు నాకు స్వప్నంలో కన్పించింది...ఆమె చాలా విషయాలు... సమయం అసన్నమైందని ఆమె చెప్పింది. ఈ ప్రపంచంలో నూత్న వెల్లువ ప్రవహిస్తుందని, ప్రాంతము, దేశము, ప్రపంచము సర్వేసమస్తం ఆ ప్రవాహంలో కొట్టుకుపోతాయి. దేవతలు ఈపరివర్తనను ఆసక్తితో తిలకిస్తున్నారు. ఆ పరివర్తనలో నీవు ప్రధానపాత్ర నహిస్తావు. విన్నావా?' అని అడిగిందామె.

'నిన్న నువ్వు ఇదే ఆలోచించి వుంటావు. ఆ యువతి నీ అంతరాత్మేనని నేను పందెంవేసి చెప్పగలను. నా అంతరాత్మనని చెప్పటం అది అబద్ధమే చెప్పింది' అంది అంబాపాలి.

నిశ్శబ్దంగావున్న ఆ దొడ్లో ఆమెనవ్వు చంద్రునికంటె మిన్నగా మెరిసిపోయింది.

కుమారగుప్తుడు మౌనం వహించాడు. అంబాపాలి కూడా మౌనంవహించింది. చటుక్కున అంబాపాలి ఆకాశం కేసి చూసి 'ఇదేమిటి? నే నిక్కడ నిద్రపోయానా? చంద్రుడు పడమటికి వచ్చేశాడే?' అంది.

కుమారగుప్తుడు ఆమె కేసి పరిశీలనగా చూసి చిరునవ్వుతో 'నువ్వు రాత్రి మూడో జాము గడచిపోయేవరకు మేల్కొని వుండలేవు' అన్నాడు.

'అయితే, నీకు స్వప్నం చూడటానికి మంచిఅవకాశం లభించివుంటుంది_ఏం?' అంది అంబాపాలి.

'అవును, చాలా అవకాశం!' అని కుమారగుప్తుడు చిరునవ్వు నవ్వుతూ 'ఆ పరివర్తనలో నువ్వూ పాల్గొనాల్సి వుంటుంది; నువ్వు ప్రధానపాత్ర వౌతావు, కుమారగుప్తుడొక ప్రధానపాత్ర వహిస్తాడు! ఆ పరివర్తన ఏమిటో తెలుసా?' అన్నాడు.

అంబాపాలి తెలియదన్నట్లు తలూపింది.

"అదిగో, అటు తూర్పుదెస కేసి చూడు. ఆకాశం... దానిలోపల...చూడు...ఒక శిఖరం...దాని సమీపాన... ఒక విగ్రహం...ఎవరది?...బుద్ధుడు! ...అవును, నువ్వాయన్ని దర్శించావు, ఆయన రాజగృహానికి వచ్చినప్పుడు. 'కుమారగుప్తా, నీ వప్పుడు పసివాడవు. నీ తండ్రి నిన్నతని చరణ కమలములయందుంచాడు' అని ఆమె చెప్పింది.

'ఇంత వయస్సొచ్చిన తరువాత ఆయన నిన్ను పొందాడు. నిన్ను పోగొట్టుకుంటానేమోననే ఆయన

భయం...అప్పుడు బుద్ధుడు నవ్వుతూ నీతండ్రితో 'మిత్రమా, నీ కుమారుడు నా పనికి చాలా సహాయపడ్డాడు. ఇతడిప్రాణాల కేమీ భయంలేదు...''

అంబాపాలి ఆసక్తితోను, కొంచెం భయంగానూ దీనిని వింటోంది.

'ఈ సన్యాస - మతాన్ని నీవు గొప్ప పరివర్తనగా భావిస్తున్నావు. కావచ్చు. ఊహల్లో మునిగిపోయి ఏవేవో స్ఫూహించుకోవటం నీ స్వభావమై పోవటంకూడా కావచ్చు' అంది అంబాపాలి.

'అంబాపాలి, నేను దేశమంతటా పర్యటించాను. నా కెంత ఆసక్తివున్నా నే నా భిక్షువును చూడలేకపోయాను. కాని చూడగానే గుర్తించగలననే తోస్తుంది. నా కెందుకనో నా చుట్టూ ఒక గొప్పపరివర్తన కల్గుతూవుందనేది నేను గమనించటంలేదు. సుడిగుండం మధ్యలో వుండటంవల్ల చుట్టూ వేగంగా తిరిగే చక్రాన్ని గమనించలేక పోవటంకూడా జరగ వచ్చు. ఆ చక్రం నిరంతరం వృద్ధిచెందుతూ వుండటం, మనం ఎప్పుడూ ప్రశాంతమైన కేంద్ర బిందువువద్ద శాంతంగా, క్రియాశూన్యంగా వున్నామనిభావిస్తే కూడా ఇది జరగవచ్చు. ఒకవేళ యుగం కేసి కన్నెత్తి చూడగల్గితే, ఆ పరివర్తనను గమనించగలగటం, దానిని అర్థం చేసుకోవటం జరగవచ్చు. కాని విప్లవంలో పాల్గొంటున్న వ్యక్తి దానిని అర్థం చేసుకో లేడు' అని అతడు కొంచెంసేపాగి నవ్వాడు. తర్వాత 'ఈ అంతిమవాక్యం నేను తక్షశిలలో మా ఆచార్యునివల్ల విన్నాను' అన్నాడు.

ఉషఃకాలపు చల్లని పిల్లవాయువు వీస్తోంది. కుమారగుప్తుని మాటలు వింటోంటే అంబాపాలికి ఒకవిధమైన విసుగుదల జనిస్తోంది. అయినా ఆమె ఏమాత్రం విరోధభావం ప్రదర్శించటంలేదు.

ఆమె మెల్లగా లేస్తూ 'పద, కాస్సేపట్లో అందరూ మేల్కొంటారు. సేవకులు ఇటు కేసి వస్తారు. మనం గదిలోకి వెళ్దామా ; ఉద్యానవనంలోకి వెళ్దామా ?' అంది.

'పుష్పవాటికకే వెళ్దాం !' అన్నాడు కుమారగుప్తుడు.

భవనం చెంతనే ఒక పుష్పోద్యానం వుంది. ఉద్యానంలోకి వెళ్ళినతర్వాత 'నేను అపరాధంచేశాను కుమారగుప్తా ! బుద్ధుడు వైశాలికి వచ్చారు. ఆయనయందు నీ కింత జిజ్ఞాస వుందని నేను తెలుసుకోలేకపోయాను' అని చెప్పింది అంబాపాలి.

కుమారగుప్తుడు మౌనంవహించాడు. 'నేనుఅపరాధం చేశాను. ఈ విషయాన్ని నీ దగ్గర దాచాను కుమారగుప్తా!' అంది అంబాపాలి.

కుమారగుప్తుడు మళ్ళీ మౌనంగానే వున్నాడు. కాని ఉన్నకొద్దీ మౌనంగా వుండటం భారమనిపించింది. 'ఇదెప్పటి విషయం అంబాపాలీ !' అన్నాడు చివరకు అతడు.

'ఈ పక్షం రోజుల్లోనే జరిగిన విషయం.'

కుమారగుప్తుడు దీర్ఘంగా నిట్టూర్చాడు.

'ఇంకా సమయం ఆసన్నంకాలేదు అంబికా. ఇందులో నీ దోషమేమీ లేదు. దోషు లెవ రున్నారు ? సమయం తన నియమానుసారంగా అది నడుస్తూ వుంటుంది. అవసరం కల్గి

నప్పుడు అది ఎవరి భుజస్కంధాలమీదనైనా ఎక్కుతుంది. అప్పుడిహ పాపం అతడు దాన్ని మోయవల్సిందే. మళ్ళీ తిరిగి ఆ మనిషి దుర్బలుడుకాగానే అది మరొక యువకుణ్ణి వెతుక్కుంటుంది. ఇంకా మన వంతు రాలేదు అంబికా.'

# 14

వైశాలిలో రోజురోజుకు వృద్ధిచెందుతున్న బౌద్ధుల్ని చూసి యజ్ఞాలను సమర్థించేవాళ్ళు, పురోహితులు, బ్రాహ్మణులు వారిని పూర్తిగా ద్వేషించసాగారు. ప్రతిసంవత్సరము యజ్ఞాలు తక్కువ కాజొచ్చాయి. వాటియందు ప్రజల్లో ఉత్సాహం సన్నగిలజొచ్చింది. పరిషత్తులోని రాజపురుషులెందరో బౌద్ధులయ్యారు. గృహస్థులైపోయారు, లేదా బౌద్ధుల ఎడ సానుభూతి చూపసాగారు. రెండుసంవత్సరాలనుంచి హిరణ్యగర్భుని ఆలయంముందు వసంతోత్సవసమయాన జరిగే యజ్ఞపుపర్వాల్లు నిలిపివేయబడ్డాయి. అంచేత యజ్ఞసమర్థకుల ఈ వర్గమంతా ప్రబుద్ధకేతునికి; అతడి అనుచరులకు బద్ధవిరోధులయ్యారు. బుద్ధుడు వైశాలికి వచ్చినప్పుడు నగరంలోని అనేకమంది పండితులు బుద్ధునితో శాస్త్రచర్చలుజరిపి బౌద్ధులైపోయారు. నగరంలో ఏమీ ఉద్రేకాలు తలెత్తనంత నిశ్శబ్దంగా ఈ పని జరిగిపోయింది. ఇప్పుడిహ బుద్ధుని వెనుక ఎందరో అనుభవశాలులైన వృద్ధులు చేరారు. వైశాలిలోని బౌద్ధసంఘం చాలా దృఢపడి ప్రచార మారంభించింది. సన్యాసినులు దీని కెంతగానో సహాయం చేశారు.

వైశాలినగరం వెలుపల ఒక ప్రాచీనమైన బ్రహ్మాలయం వుంది. రాజులకు అభిషేకం జరిగినంత ఆడంబరంగా ఒకప్పుడు ఇక్కడ యజ్ఞయాగాదులు జరిగేవి. ఇప్పుడది నిర్జనంగా వుండిపోయింది. దానికి సంబంధించివున్న గ్రామాల ప్రజలు, ఆలయపు భూమిని సేద్యం చేసే వ్యవసాయదారులు దానికి ఇవ్వవలసిన ధర్మ-భోగాన్ని ఇవ్వటం ఆపేశారు. ఈ ధర్మ బలి నివ్వకపోవటానికి చాలా కారణా లున్నాయి. వైశాలి చుట్టుపట్లవున్న గ్రామాల్లో సరిగ్గా పంటలు పండలేదు. మహామాత్యులవారు ఈ విషయంలో చాలా కాఠిన్యం చూపారు. ఆయన సైన్యాధికారిద్వారా సుంకం వసూలు చేయ ప్రయత్నించాడు. దాని ఫలితంగా వ్యవసాయదారులు, గ్రామస్థులు గ్రామాల్నే వదలిపోయారు, లేదా వృజసంఘాన్నే వదలివేశారు.

వ్యవసాయదారుల లోటువల్ల సేద్యం చేయవల్సిన భూమి ఎక్కువ; మనుషులు పూర్వంకంటే సగానికి సగం తక్కువ అయ్యారు. ఉత్పత్తి తగ్గిపోయింది. తర్వాత ఎంతో మంది యజ్ఞకర్తలు, బ్రహ్మశ్రేష్ఠులు బౌద్ధులయ్యారు.

ఈ ఆలయ పురోహితుని పేరు పరమార్థి భరద్వాజుడు. ఇవాళ రాత్రి చాలా ప్రొద్దుపోయినా అతడు మేల్కొని వున్నాడు. అర్ధరాత్రవగానే అతడివద్దకు ఇద్దరు యువకులు వచ్చారు. వారు పూర్తిగా నల్లని దుస్తుల్లో మరుగుపడి వున్నారు.

'బిడ్డలారా! సరియైన సమయమే. మీ ప్రయాణం శుభప్రద మగుగాక! మీకు భయం కల్గటంలేదుగదా?'

'లేదు, మహాపండిత్! నేను దృఢంగానే వున్నాను' అన్నాడు వుద్రేకపూరిత కంఠంతో ప్రచండుడు.

'మరి నీకో?' అని ప్రశ్నించాడు మహాపండితుడు రెండవ యువకు నుద్దేశించి. ఆ వెలుతురులో నల్లని దుస్తుల్లోంచి కన్పిస్తున్న కళ్ళు తళుక్కుమన్నాయి. 'మీరు నన్ను పరీక్షించివేశారు. బలికి అవరోధకుడైన నష్టుడు జైనచంద్ర క్షేత్రుడు మహారాజుకు జ్ఞప్తిలేడా?' అన్నాడా యువకుడు.

భరద్వాజుని ముఖ మండలంలో కఠోరనిశ్చయం పొడ సూపింది. 'యజ్ఞాలు విరిగిపోయిన నావలవంటివని ఈ సన్యాసులు చెపుతున్నారు. యజ్ఞాల ప్రతీకారం క్షేమలంగా వుండదని వారికి తెలియజెప్పాలి. యజ్ఞంతో పవిత్రమైన రెండు ఖడ్గాలను నేను ఇవాళ మీ కిస్తున్నాను' అని దృఢంగా పలికి అతడు తనరొంటినుంచి రెండు ఖడ్గాలను తీసి వారి కిచ్చాడు.

'తీసుకోండి. ఇవి మీ సాహసాన్ని దృఢంగా వుంచుతాయి. గత సంవత్సరాల్లో వీటితోనే బ్రహ్మదేవుడు బలి - భోగాలను పొందాడు. ఇవి మంత్రాలతో అభిషిక్తం చేయబడిన ఖడ్గాలు.'

ఇద్దరూ ఖడ్గాలు తీసుకొని కళ్ళకద్దుకొని మహాపండితులవారికి నమస్కరించారు. 'నేను మీకోసం యజ్ఞదేవతలను ప్రార్థిస్తాను. మొన్న జరిగిన రహస్యసమావేశం మీ కీ బాధ్యతను ఒప్పగించింది. మీరు యువకులు. అన్యాన్య

లైన బౌద్ధులతో మనం ధర్మయుద్ధం చేయ తలపడుతున్నాం'
అన్నాడు మహాపండితుడు.

అదే సమయంలో వారు మూర్చనవున్న బలిపీఠం చెంత ఒక నీడను చూసి త్రుళ్ళిపడ్డారు. అక్కడినుంచి ఆయన ఆ పీఠంచెంతకు వ్వెళాడు. తిరిగి ఆ యువకులదగ్గరకు వచ్చి 'భయపడాల్సినపనేమీ లేదు. కాని జాగ్రత్తగా వుండండి. మీరు ప్రబుద్ధుణ్ణి గుర్తించగలరా ?' అన్నాడు.

'వారి నెవ రెరుగరు ?' అని 'వారు విహారంలో ఏ వైపున వుంటారు?' అని అడిగాడు ప్రచండుడు.

'మీరు పడమటి ద్వారంగుండా ప్రవేశిస్తారు. దానిని ఆనుకునే ఒక చిన్నకుటీరం వుంది ఆ సన్యాసి అక్కడే వుంటాడు' అని చెప్పాడు మహాపండితుడు.

అతడి కళ్ళు తీవ్రంగా మండసాగాయి.

యువకులచేతుల్లో ఖడ్గా లున్నాయి. యజ్ఞమండపపు ద్వారాలగుండా వచ్చిపడుతున్న సూర్యకిరణాలకు రెప్పలు మెరుస్తున్నాయి. 'నా వెనుక రండి !' అన్నాడు మహాపండితుడు.

అతడు వారిని ఆలయ వెనుకభాగానికి తీసుకువెళ్లాడు. యజ్ఞగుండం కోసం అప్పుడప్పుడు తేబడ్డ రకరకాల రాళ్ళ గుట్టలతో ఆ ప్రదేశమంతా నిండివుంది. అక్కడకువెళ్ళి అతడు మందంగావున్న ఆ వెలుగులోనే ఒక కొంకాన్ని వెలికి పట్టుకుని బలంగా లాగాడు. కొద్దిగా చప్పుడయింది. ఒక పెద్దబండ తనచోటునుంచి కదిలి పైకి లేచింది.

'ఇది భూగర్భమార్గం. ఈ మార్గగుండా మీరు విహారంచెంతవున్న అడవిలోకి చేరుకుంటారు. దీనిలోనికి వెలుతురుకోసం ఏమీ తీసుకువెళ్ళటానికి వీలుపడదు. అయినా మీ కేమీ భయంలేదు. ఇవ్వాళ ఉదయమే నేను దీనిగుండా వచ్చాను' అన్నా డతడు.

యువకులు నిలచివుండటం చూసి అతడు కించిత్ హాస్యంగా 'ఈ మార్గంగుండా నరబలి వస్తూవుండేది. ఇది దేవతకు చాల ప్రియం. దిగండి!' అన్నాడు.

యువకు లిద్దరూ దానిలో దిగగానే మహాపండితుడు వారి చెవుల్లో ఏదో చెప్పాడు. కాస్సేపు మెదలకుండా నిల బడిన తర్వాత ఆయన బండను మరోచోట పెట్టాడు.

'వాళ్ళు తిరిగి మళ్ళీ ఈ మార్గానే రావచ్చు' అను కున్నాడు తనలోతానే. కాని అంతలోనే మళ్ళీ ఏదో గుర్తు చేసుకుని 'కాని నేను ఏదో నీడను చూశాను ఇంతకు పూర్వం!' అనుకున్నాడు.

తర్వాత ఆయన ఆలయం వెనుకనుంచి తిరిగి యజ్ఞ మండపంలోకి వచ్చాడు. అక్కడున్న ప్రతిస్తంభం వెనుక, ప్రతిపీఠం వెనుక చూశా డాయన. బైటకువచ్చి చూశాడు. ఆకాశం నక్షత్రాలతో నిండివుంది.

'బ్రహ్మకి జై! ప్రజాపతికి జై! నా స్తికులపై నీ కోప దృష్టి పడుగాక!' అతడికంఠస్వరం మండపంలో ప్రతిధ్వనిం చింది. విశాలమైన ఆవరణలు దాటి, అతడు పడమటివైపున వున్న ఒక గదిముందుకు ప్రవేశించాడు. తలుపుతట్టాడు

తలుపులు తెరుచుకున్నాయి. లోన కళ్ళు మిరుమిట్లుగొలిపే వెలుగుంది. ఒక సౌందర్యవతి చిరునవ్వుతో అతణ్ణి ఆహ్వానించింది. జుట్టు ముడిగా చుట్టబడి వుంది. ఆమె కాషాయాంబరాలు ధరించివుంది. ఇద్దరూ ఒక బల్ల దగ్గరకు వెళ్ళారు. దానిపై లేడిచర్మం పరిచివుంది. దాని కిరువైపుల పట్టు తలగడా లున్నాయి.

'భైరవీ! ఇవ్వాళ నేను నీతో కలిసి ఒక కార్యారంభం చేయాలి నా పనిలో నువ్వొక సహాయకారిణిగా వుండాలి' అన్నాడు అతడు. తలుపులన్నీ బంధించబడి వున్నాయి, గది విశాలంగా వుంది. అక్కడ సౌందర్య విలాస సామాగ్రులన్నీ అలంకృతమై వున్నాయి. అత డొక వెండి పాత్రను తీసుకుని దానిలో బూడిదవర్ణమైన ఒక ఘటంనుంచి కొంచెం ద్రవపదార్థాన్ని పోంఛాడు. దానిని త్రాగి, యువతికి కూడా త్రాగించాడు.

అతడు నవ్వుతూ నవ్వుతూ తనచేతిని ఆమె వీపుపై వేశాడు. నెమ్మదిగా నడుానికి బిగించబడివున్న ఆ కాషాయరంగు కంచుకపు ముడిని విప్పాడు. ఆ దేదీప్యమానమైన వెలుగులో రెండు గోధుమవర్ణ ఉన్నత స్తనాలు నగ్నంగా బహిర్గతమయాయి.

ఒకక్షణం తరువాత అతడు గదినుంచి బయటకువచ్చినప్పుడు అలసిపోయివున్నాడు. అయినా శాంతంగావున్నాడు, యువతికూడా అతడివెంటే వుంది. అతడి కళ్ళల్లో ఉల్లాస గర్వాలు గోచరిస్తున్నాయి. అతడు ద్వారం చెంత కాస్సేపాగి,

యువతిని అక్కడవదలి ఆలయం వెనుకకువచ్చి నిరీక్షించ సాగాడు. చాలాసేపటివరకు ఈ విధంగానే కూర్చున్నాడు; మాటిమాటికి ఆకాశంకేసి చూసేవాడు. చాలాసేపు నిరీక్షించిన తర్వాత అతడు బండను తొలగించాడు. అతడు ఆ యువతిని దింపిన భూగర్భమార్గంవద్ద చెవిఒగ్గి వినసాగాడు. అతడి కళ్ళు మూతలుపడ్డాయి. త్రుళ్ళిపడి కళ్ళు తెరచాడు. ముఖంమీద నల్లనిముసుగు కప్పుకున్న శ్వేత వస్త్రధారి ఒకడు తన వీపుపై ఎక్కివుండటం అతడు గమనించాడు. భయంతో అతడు కంపించాడు.

'అహాహా ఆ!' ఆవ్యక్తి అట్టహాసం ప్రతిధ్వనించింది. 'బ్రహ్మాలయపు పురోహితుడు మద్యం సేవిస్తాడు. ఓయీ బ్రాహ్మణుడా! బలియిచ్చే నీ ఏర్పాట్లు భగ్నమైపోయాయి. ప్రబుద్ధకేతుని హత్య జరుగలేదు...'

అతడు భయంతో కంపించిపోతున్నాడు. వదిలించుకోటానికి చేసిన యత్నం వృథా అయింది.

మళ్ళీ ఆ కంఠం ప్రతిధ్వనించింది. 'నువ్వొక స్త్రీని వుంచుకున్నావు. ప్రపంచం కళ్ళల్లో కారంజల్లి, నీ పాండిత్య, కర్మకాండల ముసుగుచాటున కామేచ్ఛను, పైశాచిక రక్త పిపాసను దాచుకో దలుస్తున్నావు. అదీ అంత చెడు కాదనుకున్నా, నువ్వు త్యాగి, ధర్మనిష్ఠాపరుడు, సన్యాసిని హత్య యచేశా ప్రయత్నించావు.'

అతడిస్వరం తీవ్రమైంది. 'నువ్వు దుర్మార్గుడవు. ప్రజలు నీమతాన్ని వదిలేస్తున్నారు. దానిలో సాధన, ప్రేమ లేవు.

పండితుడా! శుష్కజ్ఞానం, పైశాచికబలం నిన్ను చంపేస్తున్నాయి.'

ఆదేశమయ్యాక అతని చేతిలోని ఖడ్గం వెలుగులో మెరిసింది. భీతిజెందివున్న పండితుడు కిక్కురుమనకుండా స్పృహతప్పి పడిపోయాడు. అప్పుడా వ్యక్తి గంభీరాట్టహాసం గావించాడు. తెరచివుంచిన రహస్య మార్గంగుండా అతడి వలెనే వున్న శ్వేతాంబరధారి ఒకడు పైకి వచ్చాడు.

మొదటివ్యక్తి తన ఖడ్గాన్ని తిరిగి ఒరలో పెట్టేసుకున్నాడు. 'నేను దీనిని మానవరక్తంతో అపవిత్రంచేయను. దీని భయమే చాలు ఇతడి జీవితాన్ని హరించడానికి' అని అన్నాడు.

తర్వాత ఆ యిద్దరూ ఆ భూమార్గంలోకి దిగి అంతర్ధానమయ్యారు. యువతి ఆలయపుమూల దాగి ఇదంతా చూస్తూనేవుంది. ఆ యిద్దరూ వెళ్ళిపోయిన తర్వాత ఆమె నెమ్మది నెమ్మదిగా ఆ బండ సమీపానికి వచ్చింది. ఆ బండ మీద కూర్చొని మహాపండితునికి గాలి విసరసాగింది.

ఆమె నేత్రాలు భీతితో నిండివున్నాయి.

కొద్దిసేపట్లోనే ఉదయం కానుంది. ఆమె శరీరమంతా అలసట చెందివుంది. అయినా ఆమె విసుగులోనే వుంది. మధ్య మధ్య చైతన్యరహితంగా పడివున్న అతడి ముఖంకేసి చూస్తూనూవుంది. అయినా ఆమె కళ్ళు మాత్రం తెరచివున్న రహస్య మార్గం వేపే వున్నాయి. ఇంతకుముందెన్నడూ ఆమె దానిని చూడనేలేదు.

సరిగ్గా ఒకగంటసేపటికి భరద్వాజుడు మేల్కొన్నాడు. సమీపమందు యువతిని చూసి 'భైరవీ! నువ్విక్కడున్నా వేమిటి? నేను నీ గదిలో వున్నానా?' అని అడిగాడు.

తర్వాత నెమ్మదిగా అతడికి అంతా స్ఫురణకొచ్చింది. తెరచివున్న రహస్యమార్గాన్ని, అటుకేసే చూస్తున్న యువతిని గమనించి నెమ్మదిగా 'భైరవీ! నువ్వు గదిలోకి వెళ్ళు. నువ్విక్కడకు రావటం అంత మంచిదిగాద'ని చెప్పాడు.

అతడు కొంచెం ఓపిక తెచ్చుకొని లేచి కూర్చున్నాడు. భైరవి నిశ్శబ్దంగావున్న ఆలయంకేసి చూసి మాయమై పోయింది. అతడు రహస్యమార్గ ద్వారాన్ని మూసివేసి ఆలయపు ప్రవేశద్వారం చెంతవున్న గదిలోకి వెళ్ళాడు. రాత్రి తాను పంపిన ఆ యువకులిద్దరూ అక్కడ నిద్రపోతూండటం కన్పించిం దతడికి.

అతడి పాదధ్వని విని వారిలో ఒకడు మేల్కొన్నాడు. 'ప్రచండా! ఏం? మీ పని పూర్తయిందా?' అని అడిగా డతడు. ప్రచండుడు తడబడుతూనే లేచి కూర్చున్నాడు.

అతడు మెల్లగా 'రహస్యమార్గంగుండా మిమ్మెవ్వరో వెంబడించారు. మేము అడవిలోంచిదాటి ఆరామపు గోడ న దాటతూవుండగా వాళ్ళు మమ్మల్ని ముట్టడించారు. వాళ్ళు చాలామంది వున్నారు. మేము చేసేదేమీ లేదిహ .........నరహత్యా చేసిన పాపం నరహత్యతోనే పోతుంది. కనుక యువకులారా! మీరు ప్రాణాల్నివ్వటానికి సిద్ధంగా వున్నారా?' అని అడిగారు మమ్మల్ని.

వారు మమ్మల్ని ఒక చెట్టుకు కట్టివేశారు.

'మీరు హత్యచేయాలని బయలుదేరారు. అందుకు త్వరలోనే మీరు శిక్షింపబడతారు. మీరు త్వరలోనే బుద్ధుని మతాన్ని అనుసరిస్తామని వాగ్దానం చేయండి, లేకుంటే మీ ప్రాణాలు......' అన్నారు.

వారు మమ్మల్ని చంప నారంభించారు. ఇంతలో ఇద్దరు వ్యక్తులు వచ్చారు. వారుకూడా ముసుగులు వేసుకునే వున్నారు. వారిలో ఒకవ్యక్తి ముందుకు వచ్చి 'వాళ్ళను వదిలెయ్యి' అని చెప్పాడు.

మమ్మల్ని వదలివేసిన తర్వాత మేము భయంవల్ల రహస్యమార్గంనుంచి రాకుండా ఇటు తిరిగి వచ్చాం.

'అయితే ఇక్కడ మీకు ప్రవేశద్వారపు తలుపు ఎవరు తెరిచారు ?'

ప్రచండుడు వెనకా ముందాడుతూ 'అది తెరిచేవుంది' అని అన్నాడు.

కిటికీనుంచి ఉదయప్రకాశం లోనికి వస్తోంది. ఆ వెలుగులో తడబడుతున్న యువకుని ముఖలక్షణాలు అనుభవశాలియైన మహాపండితుడు గమనించకపోలేదు.

అతడు కఠోర కంఠస్వరంతో 'యువకుడా, నువ్వు కార్యభ్రష్టుడవయ్యావు. నువ్వు యజ్ఞదేవతను కళంకిత మొనర్చావు. ఈ ఆలయంలో నువ్వే యువతినైనా చూశావా ?'

యువకుడు సందేహిస్తూ 'పండితశ్రేష్ఠా !' అన్నాడు.

రెండవ యువకుడు నేలోకిని భయంవల్ల లేవలేక పోతున్నాడు. మహాపండితుడు ఆ తర్వాత చెప్పింది అతనూ విన్నాడు. 'చూడండి ద్వారం చెంత నాకీకంచుకం లభించింది. ఇది యజ్ఞసంబంధమైన వస్త్రం. నేను దీనిని యజ్ఞకన్య భైరవికి ఇచ్చాను. యజ్ఞవస్తువును మీరు అపవిత్రం చేశారు. నిజం చెప్పండి, ద్వారం ఎవరు తెరిచారు ?'

పగతో అతడికళ్ళు నిప్పులవలె మండుతున్నాయి. యువకుడు మౌనం వహించాడు.

'నేను మీ మాటలన్నీ అబద్ధమనే తలుస్తున్నాను. మీరు పిరికిపందలు, మీరు ధర్మహాని చేశారు......ద్వారం ఎవరు తెరిచారు ?' అన్నాడు మహాపండితుడు.

ప్రచండుడు సిగ్గుపడుతూ 'భైరవి !' అని చెప్పాడు. మహాపండితుడు మహోగ్రరూపమెత్తాడు. అతడు గదికేసి తిరిగి 'భైరవీ ! ఓ ఛండాలినీ ! నరాధములారా ! నువ్వా ప్రియుణ్ణి బలి యివ్వాల్సిందే. ఎంగిలివస్తువు దేవతకు తగదు' అన్నాడు.

అతడు నిద్రపోతున్న యువకుణ్ణి కాలితో తన్నుతూ 'మీరు మోసంచేశారు. ఇటు నడవండి' అన్నాడు.

అతడి కళ్ళలో భయంకరమైన పైశాచిక ఆకర్షణ వుంది. అతడు వారి కళ్ళకు భయంకరమైన దైత్యునివలె కన్పిస్తున్నాడు. అతడు పిడికిలి బిగించి వెనక్కి తిరిగి 'మీరు పారిపోలేరు. నేను ద్వారాలన్నీ బంధించేశాను. భైరవీ ! ఓ ఛండాలినీ !' అని పిల్చాడు. ప్రభాత సమయపు చల్లని

గాలిలో అతడి భయంకర గర్జన యజ్ఞస్తంభాల్లోనూ ఆలయ ఆవరణాలోనూ ప్రతిధ్వనించింది.

# 15

మరొక వసంతం వచ్చింది; వెళ్ళిపోయింది. రాజగృహంనుంచి యుద్ధవార్తలు వస్తూనేవున్నాయి. ఈసారి కూడా ప్రసేనజిత్తునికి అపజయమే కల్గింది. అతడు అజాతశత్రువుకు తన గ్రామాల్ని, అమూల్యమైన రత్నాభరణాలను ఇచ్చి సంధి చేసుకోవల్సివచ్చింది.

వైశాలిలోమాత్రం ఏమీ మార్పురాలేదు. వచ్చిన మార్పు ఒకే ఒకటి, నగరనివాసుల వినోదవిలాసాలపై ఒక నల్లని ఛాయాకృతి ఆవరించి నర్తిస్తుంది. నలువైపుల కాటకం అలముకుంటుంది. మరో విచిత్రం ఏమంటే వైశాలివీధుల్లో నల్లని ముసుగు మనుషులు కన్పించటం ప్రతిరోజు రాత్రింబవళ్ళు మామూలైపోయింది నగరరక్షకులకు వారంటే ఒక అజ్ఞాతభయం వుండేది. నృసింహుని పేరు చెప్తే ప్రజలు భీతితో కంపించిపోతున్నారు.

బౌద్ధసన్యాసుల సంఖ్య పెరుగుతూవుంది.

గ్రామాల్లోని ఉత్పత్తివల్ల ఆహారం లభ్యమా? అవకాశంలేదు. నగరంలో పనులు దొరకటంలేదు. దాసదాసీలు అతి చవకగా లభించేవారు, కాని దాసీల వెల మాత్రం చాలా ఎక్కువ వుండేది. ఆమె అందంగావుంటే

వెల మరింత పెరిగేది. సన్యాసులై ఆహారం సంపాదించటం తేలికై పోయింది, పెరిగిపోతూన్న సన్యాసులసంఖ్య నగరానికి భార రూపమైంది.

అంబాపాలి ఉద్యానంలో హేమాంకుడు, భీమసేనుడు, సూర్యకరణుడు, కుమారగుప్తుడు కూర్చునివున్నారు. అంబాపాలికూడా వుందక్కడ. అంబాపాలి అలంకరించుకునేవుంది. కుమారగుప్తని దుస్తులుకూడా మెరిసిపోతున్నాయి. హేమాంకుడుమాత్రం దుస్తులయందు ఎక్కువశ్రద్ధ చూపించేవాడు కాడు. 'నాకు పరిశోధనలతోనే తీరిక లేకుండా వుంది అంబాపాలీ! ఈ అలంకారాలు చిన్నతనపుపనులు. మనిషి వయస్సు వచ్చినకొద్దీ వీటిని త్యజిస్తాడు. నేనుజ్ఞానవృద్ధుణ్ణియి పోతున్నాను. అని అంటూండేవాడు' హేమాంకుడు. అని అంబాపాలికేసి చూసి దరహాసం చేసేవాడు.

అంబాపాలి కూర్చున్నచోటుకి ఎదురుగా సూర్యమణి నిల్చుని ఏదో చదువుతున్నాడు. అతడి దుస్తులు శుభ్రంగా, నీలంగావున్నాయి; మెడ కిరువైపుల పడుతున్న గిరజాలజుట్టు; ఒక విచిత్రమైన నల్లనిటోపీ ధరించాడు. దాని కిరువైపుల చెవులదగ్గర పెద్ద పెద్ద ఎర్ర ముత్యాలు రెండున్నాయి; అతడు ధరించిన పొడవైన ఉత్తరీయం నేలపై జీరాడుతూ వుంది.

భీమసేనుడు వైశాలి మహారక్షకుని శిరస్త్రాణం ధరించాడు. వెడల్పైన అంచులుగల అమూల్యమైన వస్త్రం తో అది తయారుచేయబడింది. దాని నతడు వంకరగా

ధరించాడు. దాని పొడవైన కుచ్చు ముందు వక్షంపై ఒక పెద్ద పతకమున్నచోటు వరకు వ్రేలాడుతోంది. అదేచోట అతడి ఖడ్గపు బంగారుపిడి కన్పడుతూవుంది. దానిపై 'మహా రక్షకుడు' అని ఏనుగుదంతంమీద వ్రాయబడివుంది.

ఆ రోజున కుమారగుప్తుని జన్మదినోత్సవం. అంబాపాలి ఏదో వంకతో అనేకమంది రాజపురుషుల్ని ఆహ్వానించింది. ఆమె స్వయంగా ఒక ప్రేమ నృత్య గీతాన్ని రచించింది. ప్రేమికపాత్ర ఆమే, ప్రేమికునిపాత్ర కుమారగుప్తుడు. సూర్యమణి మిత్రుడు, కవి పాత్రను వేశాడు. భీమసేనుడు వనరక్షకుని పాత్ర. హేమాంకుడు ప్రేక్షకుడిగానే వున్నాడు. అసలు కథ ఇది: ఇందులత సుదాస్‌కుమార్‌ను ప్రేమిస్తుంది. ఆమె నగరసెట్టి కుమార్తె, కాని వాగ్దత్త. సుదాస్‌కుమార్, ఇందులతలు పారిపోయి అడవిలో దాగి వుంటారు. కుమార్ తండ్రి, ఇది యువరాజు అరాచకమని భావిస్తాడు, భావించి అతణ్ణి శిక్షించటానికి ఏర్పాట్లు చేస్తాడు. అడవిలోనికి కుమార్ వెంట అతని మిత్రుడు చారుదత్తుడుకూడా వెళ్తాడు. మహారాణి కుమార్ వియోగంతో దుఃఖంలో మునిగిఉంటుంది. ఆమె ఒక తాంత్రికుని సహాయం పొందుతుంది. ఆమె వనరక్షకునిద్వారా చారుదత్తుడు, ఇందులతలకు మద్యంలో మంత్రించిన చూర్ణం కల్పిస్తుంది. దాని మహాత్యంవల్ల వారిద్దరూ ఒకరొకరు ప్రేమించుకోనారంభిస్తారు. రాజకుమారుడు ఈర్ష్యతోను, దుఃఖంతోనూ పిచ్చివాడవుతాడు. తన మిత్రుడు చేసిన విశ్వాసఘాతుకానికి

అతడెంతో దుఃఖిస్తాడు. ఒకనాటిరాత్రి అతడు మెదలకుండా వెళ్ళిపోతాడు...దూరంగా దూర దూరంగా...ఎక్కడికి? ఇహ అతడు తిరిగిరాడు! మూర్ఛప్రభావం తగ్గగానే ప్రేమికు రాలు మోసంనుంచి మేల్కొంటుంది; ఆమె సన్యాసియై సుదాస్‌ను వెతుకుతుంది. చివరకు ఒక అడవిలో నదీతీరాన ఇద్దరూ కలుసుకుంటారు. మహారాజు స్వర్గసుడవుతాడు. అక్కడే దూత అతణ్ణి రాజుగా ప్రకటిస్తాడు.

ఆట ముగిసిన తర్వాత అతిథులందర్నీ సా. ఁంపి వారు ఉద్యానంలోకి వచ్చి కూర్చున్నారు. ఇవాళ సూర్యమణి తన కావ్యం విన్పిస్తున్నాడు. అతడు దీనిని ఇవాళ ఉదయమే పూర్తి చేశాడు.

ఇంచు మించు రెండు గంటలకాలం సూర్యమణి దానిని విన్పిస్తూనేవున్నాడు. అంబాపాలికి తన కవితా ప్రతి భను చూపించా లనేదే అతడి ప్రధానోద్దేశ్యమనేది స్పష్టమే. మధ్య మధ్య అతడు ఆవేశంగా చదివేవాడు, కను బొమలు ముడివేసి వారగా అంబాపాలికేసి చూసేవాడు.

చివరి కతడు దానిని పూర్తి చెయ్యబోయే సమ యానికి ఉద్యానం వెలుపల, లోపల ఏదో కోలాహలం విన్పించింది.

కుమారగుప్తుడు విషయం తెలుసుకుంటానికి ముంగి టకు వెళ్ళాడు. అంతా జనంతో క్రిక్కిరిసివుండటం అతడు చూశాడు. వాళ్ళ శరీరాలు అర్ధనగ్నంగా ఉన్నాయి. పొట్ట లోనికి పీక్కుపోయింది, కాళ్ళు చేతులు ఎండి ఊచలవలె

ఉన్నాయి. నీచజాతిజనంవలె ఉన్నారు. వారేదో అరుస్తున్నారు. కుమారగుప్తుడు ద్వారపాలకులకోసం అటు ఇటు తిరిగిచూశాడు, వాళ్ళందరూ పారిపోయారు; ఎవరూ లేరు.

అతడికేమీ అర్థంకాలేదు.

'ఏమిటి? ఏం కావాలి మీకు?' అని అతడు బిగ్గరగా అరిచాడు.

'అన్నం.'

'అన్నం.'

'అన్నం.'

'అన్నం.'

కోలాహలం ఇనుమడిస్తోంది. సన్యాస కంకాళాలు ముందుకు నెట్టుకొస్తున్నాయి. కుమారగుప్తుడు దృఢంగా ముందడుగు వేశాడు.

'మీ రెవరు? మీ కేం కావాలి?' అని అడిగా డతడు మళ్ళీ.

వాళ్ళల్లో ఒక యువకుడు ముందుకు వచ్చి 'మాకు అన్నం కావాలి!' అన్నాడు.

'మీ రెవరు?' అన్నాడు కుమారగుప్తుడు కోపంతో ఎర్రనవుతూ.

'మేము ప్రజలం, మేము ప్రజలం' అని లక్షకంఠాలు ప్రతిధ్వనించాయి. వారిహ ఇప్పుడు కుమారగుప్తుణ్ణి నెట్టుకుని లోనికి జొరబడ్డారు. వారు మిడుతలదండువలె పుట్టుకొస్తున్నారు. లోని అమూల్య సామాగ్రి నంతట్నీ ధ్వంసం

చేయ నారంభించారు. కుమారగుప్తుడు కోపంతో పిచ్చి వాడై పోయాడు. అతడు రెండుచేతుల్తోను వాళ్ళను నెట్టి వేయ నారంభించాడు. చివరి కతడు అలసిపోయాడు. ఒక ప్రవాహం పొంగివస్తోంది. అపజయంపొంది తన ప్రశ్నకు జవాబు చెప్పిన యువకుణ్ణి పట్టుకున్నా డతడు.

'దీనికి బాధ్యులు ఎవరు?' అని అడిగాడు.

'మాకు అన్నం కావాలి.'

'అది ఆహార శాఖాధికారుల వద్ద లభిస్తుంది, మూర్ఖుడా!' అని కుమారగుప్తుడు ఉద్రేకంతో 'దీనికి మీరు ప్రాయశ్చిత్తం చేసుకోవాలి' అన్నాడు. అతడు తన కత్తిని దూసి యువకుణ్ణి గాయపర్చాడు. రక్తధారతో తెల్లచలువ రాయి పరిచిన ఆ నేలంతా ఎరుపెక్కింది. జనం రక్తాన్ని చూసి వెనుదిరిగింది.

ఆకస్మికంగా అంబాపాలి కంఠస్వరం విన్పించింది. 'కుమారగుప్తా! ఏమిటది? ఈ రక్తం ఏమిటి? ఈ జనంఎవరు?' అని ఆమె బిగ్గరగా పిలిచి అడిగింది.

అప్పటికే జనసమూహంలోని చాలాభాగం బైటకు వెళ్ళిపోయింది. మిగిలినవాళ్ళు అంబాపాలి మధురమైన ఉద్రేకస్వరం విని అటు తిరిగారు. ఆమె సింహం విగ్రహం వద్దవున్న బల్లపై నిల్చుని వుంది.

వారు నమస్కరిస్తూ 'దేవి, అంబాపాలీ! మాకు నీళ్ళివ్వు!' అన్నారు.

అప్పు డాకస్మికంగా అరే, వీరు గ్రామీణులు కాదు గదా, లేక నగరంలోని క్షామపీడితులా?_ అని అంబాపాలికి గుర్తొచ్చింది.

'వారిని వుండనివ్వు. ను వ్వితణ్ణి పెద్దగా గాయపర్చావా?' అని అంది కుమారగుప్తు డినుద్దేశించి.

కుమారగుప్తుడు మౌనం వహించాడు.

'మీరు మూర్ఖులు! మీరు నా భవనంలోని అమూల్యమైన వస్తువులన్నింటినీ నాశనం చేసివేశారు. నా భవనం నుంచి బయటకు పొండి!' అని అరిచింది అంబాపాలి.

ఒక వృద్ధుడు ఆమె కాళ్ళు పట్టుకున్నాడు. 'అన్నం?' అన్నా డతడు.

'మీకు అన్నం లభిచేంది, ఇక్కడగాదు, భవనం వెలుపల!' కొంచెం కఠినంగా అంది అంబాపాలి.

కుమారగుప్తుడు విస్మయంగా చూశాడు_వాళ్ళామెకు నమస్కరిస్తూ అన్నపానీయాల నడుగుతూ గృహప్రాంగణం నుంచి మెల్లమెల్లగా బైటకు వెళ్ళిపోయారు. ఆ యువకుడు, ఒక యువతిమాత్రం మిగిలారు. యువకుడు ఇటు అటు వూగి క్రిందపడిపోయాడు. యువతి అతడి భుజంమీది గాయాన్ని తుడుస్తోంది.

అంబాపాలి గదిలోకివెళ్ళి ఏదో ద్రవపదార్థం తెచ్చి 'పెద్దదెబ్బ తగిలిందా ఏం?' అని యువకుణ్ణి అడిగింది. ఈ విధంగా భవనాల్లో జొరబడటానికి మీరెలా సాహసిస్తారు?' అంది.

ఆమె ఆ ద్రవ పదార్థాన్ని యువతి చేతికిస్తూ 'దీనిలోని ఔషధాన్ని ఒకక్షణం మర్దించు. బాగవుతుంది' అని చెప్పింది.

యువకుడు సగం తెలివితప్పాడు. యువతి అతడిని పట్టుకొని నెమ్మదిగా బైటకు తీసుకువెళ్తూవుంది.

అంబాపాలి కుమారగుప్తుని కేసి తిరుగుతూ 'నీ పేరేమి టమ్మాయీ?' అని అడిగింది ఆ యువతిని.

'సుభాగ.'

'నువ్విక్కడే వుండు. నేను నీకు అన్నము, ధనము ఇస్తాను' అంది అంబాపాలి – అని కుమారగుప్తుని కేసి తిరిగి నువ్వు తొందరపడ్డావు' అంది.

తిరిగి వారు ఉద్యానంలోకి వెళ్ళారు. అంబాపాలి గదిలోకి తిరిగి వచ్చింది. ఇదే సమయానికి సైనికు లనేకమంది ప్రాంగణంలోకి ప్రవేశించారు. 'ద్వారంలో ఎవరూ లేరే? ప్రతిహారీ! మహారక్షకుడు భీమసేన్ కుమార్ గారిక్కడ వున్నారా?' అని అరిచారు వాళ్ళు.

అంబాపాలి బైటకు వచ్చింది. ఆమె ఒకసారి గాయ పడిన యువకుని కేసి, ఆ యువతి కేసి చూసింది. ఆ తర్వాత సైనికులవంక తిరిగింది.

సైనికులు ఆమెకు సైనికవందనం చేశారు. 'అంబా పాలి దేవికి జై! శ్రీహట్టి హాలికులు అరాచకం రెచ్చగొట్టారు. వాళ్ళు గ్రామరక్షక ప్రధానిని హత్యగావించారు. ఇప్పు డిహా వారు రాజోద్యానంవైపుగా సాగివస్తున్నారు. వనరక్షకులు

సైనికశస్త్ర సమేతంగా వారిని ఎదిరించడానికి సిద్ధంగా వున్నారు. దేవీ! మహారక్షకులవారెక్కడ?' అని అడిగారు.

అంబాపాలి వెనుదిరిగి చూసింది. బహుశా ఆమె కుమారగుప్తుణ్ణి వెదుకుతుంది. అతడు ఉద్యానంలోనే ఉండిపోయాడు. ఒక్క క్షణం ఆమె మౌనం వహించింది. తర్వాత ఆమె మెల్లగా 'సైనికులారా! మహారక్షకులవారిక్కడినుంచి వెళ్ళిపోయారు' అని చెప్పింది.

సైనికులు మరేమీ మాట్లాడకుండా ఆమెకు సైనిక వందనం చేసి బైటకు వెళ్ళిపోయారు.

అంబాపాలి చుట్టూచూసింది; సేవకులు లేరు, రక్షకులు లేరు, ప్రతిహారి లేడు, విజయవర్మ లేడు. వీళ్ళందరూ ఏమయారు?

వెనుదిరిగి ఆమె గదిలోకి వెళ్ళింది.

అక్కడినుంచి లోని గదిలోకి వెళ్ళేసరికి, లోన దేవదారు స్తంభం వెనుక భయంతో భీతిగొన్న చంద్రసేన దాగి వుండడం కన్పించింది.

'చంద్రసేనా!' ఆమెకు నవ్వొచ్చింది. 'నువ్వా! పిచ్చిదానా! ఈ జనతా జనార్దనులు నన్ను వరించడానికి వచ్చారు' వెలవెలబోతున్న ఆ బాలిక మరింత తెల్లబడింది. ఇప్పుడిహ నెమ్మదిగా స్తంభం చాటునుంచి బైటకు వచ్చింది.

# 16

హోమగుండంలోని అగ్ని నాలుకలు చాచుచూ ప్రజ్వరిల్లుతోంది. యజ్ఞకర్త దానిలో నువ్వులు మొదలైన నవధాన్యాలు, మద్యము, మాంసము సమిధలుగా వేస్తున్నాడు.

భైరవి ఒక స్తంభానికి కట్టివేయబడివుంది. ఆమె అర్ధ చేతనావస్థలో వుంది. ప్రచండుడు, అతడి మిత్రుడు హోమ గుండ సమీపాన కూర్చునివున్నారు. హోమగుండం ఆకారం 6X5X6 అడుగులుంది. యజ్ఞమండపంలో వున్న హోమగుండా లన్నింటిలోనూ అది పెద్దది.

యజ్ఞకర్త ముఖంలో హర్షోల్లాసాలు, కార్యదీక్ష, ఉత్సాహ చిహ్నాలు కన్పిస్తున్నాయి. అతడు కఠోరరూపం ధరిస్తున్నాడు.

అతడు ఎత్తయిన కలశాలకేసి, వాటికంటె ఎత్తుగా వున్న ఆకాశంచేసి చూస్తూ 'దేవతా! నువ్వుధన్యుడవు. నేటికి మూడు సంవత్సరాల తరవాత నీకు ప్రసాదం లభించ గల్గు తుంది. వాళ్ళల్లో శ్రద్ధలేదు, వారిలో భక్తి లేదు, వారిలో దైవభావనే లేదు. బ్రహ్మా! వారిపై నీక్రోధాన్ని కురిపించు' అన్నాడు.

భక్తిపారవశ్యంతో అతడి కళ్ళు మూతలు పడ్డాయి. అతడు చాలా సేపటివరకు ధ్యాననిమగ్నంగా వున్నాడు. అప్పుడతడు కళ్ళు తెరిచాడు. అతడిలో ఆకర్షణ ఇనుమడించింది.

'యువకుడా! ఖడ్గం తీసుకో!' గంభీరమైన అతడి కంఠ స్వరం ఆలయంలో మార్మోగింది.

ఎవరూ కదలలేదు.

'యువకుడా! ఖడ్గం తీసుకో!' అతడి కంఠం మరింత కఠోరంగావుంది ఈ పర్యాయం.

ఎవరూ కదలలేదు.

అతడు తన చింతనిప్పుల్లాంటికళ్ళతో వారికళ్ళల్లోకి చూశాడు. ఒక్క క్షణకాలం మౌనంగా అలా చూస్తూ వున్నాడు. మళ్ళీ అతడు అంతకంటే కఠోరంగా 'ఖడ్గం తీసుకో!' అన్నాడు.

ఈసారి ఇద్దరు యువకులూ కదిలారు. వారు మహా పండితుని భీషణ ఆకర్షణశక్తికి లొంగిపోయారు. చేయునది లేక, నిస్సహాయులవలె ఏదో అదృశ్యశక్తి నడిపించినట్లు ఖడ్గాలు చేబూని ముందుకొచ్చారు. యజ్ఞకర్త అదేవిధంగా వారివంక చూస్తున్నాడు. స్తంభానికి కట్టియున్న యువతికేసి సంజ్ఞ చేస్తున్నాడు.

వారు భైరవికట్లు విప్పి బలిపీఠంవద్ద కూర్చోబెట్టారు. యజ్ఞకర్త అధర్వణవేదంలోని మంత్రాలు చదువసాగాడు. ఒక్క క్షణకాలం అతడు భైరవిని, ఆ యువకుల్ని చూడడం కూడా మర్చి తనపనిలో మునిగిపోయాడు.

ఆలయం అంతా నిశ్శబ్దంగా వుంది. ప్రొద్దుజారుతూ వుంది. దేవదారు కొయ్యలు మండుతున్న చప్పుడు, ఆజ్యాలల ధ్వని మినహా మరేమీ విన్పించడంలేదు.

యజ్ఞకర్త ధ్యానం నుంచి కళ్ళు తెరిచాడు. ఆయనలో రెండు అగ్నిగుండాలు ప్రజ్వరిల్లుతున్నాయి. అయినా అతడి ముఖముద్ర శాంతంగా వుంది.

'బలివ్వండి!' అన్నాడతను.

యువతి కంపించింది.

యువకులు కంపిచారు.

'ఏమిటిది? మీరు యజ్ఞాన్ని వ్యతిరేకిస్తున్నారా! మీరు దైవాన్ని నిరాకరించగలరా?' అని గర్జించింది యజ్ఞకర్త కంఠస్వరం క్రోధంతో.

అతడు లేచి నిల్చున్నాడు.

'మీరు కంపిస్తున్నారా...' అతడు వికటాట్టహాసం చేశాడు. 'దైవం మీకు తన లోకాన్నిస్తాడు! ప్రచండా, బలివ్వు' అన్నాడు.

అత డేదో నిశ్చయానికి వచ్చి బలిపీఠం చెంతకు నడిచాడు. ప్రచండుడు వ్యతిరేకించాడు — 'ఆర్యా! వైశాలిపరిషత్తు నరబలిని నేరంగా పరిగణించింది. మీరు రాజదండన ననుభవించాలి' అని అన్నాడు.

'రాజదండనా?' అని యజ్ఞకర్త ఒక క్షణకాలం ఆగాడు, అతడి అట్టహాసం నల్దిశల ప్రతిధ్వనించింది మళ్ళీ.

'బ్రహ్మాలయంలో ఒక శాసకు డున్నాడు — అతడే బ్రహ్మ పురోహితుడు. మూర్ఖయువకుడా! ఇవాళ పుణ్య పర్వం. దేవతకు బలై నువ్వు జన్మజన్మాంతరాలకు సుఖ ప్రాప్తిని పొందుతావు. నువ్వు సిద్ధంగా వున్నావా?'

అతడి పెదవులపై కుటిలత్వం నర్తించిం దాక్షణంలో బలిష్ఠమైన విశాలబాహువుల్ని పైకెత్తి 'ఓ దేవతా! ధన్యుడవు!' అన్నాడు.

అదేసమయానికి పడమటిదిక్కున వున్న స్తంభంచాటు నుంచి ఒక ముసుగుమనిషి ప్రత్యక్షమయాడు. పురోహితుడు అతణ్ణి చూసి కంపించాడు.

'బ్రహ్మాలయంలోకి నువ్వెందుకొచ్చావ్ ? ఎవరు నువ్వు ?' అని అరిచా డతడు.

ముసుగుమనిషి దృఢమైన యువకునివలె వున్నాడు. నిశ్చలంగా, గంభీరంగా నెమ్మదిగా అడుగులువేస్తూ అతడు బలిపీఠం చెంతకు వచ్చాడు. అతడు తన ముసుగును తొలగించాడు. నెమ్మదిగా, తూచినట్లు 'నువ్వీకార్యంలో సాఫల్యం చెందలేవని ఇప్పుడైనా నిశ్చయమేనా?'అన్నాడు గంభీరంగా.

పురోహితుడు స్తబ్ధుడై పోయాడు. అతడి చేతిలోని ఖడ్గం కంపించిపోతోంది. అతడు ధైర్యం కోల్పోయాడు.

ఆగంతుకుడు బిగ్గరగా నవ్వాడు. అతడి సైగననుసరించి యువకులు భైరవిని లేవదీశారు. అత డామెచెంతకు వెళ్ళిపోయాడు.

నృసింహుడు నవ్వాడు. 'నృసింహుడు దస్యుడు. అతడు బౌద్ధుడూ గాడు, బ్రాహ్మణుడూ గాడు. 'ఈ యువకులచేతికి ఖడ్గాలివ్వు, అప్పుడు బలివ్వగల శక్తివుంటే మీ దైవం గొప్ప వీరుడైనట్లే. దస్యుశ్రేష్ఠుడైన నృసింహుడు పిరికితనాన్ని గొప్పగా ఎంచడు' అన్నాడు.

'ఈ బలిని వ్యతిరేకించకు, దస్యూ! ప్రజలు క్షామ పీడితు లవటం నువ్వు చూడటంలేదా? అనావృష్టిబాధ నీకు తెలియదా! రోగాలు; శోకాలు, కాటకాలు, మరణాలు— ఇదంతా దైవప్రకోపం. బౌద్ధసన్యాసులు బలుల్ని ఆపు జేయించారు. దేవతకు ఆహారం లభించటంలేదు. అతడు క్రోధితుడయాడు. వైశాలి పాడుపడిపోవటం చూడదలచావా నువ్వు?' అన్నాడు పౌరోహితుడు.

అతడి కంఠస్వరంలో ఒక భీషణ విశ్వాసం వుంది, అదిచూచే దస్యుడుకూడా ఒక లిప్తకాలం చలించాడు. కాని వెంటనే నిగ్రహించుకుని 'నువ్వు మారుతున్న కాలాన్ని గుర్తించలేదు, భరద్వాజా! దేవతలు వేటికి ప్రసన్నలౌతారు—అనేది ఎవరూ చెప్పలేరు. ప్రజలు బలికి వ్యతిరేకిస్తున్నారనేది నువ్వు చూస్తూనేవున్నావు. మనం జీవితాల్ని ఇవ్వలేనప్పుడు తీసుకోవటం ఎందుకు? మానవునికి అన్నింటి కంటే ప్రియమైనది, విశిష్టమైనది అతడి ఆత్మ. మనం దాని నెందుకు బలివ్వగూడదు? స్వార్థత్యాగం—ఉపనిషత్కారులు దీనినికూడా బలే అన్నారుగా!' అన్నాడు నృసింహుడు.

పురోహితుడు నవ్వుతూ 'బ్రహ్మాలయంలోని పురోహితుడు దస్యునివద్ద శాస్త్రశిక్ష పొందాల్సిన అవసరంలేదు. నృసింహా! నువ్వు అసమయంలో వచ్చావు. దేవతలు మేల్కొన్నారు' అన్నాడు.

పురోహితుడు మరీ ఉత్తేజితుడయాడు 'యజ్ఞ హుతభుక్కు జ్వాలల నాలుక చాస్తున్నాడు. అతడు సమిధలతో

సంతృప్తిచెందదు. సంతృప్తిచెందదు నువ్వు చూడలేక పోతున్నావు, కాని నేను చూడగల్గుతున్నాను. దేవతలు మేల్కొన్నారు అతడు స్వాహాకేసి క్రోధంగా చూస్తున్నాడు. ఆయన్ని రెచ్చగొట్టిం దేవరు, అయ్యో! స్వాహా! దేవీ! నువ్వు నాకేసి ఏం చూస్తున్నావ్! అగ్నిదేవా; బ్రహ్మకు బలి జరగదు......'అని అతడు నిప్పులురాలుతున్న కళ్ళతో యువకులు, భైరవి, నృసింహులకేసి చూశాడు.

'నరబలి జరిగితీరుతుంది. యజ్ఞంకోసం రగిల్చిన అగ్ని ఈవిధంగా శాంతించదు. అది బలి కోరుతుంది, బలి జరిగి తీరుతుంది' అని అరిచాడతడు.

ఖడ్గాన్ని దృఢంగా పట్టుకుని అతడు వారికేసి నడిచాడు.

నృసింహుడు ముందుకురికి తన ఖడ్గంతో ఎదుర్కొన్నాడు. రెండు ఖడ్గాలు ఢీకొన్నాయి. ఆ తళ తళలకు, రెండు ఖడ్గాలు ఢీకొన్న ధ్వనికి అతడి చేతులు కంపించ సాగాయి.

నృసింహుడు వెనక్కి తగ్గి 'వైశాలి సైనికులు ఇక్కడే వున్నారు. ఓరీ పండితుడా, రాజనియమాన్ని ఉల్లంఘించావు నువ్వు. రాజాజ్ఞకు వ్యతిరేకమైన పనిని ప్రారంభించావు. ముగ్గురు వ్యక్తుల్ని నువ్వు బలివ్వాలనుకున్నావు......' అని నృసింహుడు మౌనం వహించాడు.

ఎదుటి స్తంభాల చాటునుంచి సైనికులు బైటకు వస్తున్నారు. పురోహితుడు మరుక్షణంలోనే పరిస్థితిని గ్రహిం

చాడు. అతడు ఖైదీ అతడు హోమగుండంచెంతకు వెళ్ళి దాని ఒడ్డునే నిలబడి 'మీరు నశిస్తారు! మీరు ధ్వంసమై పోతారు!' అన్నాడు. సైనికులు సమీపిస్తున్నారు.

జలాన్నంతా కూడదీసుకుని అతడు ఖడ్గాన్ని పైకెత్తి 'మీరు నాశనమౌతారు!' అన్నాడు బిగ్గరగా, 'వైశాలి మట్టి పాలవుతుంది. మీ సంతానం మీ పనుల్ని నిరసిస్తుంది. మాట్లాడుతుంది బ్రహ్మ. అతడిమాట అబద్ధంకాదు.'

సైనికులు హోమగుండం సమీపానికి చేరుతున్నారు. హఠాత్తుగా పురోహితుడు అరుస్తూ 'బ్రహ్మా, దేవతా! బ్రహ్మా, దైవమా!' అని అతడు ఒక అడుగు వెనక్కి వేశాడు ఇప్పుడతడు యజ్ఞజ్వాలల్లో దహనమైపోతున్నాడు. అతడి శరీరమంతటా మంటలు వ్యాపించాయి.

సైనికులు స్తంభించిపోయారు; నృసింహుడు స్తంభించి పోయాడు.

ఏమిటీ జరిగింది? ఇలా జరుగుతుందని ఎవరైనా ఊహించారా?......'వైశాలి మట్టిగలుస్తుంది!' అని అంతిమపర్యాయం బ్రహ్మనుపిలుస్తూ ఆ అలయు పురోహితుడు తన కంఠాన్ని నరుక్కున్నాడు.

బ్రహ్మకు బలి దొరికింది. ఆయన సంతృప్తిచెందాడు. హోమగుండంనుంచి దుర్గంధము! నీలవర్ణపుధూమం వెల్వడు తున్నాయి.

'ఇదే అంతిమబలి కావాలి' అన్నాడు నృసింహుడు. అని సైనికులమధ్యగుండా గంభీరాకృతితో అతడా స్తంభాల్లో అదృశ్యమైయాడు!

# 17

పరిషత్తు ఎన్నికలు ఈ సంవత్సరమే. గతసంవత్సర మంతా దీనికోసమే నెమ్మదిగా ఏర్పాట్లు జరుగుతూ వచ్చాయి. ప్రజాతంత్రానికి ఆ ఎన్నికలు చాలా ప్రాముఖ్యత గలవి. రాజపురుషుల్లో కుట్రలు, ఎత్తుగడలు ప్రారంభ మయాయి. 7707 గురు రాజపురుషులు ఎవరవాలి ?

వైశాలి నగర మధ్యమందు ఒక తెల్ల చలువరాతి జలాశయంవుంది. దానికి చుట్టూ నల్లరాతి మెట్లు కట్టారు. దానికి నలువైపులా రాతి సింహాసనాలు నిర్మించారు; వాటి పైన వర్షము, ఎండ పడకుండా వుండేందుకుగాను కొయ్య ఛత్రాలు నిలబెట్టారు. ఈ పవిత్రజలాశయంలోనే ఎన్నికైన వైశాలీ రాజపురుషులకు అభిషేకం జరుగుతుంది. పితృదేవుల అభిషేకానికి ప్రాచీనకాలంలో అవలంబించిన వైదిక పద్ధతులే ఇక్కడా వుండేవి. కొంతకాలంనుంచి బలుల కర్మకాండకూడా దీనితో సంబంధం కల్గి వుండేది. కాని ఈ సంవత్సరం బౌద్ధుల ప్రభావంతో బలుల ఏర్పాటు నిలిపివేయ బడింది.

అజాతశత్రుని సింహపాదులు వృజసంఘంలో తమపని తాము చేస్తూనే వున్నారు. అనేకమంది సెట్టులు, ప్రముఖుల విషయంలో, వారికి అజాతశత్రువునుంచి సహాయం లభిస్తుం దని అనుమానించబడుతూవుంది. వైసాలి ప్రజాతంత్ర, ప్రతిష్ఠలను దృఢతరం గావించటం వారివుద్దేశ్యం గాదు.

ఆరోజంతా ఆకాశంనిండా దట్టంగా మబ్బులు పట్టి వున్నాయి. క్షామపీడిత ప్రజలు వాటిని చూసి హర్షధ్వానులు చేశారు. రాజపురుషుల ఎన్నిక సమాప్త మయింది. తమ తమ శక్తితో పాతరాజపురుషులే అనేకమంది ఎన్నికయ్యారు. ఈ సంవత్సరం ఎన్నుకోబడిన రాజపురుషుల్లో సూర్యమణి కూడా ఒకడు. స్వర్ణసేనామాత్యులు, వారిపుత్రరత్నము భీమసేనుడు తిరిగి ఎన్నికయారు. ప్రతి శ్రేణి, కుల పెద్దలు ఈ పరిషత్తు సభ్యు లవుతారు. ఇంతేకాక, నగరాలు, గ్రామాల లోని అంతర్భాగాలనుంచి ఎన్నికయినవారుకూడా ఈ పరిషత్తు సభ్యులుగా పరిగణించబడతారు.

ఎన్నికలు అయిపోయాయి. దీనికికారణంగా నగరంలో అనేకమాసాలనుంచి హడావుడిగావుంది. ఇహ మిగిలివున్న దల్లా రాజ్యాభిషేకపు తంతు. చాలాసేపటినుంచి జనం అభిషేకస్థలంచుట్టూ మూగివున్నారు. మధ్యాహ్న మయ్యే సరికి ఎన్నికయిన రాజపురుషులందరూ మండపంలోకి చేరు కున్నారు; బ్రాహ్మణులు మంత్రాలు చదవనారంభించారు.

మంత్రాలు చదువుచున్న సమయంలోనే అభిషేక స్థలద్వారమందు ఏదో కోలాహలం విన్పించింది. రాజపురుషులు తమలోతాము కలుసుకుని మాట్లాడుకోసాగారు. మొదట వారు ఆ ప్రజాందోళనను గమనించలేదు. క్రమంగా ప్రజల కంఠారావాలు హెచ్చుపెరిగేసరికి వారిలో కొందరు రాజ పురుషులు ద్వారంచెంతకు వెళ్ళారు. అక్కడ చూసినదానిని బట్టి వారికి ఆశ్చర్యము, భయమూకూడా కల్గాయి.

కృశించిన, ఎముకల గూడుల్లాంటి వైశాలి గ్రామాల ప్రజలు క్రమక్రమంగా అక్కడికి చేరుకుంటున్నారు. వందలు, వేలమంది భూఖామందులు, హాలికులు విచిత్రమైన తమతమ పనిముట్లను భుజాలపై పెట్టుకుని ప్రవాహంగా వచ్చి పడు తున్నారు. వారి భుజాలపైవున్న విచిత్రమైన పనిముట్లు వారి వలెనే కృశించిపోయి. నీడవలె కన్పించే వారి బిడ్డాపాపలే. ముందున్న భూఖామందు భుజంపై మాత్రం ఒక నాగలివుంది. వాళ్ళు చాలా ఉద్రేకంగా మాట్లాడుకుంటున్నారు.

'ఎందుకు మీరందరూ ఇలా గుమిగూడుతున్నారు ? మీరు కోరే దేమిటి ?' అని అడిగా డొక రాజపురుషుడు.

నాగలి ఎత్తుకునివున్న భూఖామందు ముందుకువచ్చి 'శ్రీహట్టి, గోసిరా, రాజశి:, శాలార్ ఇంకా ఇతరగ్రామ ప్రజలు అంటే హాలికులు, భూఖామందులు కోరే దేమంటే పరిషత్తు వారి కష్టాలను అర్థంచేసుకుని, వాటిని నిర్మూలించ టానికి ప్రయత్నం చేయా లనేదే' అని చెప్పాడు.

'అయితే, ఇదేమి పద్ధతి ? అంటే వైశాలి పరిషత్తు కళ్ళుమూసుకుని పాలిస్తుందనే మీ అభిప్రాయమా ?' అని అడిగాడు మరొక రాజపురుషుడు.

'మేం మా గ్రామాలనుంచి ఎన్నికైన సభ్యుల్ని విశ్వ సించటంలేదు. వారు డబ్బు, లంచాలద్వారా ఎన్నికలయారు. మేము వారిని వ్యతిరేకిస్తాం.'

బైట వ్యతిరేకులైన జనసమూహం చేరిందని కొద్ది సేపటికే మండపమంతటా తెలిసింది. వైశాలిలోని ప్రముఖ రాజపురుషులందరూ 'ఏంచేయాలా ?' అని సభ చేశారు.

సింహద్వారాన్ని మూసివేసి, నగరరక్షకుల్ని అక్కడ కాపలా వుండాల్సిందిగా వారాదేశించారు.

'నగరంలోంచి ఇంకా సైనికుల్ని పిలిపించాలా ఏం !'

'అవసరంలేదు. వారు శాంతంగానే వుంటారు. వారి వద్ద ఆయుధాలేమీ లేవు.'

'అయినా వారు ప్రమాదకారులుగా కన్పిస్తున్నారు. ప్రేతాల్లా వున్నారు' వారి కళ్ళనిండా విద్రోహమే.'

మండపంలో రాజ్యాభిషేకం ప్రారంభమయింది. పురోహితులు మంత్రాలు చదువుతూ హోమగుండంలో నవ ధాన్యాలు వేస్తున్నారు. రాజ బ్రాహ్మణుడు జలాశయంలోని పవిత్రజలాన్ని క్రొత్త రాజపురుషులపై చిలకరిస్తూ మంత్ర దండాన్ని వారి శిరస్సులపై వుంచుతున్నాడు. తర్వాత వారికి రాజదుస్తుల నిచ్చి నుదురుపై తిలకం పెడ్తున్నాడు. ద్వార ముందు ప్రజావ్యతిరేకత పెచ్చుపెరిగిపోయింది. ఒక సేవకుడు వచ్చి 'సింహద్వారం వెలుపల జనం మహాసముద్రంవలె గుమిగూడారు. వారిని ఆపటం ద్వారపాలకులకు చాలా అసంభవ మవుతుంది' అని తెలియజేశాడు.

'వైశాలి రాజపురుషులారా! ప్రజల ఈ వ్యతిరేకతను మీరు ఉచితమని భావిస్తున్నారా ?' అని విచ్ఛలిరాజు అడిగాడు.

ఒక రాజపురుషుడు లేచి నిల్చుని 'రాజా, నేను శ్రీ హట్టి గ్రామంనుంచి ఎన్నికయ్యాను. అక్కడి భూ కామందులు దస్యు ప్రముఖుడైన నృసింహునితో కలిసిపోయారు. వారు రాజాజ్ఞను ఉల్లంఘిస్తున్నారు' అని చెప్పాడు.

'వారికి కష్టాలు లేవా ?'

'కష్టాలున్నాయి, అందుకే పరిషత్తు గతసంవత్సరం వాటిని తొలగించే ఏర్పాట్లుచేసింది. నిల్వవున్న ధాన్యాన్నంతా క్షామపీడితులకు పంచేసింది. బలులనుకూడా తగ్గించివేసింది. వాళ్ళు వినయవిధేయతతో రాజపురుషులవద్దకువస్తే అప్పుడు వారి కష్టాలను పోగొట్టే ప్రయత్నం చేస్తాం' అన్నాడు మొదటి రాజపురుషుడు.

'మనం వాళ్ళు చెప్పేది వినాలి. మనం ప్రజలలో అశాంతిని ప్రబలనివ్వకూడదు. ఈనాడు వైశాలి రాజకీయ పరిస్థితి అంతఃకలహాలను ఎదుర్కొనేస్థితిలో లేదు' అన్నాడు భీమసేనుడు.

'వారి బలులన్నీ రద్దుచేద్దాం. వైశాలి ధాన్యాగారం నుంచి వాళ్ళందరికీ ధాన్యం ఇద్దాం' అన్నాడు, లిచ్ఛవిరాజు.

ప్రతీహారి రాజసందేశం ప్రజలకు తెలియజేయుటకు ద్వారంవద్దకు వెళ్ళాడు.

మళ్ళీ తిరిగి రాజ్యాభిషేక కార్యక్రమం యథావిధిగా ప్రారంభమైంది.

'వాళ్ళు వెళ్ళిపోయారా ?'

'వెళ్ళిపోయారు. ఇసుకవేస్తే రాలనంత జనం! నేల ఈనినట్లు వచ్చారు. అందరూ చాలా వుద్రేకంగా వున్నారు. పార, పలుగులతో సింహద్వారాన్ని బద్దలు చేయాలని ప్రయత్నించారు. కాని నగరరక్షకులు జోక్యం కల్పించుకుని ఆపుజేశారు. లిచ్ఛవిరాజు సందేశాన్ని విని ఆ ముందు

నిల్చున్న భూ భాగంను అందరికి తెలియజేశాడు, వైశాలి లోని ఉన్నత భవనాలకేసి ద్వేషంగా చూస్తూ నగరం వెలుపలకు వెళ్ళిపోయాడు.'

'దీని వెనుక తప్పక ఆ నృసింహుని ప్రోత్సాహం వుంటుంది. స్వర్ణ సేనామాత్యులకు ఖడ్గానికి చుట్టిన ఒక ఉత్తరం వచ్చిందని మీరు వినలేదా ?' అన్నాడొక రాజపురుషుడు.

'అతడు అమాత్యుణ్ణి క్షమించడా ?'

మొదటి రాజపురుషుడు చిరునవ్వు నవ్వాడు. యౌవ్వనకాలం విశృంఖలంగా వుంటుంది. దస్యుడు ఆయన్ని క్షమించాలి అన్నాడతడు.

గాలి జోరుగా వీచసాగింది. ఆకాశంలో చెల్లా చెదురుగా వున్న మేఘాలన్నీ కూడుకుంటున్నాయి. దట్టమైన, తెల్లని మేఘాలతో ఆకాశం కప్పివేయబడింది; జోరుగా వీస్తున్న గాలి హోమగుండంలోని జ్వాలల్ని వూగించి వేస్తోంది.

అభిషేకపు తంతు ముగిసి పరిషత్ సభ్యులు వైశాలి రాజమార్గాన బయలుదేరిన సమయానికి గాలి శాంతించింది. కాని తేలికగా వానతుంపర ప్రారంభించింది. రాజపురుషుల రథాలు నెమ్మదిగా నడుస్తున్నాయి. ప్రజలు వారిపై పూల మాలలు విసరివేస్తున్నారు. పైన దట్టంగా కూడుకుంటున్న మబ్బులు ప్రజలలో నూతనోత్సాహాన్ని కల్గించాయి. వేల

కొలది వున్న ఆ రాజపురుషుల పరిషత్ నిజంగా దేవసభ వలె కన్పిస్తోంది.

'దేవసభ చూడనివారు లిచ్ఛవీల ఈ పరిషతును చూసి దానిని వూహించుకోవచ్చును' అని బుద్ధుడు చెప్పింది దీని నుద్దేశించే.

సహస్ర తూర్యనాదాలు, అసంఖ్యాక ప్రజాహర్షధ్వానాలు మేఘావృతమైన ఆకాశంలో ప్రతిధ్వనిస్తున్నాయి. క్షామపీడిత గ్రామాలనుంచి వచ్చిన హాలికులు అక్కడక్కడ ఈ దృశ్యాలను చూస్తూ నిల్చున్నారు. వైశాలి వైభవాన్ని చూసి వారికి ఆశ్చర్యంగావుంది. ఇదంతా కలగంటునట్లుంది వారికి.

# 18

ఆరోజు జరిగిన నాటకంతో సూర్యమణి, కుమారగుప్తులు మరింతగా ఒకరి నొకరు అర్థం చేసుకున్నారు. చతురుడు, అనుభవశాలియైన కుమారగుప్తునివద్ద కటువుగా మాట్లాడే సూర్యమణి తన మనోభావాన్ని దాచుకోలేక పోయాడు. ఈ అనుమానం కుమారగుప్తునికి మొదటినుంచీ వుంది. కాని, హేమాంకునియందున్న చిరాకే, అతడియందుకూడా ప్రారంభమైంది. ఒకవిధంగా అతడు హేమాంకుణ్ణి క్షమించగలుగుతాడుకూడా. అతడెంతో సాహసి, విచిత్రమైన అద్భుతవ్యక్తే, కాని ఆకర్షణీయమైన అందగాడు.

స్త్రీ అధీనుడైన ఈ యువకునియందు అతడి ద్వేషం తీవ్ర రూపం దాల్చింది. అతడిలో ప్రతీకారభావం ఉదయించింది. ఆ నాటి నాటకం వెనుక అతడి కేదో అదృశ్యశక్తి జోక్యం వున్నట్లనిపించింది. నిజంగానే ఈ యువకుడు తనకు, అంబాపాలికి మధ్య నిలుస్తున్నాడా? అయినా నిలిస్తేమాత్రం చెడే ముంది? తను మాత్రం రోజురోజుకు వైరాగ్యంవేపుకు మొగ్గటంలేదా? అంబాపాలి క్షుద్రస్నేహ బంధనాల్నుంచి వేరుపడి తానీ విశాలవిశ్వంతో ఐక్యంగావద్దా? అతడు చలించాడు. ఈ జీవిత మెంత విచిత్రమైంది? తానుమాత్రం లోపల అంబాపాలిని వదలిపోవాలని ఆలోచించటంలేదా? ఐశ్వర్యవిలాసాలు, మదిరాపానాలతో అతడు విసిగిపోయాడు. ఇవాళ తనకు, అంబాపాలికి మధ్య మరొక వ్యక్తి వచ్చేసరికి అతడిలో పోటీభావం తలెత్తింది. అతడి జీవితం చైతన్యం పొందింది. ఒకవేళ తాను వెళ్తే అంబాపాలి జీవితంలోకి మరొకరు రాగలుగుతారు!—కానీ......అతడిక్కడ ఆగి పోయాడు. చాలాసేపటివరకు అతడు ఈ 'కానీ' అనే దాని తర్వాత ఒక నిశ్చయానికి రాలేకపోయాడు. ఆ తర్వాత అతడు మళ్ళీ యోచించాడు—'ఈ పరివర్తనలో అంబాపాలి కూడా పాల్గొనాలి. ఆమెను లేపాలి. ఆమెను దిగజార్చటంలో తనకు జోక్యం వున్నప్పుడు ఆమెను లేవదీయటం కూడా తన కర్తవ్యమే. కాదు......వీల్లేదు......ఆమెను మరెవరూ ప్రేమించ వీలులేదు. అలా జరగనివ్వడు తను.

తర్కం అంత సబబుగాలేదు. హృదయాన్ని ముందుంచుకుని చేసే తర్కాలెప్పుడూ అంత సబబుగా వుండవు.

హేమాంకుడు అంబాపాలి భవనానికి అధికంగా రావటం తగ్గించాడు ; సూర్యమణి ఒక్కడే రావల్సివచ్చేది. అతడామెకు తన రచనలు వినిపించేవాడు, ఎన్నోవిధాల సంభాషించేవాడు. అంబాపాలి కూడా కవయిత్రి. అంచేత బహుశా, అజ్ఞాతరూపంలో ఆమె ఈ యువకునియందు ఎక్కువ అనురాగం కల్గివుండేది. అంబాపాలిలోని ఈ మార్పును కుమారగుప్తుడు జాగ్రత్తగా పరిశీలించాడు. అతడు మరోకసారి రాజగృహం వెళ్ళాలనే విషయాన్ని ప్రస్తావించాడు. కాని ఈ సారి కూడా అంబాపాలి ఆటంకపర్చింది. ఇదెలాంటి ప్రేమ! కుమారగుప్తుణ్ణి వదలటం ఆమెకు ఇష్టం లేదు. అయినా మరొక యువకుడికేసి మొగ్గుచూపుతూనూ వుంది.

బలులు ఆగిపోయింది వాస్తవమే అయినా బలుల సమస్యతో ఉత్పన్నమైన ఉద్రేకాన్ని వైశాలిలోని వినోద స్వభావం మరోవిధంగా నడిపింది. ఈ ఉద్రేకపు నూత్న స్వరూపం ఏమిటి? లోతుగా, విశాలంగా ఒక కందకం త్రవ్వేవారు. నూతులవలె చాలా లోతు త్రవ్వేవారు. దాని పైన ప్రేక్షకులు కూర్చునే ఏర్పాట్లుండేవి. మధ్య మధ్య ఈ క్రీడల్ని ఏర్పాటుచేసేవారు. దున్నలు, గొర్రెపొట్టేళ్ళు, ఇతర పశువుల్ని వదలేవారు. వినోదప్రియులైన వైశాలి ప్రజలు ఆ నిస్సహాయ పశువుల యుద్ధాన్ని చూసేవారు. వాటిని ఉద్రేకపర్చటానికి మద్యం త్రాగించేవారు. వాటి ఎముకలన్నీ

విరిగి రక్తప్రవాహం కట్టినప్పుడు జనులు హర్షధ్వానాలు చేసేవారు ; ఈ వినోదక్రీడను సమాజం అనేవారు.

ఇటువంటి సమాజం సమయములందు ఒక పర్యాయం సూర్యమణి అంబాపాలితో జరిపిన వ్యవహారం కుమారగుప్తునికి చాలా చెడుగా తోచింది.

కుమారగుప్తుడు, అంబాపాలి ఇద్దరూ కలిసే క్రీడా స్థలానికి చేరుకున్నారు. అక్కడ వారికి సూర్యమణి కలిశాడు. వారు ఆటసమయంలో ఒకేచోట కూర్చున్నారు.

రెండుదున్నల్ని వదిలారు. మద్యపానంతో వాటికళ్ళు చింతనిప్పుల్లా వున్నాయి. అవి తమ కొమ్ముల్ని నేలకంటా వంచి క్రోధోన్మత్తగజములవలె ముందుకురికాయి. జనం కరతాళధ్వనులు చేశారు. వాటితలలు ఢీకొన్నప్పుడు కల్గిన ధ్వని గాలిలో ప్రతిధ్వనించింది. ప్రేక్షకుల్లో కోలాహలం చెలరేగింది. హటాత్తుగా ఒక దున్న నేలపై పడిపోయింది...... అంబాపాలి కంపిస్తూవుండడం కుమారగుప్తుడు గమనించాడు. ఆమె భయపడి సూర్యమణిచెయ్యి పట్టుకుంది. అతడు అటునుంచి తన దృష్టిని మళ్ళించాడు. పడిపోయిన దున్న తిరిగి లేచింది. అది తన విరోధిపై బలంగా దెబ్బతీసింది. ఈ పర్యాయం అది తన శక్తినంతటినీ కూడదీసుకుని తన విరోధిని నెట్టుకుంటూ కందకం చివరివరకు నెట్టుకుపోయింది. కుమారగుప్తుడు దీర్ఘంగా నిట్టూర్చి అంబాపాలికేసి చూశాడు. సూర్యమణి ఆమెచేతిని నిమురుతున్నాడు......సూర్యమణి అతడి మొఖంలోకి చూశాడు. అతడు భయపడ్డాడు. కుమార

గుప్తుడు అటునుంచి దృష్టిమళ్ళించి తిరిగి యుద్ధం చూడ సాగాడు. యుద్ధం చాలాసేపు జరిగింది. కాని కుమారగుప్తునికి అక్కడ ఏమీ పాలుపోలేదు. అతడిమనస్సు చికాకుగావుంది.

అంబాపాలివెంట అతడు తిరిగి బయలుదేరినప్పుడు అతడు చాలా గంభీరంగా వున్నాడు.

'ఏం, మౌనంగా వున్నావేం కుమారగుప్తా ?' అని అడిగింది అంబాపాలి.

కుమారగుప్తుడు ఆమెకేసి దృష్టినిలిపి చూశాడు. 'చక్రంపై ఎక్కటం, దిగటం జీవితనియమం, అంబాపాలీ !' అన్నాడతడు. అత డీ వాక్యంలోని సార్థక్యాన్ని, దానిలో దాగివున్న వ్యంగ్యాన్ని ఆలోచించుకుని నవ్వుకున్నాడు.

'నీ భావమేమిటో నా కర్థంకాలేదు' అంది అంబాపాలి నెమ్మదిగా.

'నువ్వే తెలుసుకుంటావు.'

తిరిగి వారిద్దరూ తమ గదిలోకి వెళ్ళారు. జీవితంలోకి ఎవరైనా ఎలా ప్రవహిస్తారో, ఎలా నిష్క్రమిస్తారో మరి ! కాని ఈ ప్రవేశ నిష్క్రమణలు మాత్రం సత్యం. అయితే కుమారగుప్తుడు అంబాపాలీ జీవితాన్నుంచి నిష్క్రమిస్తున్నాడా !

ఇది చాలా కఠినమైన ప్రశ్న ?

కాని నెమ్మదినెమ్మదిగా కోమలమైన కవి సూర్యమణి కఠోరమయాడు. చివరి కొకనాడు కుమారగుప్తుని ఎదుట ఛీ అంటే ఛీ అనడం జరిగింది.

'కుమారగుప్తా, వైశాలి రాజకీయాలు నీ కేమీ తెలియవు. నువ్విలా అనటం మంచిది కాదు. ప్రజాతంత్రం దుర్బలమైనదని నువ్వనుకుంటున్నావా?...ఏం...' అన్నాడు సూర్యమణి.

'రాజగృహంలోని నా అనుభవాన్నిబట్టి వైశాలిప్రజాతంత్ర సైన్యం అజాతశత్రుని విశాల సేనావాహిని ఎదుట నిలబడజాలదనే నే ననేది' అన్నాడు కుమారగుప్తుడు.

'వైశాలిలోని వినోద విలాసాలజోలికి పోకు కుమారగుప్తా! జీవితం ఉన్నచోట స్వప్నాలుంటాయి, అసంతృప్తి వుంటుంది, ప్రేమా వుంటుంది. ఇదే సమయం వచ్చినప్పుడు వైశాలికి చేయూతగా నిలుస్తుంది' అన్నాడు యువకవి.

కుమారగుప్తుడు నవ్వాడు.

అతడి ఈ నవ్వు ఎదుటిమనిషికి గుచ్చుకున్నట్లయింది. సూర్యమణి ముఖంచిట్లించి 'ఇతరుల్ని చులకన చేసేహక్కు నీకు లేదు. నేను చెప్పిం దేమిటి అనేనా నువ్వు నవ్వేది?' అన్నాడు.

కుమారగుప్తుడు అదేవిధంగా నవ్వుతూనే వున్నాడు. అతడు సూర్యమణిని ఏమాత్రం లెక్కచేయనట్లు, తుచ్ఛంగా భావించినటూ వుంది.

సూర్యమణి ఉత్తేజితు డయాడు. 'నువ్వు వైశాలికి అతిథి వని తెలియదా! రాజగృహ పౌరుడవు' అన్నాడు.

'రాజగృహ పౌరుడా!' అని కుమారగుప్తుడు అట్టహాసం చేశాడు.

సూర్యమణి కోపం అగ్నిలో ఆజ్యంపోసినట్లు ప్రజ్వరిల్లింది.

'నేను రాజగృహ సైన్యాధ్యక్షుని కుమారుడను, వైశాలి పరిషత్తులోని రాజపురుషుడను' అని కొంచెం వ్యంగ్యంగా అన్నాడు కుమారగుప్తుడు _ 'తానెక్కడుందో, ఏదిశకు ప్రవహిస్తుందో, అతిత్వరలో ఏ బండకు కొట్టుకోనుందో కూడా మీ పరిషత్తుకు తెలియదు. ఇందుకు నువ్వేమంటావు ?'

ఈ విధంగానే నెమ్మది నెమ్మదిగా మాటకు మాట పెరిగిపోయింది. దానితో సూర్యమణి లేచి నిల్చున్నాడు. క్రోధంతో అతడిముఖం ఎర్రబడింది. 'కుమారగుప్తా ! వైశాలి పరిషత్తును అవమానపర్చుటకు సాహసిస్తున్నావు నువ్వు; అదికూడా వైశాలినేలపై వుండే ! నువ్వు తప్పక అజాతశత్రునివల్ల ప్రేరితుడవై వుంటావు. నేను నిన్ను ప్రజాతంత్రబందీగా భావిస్తున్నాను' అన్నాడు సూర్యమణి ఉచ్చైస్వరంతో.

కుమారగుప్తుడుకూడా లేచినిల్చున్నాడు. 'మిత్రమా! నువ్వనేది వాస్తవమే. కాని నువ్వు ఒక్కడివే కుమారగుప్తుణ్ణి బంధిస్తావా?' అన్నాడు అని అతడు చాలా ఉత్తేజితుడై 'కుమారగుప్తుడు వైశాలిపౌరుడు నిజంగానే కాడు, కాని అతడు బందీకాడు _ అతడు తనంత తానుగా వైశాలిని వదలి వెళ్ళవలసిందేకాని. కత్తి దూస్తావా ?' అన్నాడు నొక్కి.

అతడు గదిలోకివెళ్ళి రెండుఖడ్గాలు తెచ్చాడు. సూర్యమణికేసి ఒక ఖడ్గాన్ని అందిస్తూ 'వైశాలిరాజపురుషుడు ఈ కత్తిపదును చూస్తాడా?' అన్నాడు.

సూర్యమణి మౌనంగా ఖడ్గాన్నందుకున్నాడు. అతడు నిజంగా తనతో యుద్ధం చేయదలుస్తున్నాడా ? అని అతడికేసి పరిశీలనగా చూస్తున్నాడు సూర్యమణి.

కుమారగుప్తుడు పరిహాసమాడుతున్నాడా ?

కుమారగుప్తుడు సూటిగా అతడికేసిచూస్తూ 'ఇవాళే కాదు, ఎప్పుడైనా సరే! ఏరోజునైనా, ఎక్కడైనా సరే!' అన్నాడు కుమారగుప్తుడు. అతడికంఠస్వరం గంభీరంగానూ, కఠోరంగానూ విన్పించింది. 'నువ్వు నన్నవమానించావు. నీకు వైశాలియందు అంతగర్వమేవుంటే నేను నిన్ను రాజగృహ పౌరునిగా యుద్ధానికి ఆహ్వానిస్తున్నాను. ఎప్పుడైనా, ఎక్కడైనా సరే!'

ఇంతలో అంబాపాలి వచ్చింది. ఆమె అతడికేసి చూసి 'ఇదేమిటి? మీరు పోట్లాడుకుంటున్నారా ఏమిటి!' అని అడిగింది.

కుమారగుప్తుడు కూర్చున్నాడు. అతడు ఆమెకేసి చూసి దరహాసంచేశాడు.

అంబాపాలి సూర్యమణికేసి చూసింది. అతడు వుద్రేక పడుతున్నాడు. అతడు తన ఖడ్గాన్ని సమీపమందు ఆనించాడు. 'కుమారగుప్తుడు నన్ను యుద్ధానికి ఆహ్వానిస్తున్నాడు' అన్నాడు. అతడి కంఠస్వరం శుష్కంగా విన్పించింది.

ఒకవేళ కుమారగుప్తుడు పరిహాస మాడాడేమోనని అంబాపాలి అతడికేసి చూసింది. ముగ్గురూ మౌనం వహించారు. అంబాపాలి, సూర్యమణికూడా కూర్చున్నారు.

'నేను నగర విపణివీధికి వెళ్ళాను. స్వర్ణభూమి, గాలేరులనుండి కొందరు వ్యాపారులు వచ్చారు. భవనాలంకారం నిమిత్తం నేను వారివద్ద చాలా వస్తువులు ఎంచుకున్నాను. కుమారగుప్తా! నవ్వావా నువ్వు?' అంది అంబాపాలి.

'వైశాలినగరంలో ఇక రాజగృహపౌరుడు అడుగు పెట్టడు. నువ్వు సూర్యమణిని తీసుకువెళ్ళవచ్చు' అన్నాడు కుమారగుప్తుడు గంభీరంగా.

అంబాపాలి సూర్యమణి కేసి చూసింది. అతడిముఖం పసి బాలురముఖంవలె అమాయకంగా మార్పు జెందింది. ఆమెకు చాలా జాలివేసింది.

'ఇంతకూ మీ రిద్దరూ ఏ విషయాన్ని గురించి వివాదపడ్డారు? మీరు స్నేహంగా వుండలేరా?' అంది ఆమె. అని ఆమె చిరునవ్వు చిందించింది. ఆ చిరునవ్వు కుమారగుప్తునకు చురుక్కుమంది. 'పురుషుని విషయం ఒకటే ఒకటి—అదే స్త్రీ, యువతి, బంగారుతొడుగు వేసిన విషపు లత' అన్నాడు కుమారగుప్తుడు. అతడూ మందహాసం చేశాడు.

'వైశాలి పరిషత్తును అవమానించటం నేను సహించను' అన్నాడు సూర్యమణి. కుమారగుప్తుడు అర్ధనిమీలితనేత్రుడై ఏదో ఆలోచిస్తున్నసమయంలో సూర్యమణి ఈ మాట అని అతడికేసి చూశాడు.

నెమ్మదిగా కళ్ళు తెరచి 'మీ సూర్యమణి నేను అజాత శత్రువు గూఢచారినని అనుమానించాను. అంబికా! నేను శీఘ్రంగా మరోచోటు వెతుక్కోవాలి. వైశాలి రాజపురుషులు అనుమానం సహించలేకపోవచ్చు' అన్నాడు కుమారగుప్తుడు.

అతడు ఆ మాట అని చిరునవ్వునవ్వి మరల అంతలోనే గాంభీర్యం వహించి 'మనం ఒక విచిత్రకాలంలో పయనిస్తున్నాం. రాగవిరాగాలు, విలాససాధనలు, త్యాగపురుషార్థాలు—ఏ లక్ష్యం సత్యం? ఈ యుగానికి ఎక్కువ ఉపయుక్తమైనదేది? ప్రతికాలంలోనూ ఎదురయ్యే ప్రశ్న ఇదే—మానవునికి అన్నింటికంటె ఎక్కువ సుఖం ఎలా లభిస్తుంది? ఆ యుగపరిస్థితి ననుసరించి సుఖశాంతులెలా లభిస్తాయి? మీ వైశాలి సంస్కారాన్నెన్నుకుంది. రాజగృహం సాధనను, కష్టాన్ని ఎన్నుకుంది' అని అతడు సూర్యమణికేసి తిరిగి 'నా ఆహ్వానం నీకు అంగీకృతమేనా?' అని అడిగాడు. అంబాపాలి అతడికేసి తీక్షణంగా చూసింది. భీతిజెందిన సూర్యమణి ముఖాన్ని గమనించింది. 'కుమారగుప్తా! ఆ విషయాన్నొదిలి వెయ్యి' అని ఆమె అతడి భుజంమీద చెయ్యివేసి 'మరీ వంగలేనంత కఠోరంగా వుంచకూడదు, ఏ సిద్ధాంతాన్నీ. జీవితంలో అతికోమలం కూడా వుంది: రక్తపాతం, యుద్ధం లేకుండానే మనిషి తన ప్రతిష్ఠను నిలబెట్టుకోవచ్చు' అంది.

'అంబాపాలీ, నువ్వాయన్ని వెనకేసుకొస్తున్నావు. బాగానేవుంది. శుభం!' కుమారగుప్తుని పెదవులపై కుటిలమైన నవ్వు నర్తించింది.

ఆ రోజంతా అతడు ఉద్రేకంగానే వున్నాడు. ఎన్ని విధాల ప్రయత్నించినా అంబాపాలి అతణ్ణి వినోదాలకేసి ఆకర్షించలేకపోయింది......అత డీ బంగారు సంకెళ్ళనుంచి బయటపడాలి.........ఈ వాతావరణాన్ని భరించలే డతడు. సాయంత్రం అంబాపాలి వచ్చి 'నే నొకచోటుకు వెళ్ళాలి, ఆహ్వానించారు' అని చెప్పింది.

కుమారగుప్తుడు ఆమెకేసి చూశాడు. ఆమె పరధ్యానంగా వుంది...'వెళ్ళొచ్చు. నువ్వు తిరిగి వచ్చేవరకు వేచి వుంటాను' అన్నాడతడు. నల్దిశల అప్పుడప్పుడే చీకట్లు ఆవరిస్తున్నాయి. భవనంలో కూర్చుని కూర్చుని కుమారగుప్తునికి విసుగేసింది. అతడు చాలా విచారంగా వున్నాడు. ఏమిటి కర్తవ్యం? ఈ విచారాన్ని మర్చిపోవడానికి అంబాపాలి పానగృహంలోకి వెళ్ళాడు. కొంచెం మద్యం సేవించాడు. ఇంతలో ఏదో పనివుండి చంద్రసేన అక్కడికి వచ్చింది. కుమారగుప్తుణ్ణి అక్కడచూసి నమస్కరించింది. ఆమె వెళ్ళిపోవడానికి వెనక్కి తిరిగేసరికి ఏమి ఆలోచించాడో ఏమో 'చంద్రసేనా!' అని పిలిచాడు కుమారగుప్తుడు.

చంద్రసేన నిల్చుండిపోయింది.

'మీ యజమానురాలు తిరిగి రాలేదా?'

'అంబాపాలిదేవిగారు ఆలస్యంగా వస్తామని చెప్పి వెళ్ళారు. మీరు సురాపానం చేస్తారా?'

ఒక క్షణం మౌనం వహించి 'కావాలి చంద్రసేనా, నేను చాలా అలసిపోయాను' అన్నాడు కుమారగుప్తుడు.

చంద్రసేన పాత్రనునింపి ఇచ్చింది. కుమారగుప్తుడు ఆమెను పరిశీలనగా చూస్తూ పానం చేస్తున్నాడు. ఆ మసక వెలుగులో చంద్రసేన శరీరవర్ణం చాలా ఆకర్షణీయంగా వుంది. అంతకుముందునుంచి అతడి మనస్సులో మెదులుతూ వున్న చంద్రసేన మేల్కొంది.

'పానంచెయ్యి చంద్రసేనా! నువ్వు సురసేవించ వెందు చేత ?' చంద్రసేన చిన్నగా నవ్వింది. కుమారగుప్తుడు తన పాత్రను ఆమె అధరములకు అందించాడు. 'చంద్రసేనా ! అంతా క్షణభంగురం. తనేమి కోరుతుందో కూడా తెలియదు మానవ మనస్సుకు. అది ఒక ఎండమావిని చూసి భ్రమించి సంతసిస్తుంది. ఆనందా న్ననుభవించు, సురాపానం చెయ్యి చంద్రసేనా !' అన్నా డతడు.

భీతిగొన్న నేత్రాలతో చంద్రసేన అతడికేసి చూసింది. ఆమె ఏమీ వ్యతిరేకత చూపలేదు. పాత్ర పెదవులవద్దకు వెళ్ళింది. కుమారగుప్తునిచేతితో ఆమె సురాపానం చేసింది.

సరిగ్గా అదేసమయానికి అంబాపాలి వచ్చింది.

ఆమె వచ్చి చంద్రసేన వెనుక నిలబడింది. ఆమె అట్టహాసం చేసింది.........

'కుమారగుప్తా ! నా చోటును చంద్రసేన ఆక్రమించిందా ?' అని హేళనచేసింది అంబాపాలి. 'ఇవాళ నేను నీకు ఆనందం కల్గించలేకపోయాను' అని చిరునవ్వు నవ్వింది.

చంద్రసేన, కుమారగుప్తులు మౌనం వహించారు. అంబాపాలి ఆ మాట అని దుస్తులు మార్చుకుంటానికి వెళ్ళిపోయింది.

# 19

బయట ఉద్యానంలో ఎంతోసేపుగా కోయిల కూస్తోంది. అంబాపాలి గదికిటికీ ఒకటి ఉద్యానంవేపుంది. అంబాపాలి మేల్కొని వింటూ కూర్చుంది.

ఆమెకు చంద్రసేనపై కోపంగావుంది. ఆమె తనకు, కుమారగుప్తునికి మధ్య కెందుకొచ్చింది? ఈ కుమారగుప్తుడే వైరాగ్యసాధనలవేపు మొగ్గుచూపుతూ వుంది......ఆమె చిరునవ్వు నవ్వుకుంది.

అదే సమయాన చంద్రసేన ప్రవేశించి 'అతిథి గృహంలో మహానగర రక్షకులు వేచివున్నారు' అని తెలియ జేసింది.

అంబాపాలికి చాలా ఆశ్చర్యం కలిగింది. ఆమె లేచి అతిథిగృహంలోకి వెళ్ళింది. నగరమహారక్షకుడు ఆమెకు నమస్కరించి 'దేవీ! పరిషత్తులోని రాజపురుషులు రాజగృహ పౌరుల్ని అనుమానిస్తున్నారు. వాళ్ళను రాజగృహంనుంచి పంపించివేసే ఏర్పాట్లు చేస్తున్నారు' అని చెప్పాడు.

అంబాపాలి గాంభీర్యం వహించింది. 'మీరు చెప్పేది ఆర్య కుమారగుప్తులవారిని గురించేనా?' అని అడిగి మంద హాసం చేసింది. 'మహారక్షకా! అంబాపాలికూడా కుమార గుప్తునితో వైశాలిని వదలి వెళ్తుందని పరిషత్తుకు తెలియ జెయ్యి' అని అంది.

మహారక్షకుడు స్తబ్ధుడై నిరుత్తరంగా నిలబడ్డాడు. అంబాపాలి తిరిగి దృఢనిశ్చయంతో 'వైశాలి అంబాపాలి

విలువను తెలుసుకోవటంలేదు. నువ్వాతణ్ణి నగరం వదల వల్సిందని చెప్తున్నావా ?' అంది.

'దేవీ, ఆర్య కుమారగుప్తులు ఒక వైశాలి పౌరునిపై దెబ్బతీశారు. ప్రజారక్షణనుగురించి మీరాలోచించరా ?' అన్నాడు మహారక్షకుడు. అంబాపాలి ఆవేశపడింది. 'అయితే సరే, మీ వైశాలిపౌరులు నాభవనంలో జొరబడి విద్రోహం చేయాలి. విప్లవం రెచ్చగొట్టాలి. బహుమూల్యమయిన సామాగ్రులన్నీ ధ్వంసం చేయవచ్చు. కౌమపీడిత ప్రజల చర్యలకు అంబాపాలి బాధ్యురాలా ? అంబాపాలి వైశాలిలో జన్మించనప్పటికీ ఆమె వైశాలినే తన మాతృభూమిగా ఎంచుకుంది. ఇప్పుడిహ ఆమె వైశాలి పౌరురాలే. ఒక వైశాలి వ్యక్తిని దేశంవదలి పొమ్మని ఆదేశిస్తున్నావు. ఇది ప్రజాతంత్ర సిద్ధాంతాలకు అనుకూలమైనదేనా !'

మహారక్షకుడు ఆలోచనలో పడ్డాడు. అత డేమీరా బదులు పలుకలేదు. అంబాపాలికూడా యోచించసాగింది.

'మేము వైశాలి వదలి వెళ్తాం. నువ్వెళ్ళి రాజపురుషు లకు నా సందేశా న్నెరిగించవచ్చు' అంది అంబాపాలి. అని వెనుదిరిగి తనగదిలోకి వెళ్ళిపోయింది.

సమర్థుడు వ్రాసిన తనచిత్తరువుముందుకూర్చుని ఆమె ఆలోచించసాగింది—'ఇది సంభవమేనా ? వైశాలియువకులు తనను వదలగలరా ? ఇది రాజపురుషుల దుర్మార్గంమాత్రమే. ఇందు తప్పక సూర్యమణి జోక్యం వుండి వుంటుంది. అతడి

తోనే ద్వంద్వయుద్ధానికి కుమారగుప్తుడు నిశ్చయించుకున్నది.' ఆమెకు సూర్యమణియందు ద్వేషంకలిగింది.

తర్వాత ఆమెలేచి కుమారగుప్తుని శయనాగారానికి వెళ్ళింది. కాని అత డక్కడ లేడు. బహుశా అతడు ఉద్యానంలోకి వెళ్ళివుంటాడా? ఆమె వెతుక్కుంటూ అక్కడికి కూడా వెళ్ళింది. కుమారగుప్తుడు అక్కడకూడా లేడు. అయితే అతడు మరెక్కడికి వెళ్ళివుంటాడు!

ఆకస్మికంగా ఆమె కొక సత్యం బోధపడింది. ఆమె స్తబ్ధురాలై నిల్చుండిపోయింది. అతడు తనను వదలి వెళ్ళాడా! అలా జరుగుతుందా? అయ్యో, స్త్రీ ప్రేమలిప్సా! ఆమె అతడి కోసం భవనమంతా గాలించింది. అత డెక్కడా లేడు. నిజంగానే కుమారగుప్తుడు అంబాపాలి భవనాన్ని వదలి వెళ్ళాడు. అయితే ఎప్పుడు? ఇంతకుముందే తను అతడు వైరాగ్య భోగాల్లో ఇరుక్కున్నాడని తలచి కోపంగా, దానితోపాటు వ్యంగ్యంగా తిరస్కరించింది.

అయినా మానవహృదయ లోతుల్ని ఎవరు అర్థం చేసుకోగలిగా రింతవరకు? ఆ హృదయంలోని ప్రయత్నాలు, నిత్యవ్యవహారాలకు అతీతంగా లోలోపల ఒక ప్రవాహం ప్రవహిస్తూ వుంటుంది; దానిలోని అలలు క్షణ క్షణం నూతన ఆసక్తిని ప్రదర్శిస్తాయి; పైకి వాటి చిహ్నాలేవీ బహిర్గతంకావు. ఇహ లోనజరిగేది ఆభగవంతునికే తెలియాలి.

ఆమె పట్టణంలో అతణ్ణి వెదకాలా? తప్పక అతడు రాజగృహంకేసే వెళ్ళివుంటాడా? తను అతడికోసం అటు

మనుష్యుల్ని పంపాలా ? 'లేదు! అంతా వ్యర్థం!'...అనుకుంది గంభీరంగా అంబాపాలి. 'తా నేమీ చేయదు.'

నెమ్మది నెమ్మదిగా ఆమె వైశాలి వినోద విలాసాల్లో పాల్గొనటం వర్జించివేసింది. ఒకవిధంగా ఆమె ఏకాంతలోనే వుంటోందని చెప్పాలి. ఎప్పుడైనా ఏ సూర్యమణో, లేక హేమాంకుడో ఆమెవద్దకు రావాల్సిందేకాని ఆమె బయటికెచ్చుటికి వెళ్ళటమేలేదు. ఆమె ధర్మగ్రంథాలను అధ్యయనం చేయ నారంభించింది. దానివల్ల సమయమూ గడిచిపోయేది; కొంత శాంతికూడా లభించేది. కుమారగుప్తుడు ఈ విధంగా మాయమనటంతో ఆమె ఆత్మలో (హృదయం అనుకోండి) ఒక మహాశూన్యం ఏర్పడింది. ఆమె ఆ ఖాళీని శుష్కజ్ఞానం తోనో, తర్కంతో కొనుక్కున్న సంతృప్తితోనో భర్తీ చేసుకోవాలని తలచేది. కాని అది అసంభవం. మధ్యమధ్య ఆమె చాలా వ్యాకులపడేది. ఆ భవనం, తన ఐశ్వర్యం, రాను రాను తనంటే తనకే అసహ్యం వేయసాగింది. ఆమెస్వభావం రానురాను వైరాగ్యంవేపుకు మొగ్గసాగింది.

వైశాలిలో ఇప్పుడిహ చాలా ప్రశాంతంగా వుంది. వర్షాలు కురిశాయి. ప్రజలకు అన్నం లభించింది; నగర ధాన్యాగారం మళ్ళీ ధాన్యంతో సమృద్ధిగా వుంది.

ఒకనాడు అంబాపాలికి ఆచార్య ప్రబుద్ధకేతుని జాబు అందింది. అందులో ఆయన కుమారగుప్తుడు బౌద్ధమత దీక్షగైకొనటాన్ని గురించి తెలియజేశాడు. అందులో ఆయనీ విధంగా వ్రాశాడు—'అంబాపాలీ! నా లెక్కప్రకారం

నువ్వు ప్రధానభిక్షుకురాల వవుతావు. ఈ మహత్తరమైన ధర్మపరివర్తనలో నీకార్యం అపూర్వమైంది. భోగంలో వైరాగ్యంవేపుకు పురోగమించటం మానవజీవితంలో అన్నింటి కంటే మించిన గొప్పసత్యం. అర్థంచేసుకున్నవారి కిది తెలుస్తుంది. ఆసమయం రాగానే కుమారగుప్తు డిది తెలుసుకున్నాడు. ఆసమయం నీకూ రానున్నది.'

ఈ వృద్ధ సన్యాసి మాటల్ని లెక్కల్ని అసత్యం చేయాలని అంబాపాలి నిశ్చయించుకుంది. తను ఆచార్యుణ్ణి కలుసుకోనదు, కుమారగుప్తుణ్ణీ కలుసుకోదు.

ఎన్నో రాత్రింబవళ్ళు, వారాలు, పక్షాలు, మాసాలు గడిచిపోయాయి. బుద్ధుని మూడు సూత్రాలతో వైశాలి భూమి ప్రతిధ్వనిస్తోంది. 'బుద్ధం శరణం గచ్ఛామి! ధర్మం శరణం గచ్ఛామి! సంఘం శరణం గచ్ఛామి!' ఈ ధార్మిక వాతావరణం ప్రచండ ఝంఝూటంవలె తననే చుట్టుముట్టి తీవ్రమవుతున్నట్లనిపించింది అంబాపాలికి. ఆమె ఇంకా ఎక్కువదృఢంగా దానిని ఎదుర్కొసాగింది. కాని రోజులు గడచినకొద్దీ కుమారగుప్తుణ్ణి కలుసుకోవాలనే కాంక్ష ప్రబలం కాజొచ్చింది. ఆవిషయంలో తర్కంకూడా ఆమెలోవున్న తీవ్ర వ్యతిరేకతను తగ్గించివేసింది.

తాను కుమారగుప్తుణ్ణి కలుసుకోవాలని, వెంట సూర్య మణిని తీసుకువెళ్ళాలని ఆమె నిశ్చయించుకుంది.

'నువ్వొకసారి నావెంట వైశాలిసంఘారామానికి రావల్సి వుంటుంది. నేను ఆచార్య ప్రబుద్ధకేతుణ్ణి కలుసుకోవాలి' అని చెప్పింది సూర్యమణితో.

సూర్యమణి ఆశ్చర్యంగా ఆమెకేసి చూశాడు.

అంబాపాలి మందహాసంచేసి 'ఇందులో ఆశ్చర్య పడాల్సిందేముంది? నేను ఆచార్యులవారితో ఒకవిషయం సంప్రదించాలి' అని అంది.

అంబాపాలి రథం బౌద్ధ సంఘారామపుద్వారంచెంతకు వెళ్ళేసరికి ఆచార్యులవారు నగరంలోకి వెళ్ళారని, మధ్యాహ్నాంవరకు వేచివుండాలని తెలియవచ్చింది ఆమెకు. ఆమె సూర్యమణి వెంటరాగా లోనికి వెళ్ళింది. ఆమె సూర్యమణి బాహువులపై ఆనుకుని నడుస్తోంది.

సంఘపు ప్రధానభవనద్వారమందు కుమారగుప్తుడు భిక్షువేషంలో నిలబడి చిరునవ్వొలికిస్తున్నాడు. ఈ మార్పును గురించి సూర్యమణి కేమీ తెలియదు. అతడి హృదయాని కేదో దెబ్బతగిలింది. అంబాపాలి ఆరామానికెందుకొచ్చిందో తన ఆలోచన ననుసరించి నిర్ణయించుకున్నాడు. అంబాపాలి ఒక్కక్షణంవరకు తనివిదీరా కుమారగుప్తుణ్ణి చూసింది. అతడా క్రొత్తవేషంలో ఎంతో అందంగా కన్పిస్తున్నాడు. తర్వాత ఆమె కొంచెం కుటిల దరహాసంతో సూర్యమణి భుజాలపై మరికొంచెం ఆనుకుంది.

'ఆచార్యులు భవనంలో లేరు. నేను అంబాపాలిదేవిని సంఘానికి ఆహ్వానిస్తున్నాను' అన్నాడు కుమారగుప్తుడు,

'అంబాపాలి సంఘంలో దీక్షపొందటానికి రాలేదు' అంది అంబాపాలి చిరునవ్వుతో.

'కాని శుభలక్షణం!' అని కుమారగుప్తుడు పరిహాస మాడాడు. అంబాపాలి బదులు పలుకలేదు. ఆమె కుమార గుప్తుని ముఖంకేసి నిశితంగా చూస్తోంది. కుమారగుప్త సూర్యమణులుకూడా మౌనం వహించారు.

కుమారగుప్తుడే మౌనభంగంచేస్తూ 'నా జీవితంలో ఇదొక మహత్తరావకాశం వచ్చింది అంబాపాలీ! నాకీ ఆశ్రమంలో శాంతి లభించిం దనే నేను భావిస్తున్నాను' అన్నాడు.

అంబాపాలి ఆతడిమాటకు అడ్డువస్తూ 'శాంతి అనేది భ్రష్టుపట్టిన భ్రాంహ మాత్రమే. బ్రహ్మాండంలో ఆవర్తన — వివర్తనలు, ఉదయాస్తాలు, నాశనము, సంఘర్షణ సాగుతూనే వుంటాయి. పిండోత్పత్తి జరుగుతుంది, విచ్ఛిన్న మవుతుంది. ఈసృష్టి ఒక భయంకరసంఘర్షణతో నిండిన వాతావరణంలో పడి తిరుగుతోంది. నేనొక భయంకర ఉత్పాతాన్ని చూస్తూ వున్నాను' అని ఆమె సూర్యమణికేసి చూస్తూ 'ప్రేమంటే ఏమిటి? సంఘర్షణ! దీనిలో తీవ్రమైన పిపాస వుంటుంది, జ్వాల వుంటుంది. కుమారగుప్తా! ప్రతిమంటలోను జ్వాల లుంటాయి. కాని వెలుగుకూడా పొందాలంటే జ్వాలనుకూడా సహించాల్సిందే!' అంది.

'కాని జ్వాలను పట్టుకునే కూర్చుంటే, లేక దానినే సత్యమని భావించుకూర్చుంటే వెలుగువైపుకు వున్న ఆకర్షణ తగ్గిపోతుంది. దహించుకుపోవటమే జీవితం కాదు'

'దహించుకుపోవటమే జీవితం' అంది అంబాపాలి కొంచెం ఉద్రేకంగా. 'నిన్నటివరకు నేను నిన్ను ప్రేమించాను. ఇవ్వాళ నేను సూర్యమణిని ప్రేమిస్తున్నాను. జీవితం దహనం కాగోరుతుంది. శాంతికి మరోపేరే మరణం. నాకు శాంతి అవసరంలేదు' అని ఆమె చిరునవ్వుతో సూర్యమణి కేసి చూసింది.

కుమారగుప్తుని ఉత్సాహం చల్లబడిపోయింది అతడి హృదయంలో ఏదో బాధ కల్గింది. 'నువ్వు సూర్యమణిద్వారా వెలుగు పొందుతున్నందుకు నాకు చాలాసంతోషం అన్నాడతడు.

'మరి జీవితంకూడా' అంది అంబాపాలి గంభీరంగా. అని సూర్యమణి చెయ్యి నొక్కింది.

అంబాపాలిదేవి వేచివుండాల్సి వచ్చింది' అంటూ ఆచార్యులు ప్రవేశించారు.

అందరూ లేచి ఆయనకు నమస్కరించారు. అందరూ తిరిగి కూర్చున్న తరువాత 'నీకు నా జాబు అందిందా ?' అన్నారు ఆచార్యులు.

'నేను దానిని చదివాను. నేనిప్పుడు కుమారగుప్తునితో ఆ విషయాన్నిగురించే మాట్లాడుతున్నాను. సంఘర్షణలు, ఉత్సాహోద్రేకాలనుంచి విముక్తిపొందటమే జీవిత ధ్యేయమా ?' అని అడిగింది అంబాపాలి.

'సంఘర్షణ అని నువ్వంటున్న దేది ? వైరాగ్యంతో కూడిన జీవితం సంఘర్షణలజీవితంకాదా ? ఉత్తేమము, జాగ్రతము, ప్రాప్తము, వరాన్నబోధికము. బుద్ధుని ధర్మము కార్య

శీలమైనది. అది ఎవర్నీ సోమరులుగా చేయదు. తథాగతుని జీవితాన్నే ఒకసారి పరికించిచూడు — ఆయన విజయం పొంద టానికిగల రహస్యమేదో నీకు గ్రాహ్యమవుతుంది. సంఘర్షణ లోనే జీవితంవుంది. అయితే ఏది సంఘర్షణ? ఆత్మసంఘర్షణ సంఘర్షణకాదా? ఆత్మోన్నతి సాధించటంలో వివిధ తత్వా లతో సంఘర్షించవలసిరావటంలేదా? సంఘర్షణ సత్యమే తప్పకుండా, కాని అది నిరంతరం ఎక్కువ ఉన్నతస్థాయిలో వుండాలి. రాగ విరాగాలనేవి రెండూ ఇంత విభిన్నప్రకృతులు కాదు. విరాగికూడా భోగిఅవుతాడు. కాని అతడి అనురాగం ఏకైకమనే సంకుచితంనుంచి బయటపడి విశాలమైన అనం తంలో లీనమౌతుంది' అని చెప్పాడు ఆచార్యులు.

అంబాపాలి మౌనంగా వింటోంది. ఆచార్యులు మరల చెప్ప నారంభించారు — 'నువ్వు మా ధర్మానుష్ఠానంలోకి రావాలి; బుద్ధుని సందేశం ప్రతిముక్తాత్మయొక్క సందే శమూ. అనేకలక్షలమంది వ్యక్తులు ఇప్పుడు దీనిని ప్రచారం చేయటానికి ఆత్మోత్సర్గంచేస్తారు. నువ్వు వారిలో మహత్తర మైన పాత్ర వహిస్తావు. మట్టి కర్దమములనుంచి పైకిలేచి, పైకి వెలుగులోకి అంకురం లేవటం సత్యమే. దీనికి విరుద్ధంగా చెప్పే దేనిలోనూ తథ్యంలేదు. ప్రేమ, భోగము, రోగము, ఇచ్ఛ, సంస్కారము — ఇవన్నీ చక్రంలోని క్రిందిభాగాలు. నెమ్మది నెమ్మదిగా చక్రం పైకి సాగుతుంది, పైకెక్కుతుంది. అప్పుడు అవి వెలుగులోకివచ్చి జ్యోతిస్పర్శతో పునీత భావా ల్లోకి పరివర్తన చెందుతాయి. సత్యాన్ని అనేక దృష్టికోణాల

నుంచి చూడవచ్చు. ఒకవైపునుంచిచూస్తే అది నల్లగా కన్పిస్తుంది. ఎంచేతంటే దానిని అంధకారస్థాయినుంచి చూస్తాము. రెండవవైపునుంచి చూస్తే అది స్వయంప్రకాశమానంగా కన్పిస్తుంది. ఎంచేతంటే దానిని వెలుగులోనుంచి చూస్తాము. నువ్వు అంధకారంలోంచి బౌద్ధధర్మపు ప్రకాశంవైపుకు సాగుతున్నావు, అంబాపాలీ!'

# 20

పానశాల వృద్ధుడు మగ్గశిరా తనకుమార్తె సుభాగ, శిలాజి బౌద్ధులయారని వినేసరికి చాలా ఆగ్రహించాడు. 'నిన్న మొన్నటి కుర్రవాళ్ళు, అమ్మాయిలు కాషాయ వస్త్రాలు కట్టుకుని తిరుగుతున్నారు. జ్ఞానోపదేశం చేసేది వీళ్ళు. ఛీ...మా కాలంలో ఇదేమీ లేదు' అనుకున్నాడు.

ఈ విషయాన్ని అతడు జమదగ్గికి తెలియనివ్వలేదు. తనభార్య ఎప్పుడు చనిపోయిందోకూడా మగ్గశిరాకు గుర్తులేదు. భార్య చనిపోయినతర్వాత ఇతడు దస్యుల్లో చేరాడు. తర్వాత సైనికుడయాడు. ఆ తర్వాత కమ్మరిఅయాడు. ఇతడు కమ్మరిగా వుంటున్నరోజుల్లో ఒక మిత్రుడు తన కుమార్తె కుమారులను అనాథలగాచేసి పరలోకగతుడయాడు. మగ్గశిరా వాళ్ళను ఎంతో శ్రమపడి పెంచి పెద్దచేశాడు. వైశాలి వైభవ విలాసాలవేపుకు ఎక్కువ మొగ్గుచూపడం గమనించి పానశాలలో ఎక్కువలాభం వుంటుందనే మగ్గశిరా దుకాణం

తెరిచాడు. అతడు మద్యం సేవించడు. అంటే ఎప్పుడూ సేవించలేదని కాదు.

దాసదాసీల వ్యాపారులకు సుభాగను అమ్మినప్పుడు అతనికి చాలా దుఃఖం కల్గింది. అప్పటినుంచి అతడు తనను తాను నిందించుకుంటూనే వున్నాడు. సుభాగ వారివద్దనుంచి పారిపోయివచ్చినా ఇతణ్ణి కలుసుకొనుటకు ప్రయత్నించనే లేదు.

ప్రతినిత్యము జరుగుచున్నట్లే అత డొకనాడు మద్యం అమ్ముతూండగా ఒక యువకుడు మద్యం సేవిస్తూ—'మగ్గశిరా! విన్నావా, నీకుమార్తె లేదూ, సన్యాసిపై తిరుగుతుంది. తెలిసిందా!' అన్నాడు. వృద్ధుడు చేతిలోవున్న పానపాత్ర నలాగే పెట్టేసి, తనమీదనుంచి ఒక పాపభారం తొలగిపోయినందుకు సంతోషించాడు.

ఆ యువకుడు నవ్వుతూ 'మగ్గశిరా, ఈఅమ్మాయిలూ అబ్బాయిలూ వున్నారుచూశావ్, భలే చతురులు సుమా! వీళ్ళీసన్యాసుల్ని నాశనంచేసేస్తారు. చాటుచాటుగా ప్రేమ కలాపాలు సాగిస్తారు. తర్వాత పారిపోయి బౌద్ధుల్లోచేరి సన్యాసులౌతారు. మీ అమ్మాయితోపాటు ఆ కుర్రవాడు లేడూ......శిలాజి...అతడుకూడా వున్నాడు.' అన్నాడు.

'అతడు కూడానా?' అన్నాడు వృద్ధుడు ఆశ్చర్యంగా.

'అవునవును. ఇద్దరూ నగరంలో భిక్షమెత్తుతున్నారు.. ఆ యిద్దరే, తిరగటం వేరుగాననుకో.'

'వాడికి ఈ విషయం తెలియనివ్వకూడదు. లేకపోతే వాడుకూడా పోతాడు' అనుకున్నాడు వృద్ధుడు. ఆరోజు

దుకాణం మూసివేసేటప్పుడు, ఒకపర్యాయం సంఘారామానికి వెళ్దామా అనుకున్నాడు. కాని సుగా ఎదుటకు ఏ ముఖంపెట్టుకుని వెళ్తాడు.

జమదగ్గిని అతడు ఇంటినుంచి బయటకు వెళ్ళనిచ్చేవాడే కాదు. కాని కొద్దిరోజులకు అతడు భయపడినంతా జరిగింది. రోజూ జమదగ్గి తన అక్కను అమ్మేశాడని పోట్లాడేవాడు. ఆరోజు అతడెలాగో తప్పించుకొని నగరంలో తిరిగి వచ్చాడు. రాగానే 'నువ్వామెను అమ్మేశావు. అబద్ధాల కోరువు. ఆమె తప్పించుకువచ్చింది. నాకివాళ కన్పించింది' అని చెప్పాడు.

వృద్ధుడు కర్రతీసుకొని వెంటబడ్డాడు. కుర్రవాడు అందకుండా పారిపోయాడు. వృద్ధుడు తరిమితరిమి అలసిపోయి వెనక్కి తిరిగివచ్చాడు.

'చావనీ. పాడుముండావాళ్ళు. ఇద్దరూ ఇద్దరే! నేను ఏకాకిగానే చస్తాను' అనుకున్నాడు కోపంతో.

అప్పటినుంచి అతడు విచారంగా వుండేవాడు. జమదగ్గి ఆ వెళ్ళటం మళ్ళీ తిరిగి రానేలేదు. తన అక్కదగ్గరకే వెళ్ళివుంటాడు.

రోజూ మద్యం నిమిత్తం ఎవరో ఒకరు వచ్చి మగ్గశిరాను పిలుస్తూవుండేవారు. కాని అతడు దుకాణం పూర్తిగా మూసేశాడు. అందరూ తిరిగి మరోకచోటుకి వెళ్ళిపోయేవారు.

అతడు ఎప్పుడూ విచారంగా మౌనంగా వుండేవాడు. విచారంతో క్రమంగా కృశించిపోయాడు. కొద్దిరోజులకు

అతడు జబ్బుపడ్డాడు. లేవటం, తిరగటం కష్టమైపోయింది. ఇంట్లో ఎవరూ లేరు. ఈ అంతిమసమయంలో కూడా అతడి సహాయం చేయటానికెవరూ లేరు.

'దురాత్మరుడా!-పోయావా మిత్ర్యఅక్క-దగ్గరకు. ఘోరచావు-' అనుకునేవాడు.

# 21

హేమాంకుని పరిశోధనలు ఇంకా జరుగుతూనే వున్నాయి. తా నందులో విజయం సాధిస్తున్నాననే అతడనేవాడు. అంబాపాలి జీవితంనుంచి కుమారగుప్తుడు నిష్క్రమించిన తరువాత హేమాంకుడు తన ఏకాంతజీవితాన్ని తగ్గించాడు. అతడు తరుచు అంబాపాలివద్దకు వస్తూ, తన పరిశోధనలను గురించి మాట్లాడుతూ వుండేవాడు. కుమారగుప్తుడు వెళ్ళిపోయిన తరువాత అంబాపాలి విచారిస్తూవున్నా క్రమంగా మారుతున్న వాతావరణానికి అనుకూలంగా మారజొచ్చింది.

'దేవీ, అంబాపాలీ! నేను మీకు నా పరిశోధనల్ని చూపా లనుకుంటున్నాను' అన్నాడు హేమాంకుడు.

'ఏం, ఎంచేత? అంతప్రముఖ విజయాన్నేమైనా సాధించావా?' అని అంది అంబాపాలి ఆశ్చర్యకరమైన జిజ్ఞాసతో.

'స్వయంగా వచ్చి చూడండి' అన్నాడు మందహాసం చేస్తూ హేమాంకుడు.

'అందుకోసం ప్రత్యేకంగా ఎక్కడికైనా వెళ్ళాలా? నేను చాలారోజులుగా బైట కెచ్చేటికీ వెళ్ళడంలేదు' అంది అంబాపాలి కించిత్ విచారంతో.

'చెప్తే అంకఃలో విచిత్రమేం కన్పిస్తుంది? అది మీరు స్వయంగావచ్చిచూడవల్సిందే' అని నవ్వాడు హేమాంకుడు.

అమరసౌందర్య చిరయౌవనాల అన్వేషక రసాయని కుడు! అంబాపాలి నవ్వింది.

'నీ పరిశోధనను నాపై ప్రయోగిస్తావా ఏం? విషయ మేమిటి? నీ ప్రయోగాల్లో నే నంతశ్రద్ధ చూపటంలేదు.'

హేమాంకుడు సిగ్గుపడ్డాడు. 'మీపైనా ప్రయో గించాల్సివస్తుంది. కాని రేపుమాత్రం కాదులే. వైశాలి అంబాపాలిని తమ చిరపరిచిత రూపంలో చూడాలనే వాంఛి స్తుంది...' అన్నాడు.

అతడు అంబాపాలికేసి పరిశీలనగా చూశాడు ఆమె ముఖంలో ఏదో విషాదరేఖ ఆవరించింది. 'హేమాంక్! పండి రాలిపోవడంలోనే పండుయొక్క పరిపూర్ణత్వం వుంది. మానవునికి ఏది సత్యమో, దానిని గమనించపోవటంగానీ, దానిని గురించి దుఃఖించటంగానీ ఈ రెండుకూడా సబబు కాదు. నేను క్రమంగా వైశాలికి దూరమైపోతూవుండటం నువ్వు గమనించటంలేదా!' అని అంది.

మిమ్మల్ని వైశాలి దూరం చేయనిస్తేగా! హేమాం కుడు దరహాసంచేస్తూ ఆమెకేసి చూశాడు.

వైశాలియొక్క సర్వశ్రేష్ఠసౌందర్యవతిని తనతో పాటు రథమెక్కించుకుని తన బసకు తీసుకొనిపోయేప్పుడు హేమాంకుని హృదయం సంతోషంతో నిండివుంది.

వైశాలిలో బౌద్ధమతప్రచారం జరుగుతున్నా అక్కడి యువకులు ఇంకా తనంటే ముగ్ధులవుతూవుండటం అంబాపాలి గమనించింది. ఆమె రాజమార్గాన బయలుదేరేసరికి అందరి కళ్ళూ ఆమెమీదే వున్నాయి. పుష్పవర్షం కురిసింది. ప్రజలామె నభినందించారు.

హేమాంకుడు ఆమెకు తన పరిశోధనాలయాన్ని చూపించాడు. నగరానికి ఒకప్రక్కగా ఒక ఉద్యానవనాన్ని ఆనుకునివున్న విశాలమైన ఒక పెద్ద ఇల్లు తీసుకున్నాడతడు. ఇల్లంతా పెద్దపెద్ద ఘటాలతోనూ, కుంతలతోనూ, ఆమ్లాలు క్షారాలు రకరకాల రసాయనికయంత్రాలతోనూ నిండి వుంది. పొయ్యిమీద ఒక పెద్దకుండ వుంది. దానిలోనుంచి విచిత్రమైన దుర్గంధం వెలువడుతోంది.

'ఇందులో వుందేమిటి?' అంది ఆమె.

'ఇందులో తయారవుతుంది ఒకవిచిత్రమద్యం. దానిని సేవించటంవల్ల జీవిత వినాశకర తత్వాలు క్రమంగా నశించి నూతోల్లాసము, తేజస్సు, చురుకుదనం కల్గుతాయి.'

'నీ యీ విచిత్ర యంత్రాలు వైశాలికి చిర సౌందర్యాన్ని, అమరయౌవనాన్ని ప్రసాదిస్తాయంటావు, ఏం?'

'అప్పటివరకు వైశాలిలోని యువతులు బౌద్ధసన్యాసినులు కాకుండావుంటే. కాని అలా అయితే హేమాంకుడి నవీన సృష్టి ఏమవుతుందో!' అన్నాడు గంభీరంగా.

అంబాపాలి బిగ్గరగానవ్వి 'నిజమే! నీ విచారమూ నిజమే!' అంది. కాని అంతలోనే గంభీరంగా 'అవును. ఇప్పటికే నగరంలోని సగభాగం బౌద్ధులయ్యారు. నువ్వు నీ పరిశోధనలో త్వరగా సాఫల్యంచెందకపోతే త్వరలోనే వైశాలి మొత్తం బుద్ధుని ఆధీనంలోకి వెళ్ళిపోతుంది. సన్యాసినులు చిరయౌవనబిక్షను కాంక్షించరు' అని అంది.

ఆమె హేమాంకునికేసి చూసినప్పుడు అతడు ఏదో యంత్రాన్ని సరిచేస్తున్నాడు. కాస్సేపాగి 'దేవీ అంబాపాలీ, జీవితం ఎంత విచిత్రమైందంటే, దాని ప్రధానమైన నాడిని పట్టుకోవడమే అసంభవమైపోయింది. సరిగ్గాపరిశోధించి జీవిత తత్వాన్ని తెలుసుకుంటే దాని తరుగుదలను నిరోధించి మృత్యువును జయించవచ్చు' అన్నాడు.

'సంభవమైన ప్రతివస్తువూ ఉపయోగమైనది కాజాలదు. మానవ ప్రపంచ జీవితాలకు చాలా రహస్యాలు మరుగుపడి వుండటమే, శ్రేయస్కరం' అని అంబాపాలి చిరునవ్వు నవ్వింది.

'ఆ విషయాన్ని నే నంగీకరించను.

హేమాంకుని మాటకు అంబాపాలి జవాబేమీ చెప్ప లేదు. ఆమె ఆలోచనల్లో మునిగివుంది.

హేమాంకుడు తన పరిశోధనా రహస్యాన్ని చూపు టకు ఒక గిన్నె నిండుగా నీళ్ళు తీసుకున్నాడు. అందులో ఒక వాడిపోయిన గులాబి పుష్పాన్నుంచాడతడు. అతడు అంబా పాలిమీదకు వంగి 'ఇందులో సౌందర్యమేమీ లేదు. దీనిని ప్రేమించే తుమ్మెదలు దీనిచెంతకే రావటంలేదు. ఈ పుష్పం యౌవనంలో వున్నప్పుడు ఎంత అందంగా వుండివుంటుంది. దేవీ! చూడగోరుతున్నావా అది?' అన్నాడు.

అతడొక విచిత్రమైన సీసానుంచి దుర్గంధంతో కూడిన కొద్దిచుక్కల ద్రవాన్ని అందులో వేశాడు. క్రమంగా పుష్పం రంగు మారజొచ్చింది. అంబాపాలి ఆశ్చర్యంగా దానికేసే చూడసాగింది. అది పూర్తిగా నవవికసిత సుమం వలె ఎంతో అందంగా మారిపోయింది.

'జీవితంలోని జరామరణాలను నిరోధించి యౌవ నాన్ని సుస్థిరంగా వుండేట్లు చేయవచ్చు' అంటున్నాడు హేమాంకుడు.

కొద్దిక్షణాల అనంతరం పుష్పం తిరిగి తన మామూలు రూపం పొందింది. క్రమంగా మార్పుచెంది వాడిపోయింది.

'ఇంతే! కొద్దిక్షణాలు వుంచటంవరకే హేమాంకుడు విజయం పొందాడు. కాని ఇది ఒక విచిత్రానుభవం. ఈ పుష్పంలో జరిగిన మార్పునే కొంచెం శ్రమపడి ప్రాణులకు కూడా కల్గించవచ్చు. ప్రాణుల్లో కోర్కెలుంటాయి కనుకనే ఆ శ్రమ పడాల్సివచ్చేదికూడా.'

అకస్మాత్తుగా అంబాపాలి అతడి కేసితిరిగి 'హేమాంక్! నేను నీ పరిశోధన చూశాను. నీ పరిశోధన పూర్తిగా ఎప్పటికి విజయం పొందుతుందో తెలియదు. అయినా ఇది మానవత్వానికి అశుభంగానే వుంటుంది హేమాంక్! వదిలెయ్యి. ఈ మిథ్యను అశాశ్వతంగానే వుండనివ్వు. ధ్వంసమై దీనిని పూర్ణత్వం పొందనివ్వు. దేహము, ఈ సౌందర్యము, భోగం తరువాత వైరాగ్యము, పూర్ణత్యాగపు ఈ వికాసమార్గానికై ఎదురుచూస్తాయి...నువ్వు ప్రేమించావా?' అని అంది.

హేమాంకుడు అట్టహాసం చేశాడు.

'ఈ ప్రేమే శాశ్వత సౌందర్యాన్ని, అనశ్వరమైన జీవితాన్నిచ్చేది కాదా? త్యాగం వైరాగ్యాల్లో ఏమీ సౌందర్యం లేదా? వైశాలి గణిక చిరసౌందర్యాన్నీ కోరటం లేదు; శాశ్వతజీవితాన్నీ కోరటం లేదు' అంది అంబాపాలి.

ఆమె చాలా ఉద్రేకంగా వుంది. హేమాంకుని నవ్వు వెలవెలబోయింది. అతడు ముందుకువచ్చి అంబాపాలి చేతిని ముద్దుపెట్టుకున్నాడు. ఆమె కంపించింది.

'దేవీ, అంబాపాలీ! నువ్వు హేమాంకుని హృదయజ్వాలలోని దేవివి. అతడు తన పరిశోధనాఫలితాన్ని నీ పాదాలముందుంచగోరుతున్నాడు' అన్నాడు.

అంబాపాలి మౌనం వహించింది.

హేమాంకుడు ఇంకా చెప్తూనే వున్నాడు – 'నువ్వు నా జీవితంలో ఒక సుడిగుండాన్ని లేపావు. నేనొక మందు

తున్న అగ్నిపర్వతంపై నిలబడి వున్నాను. వింటున్నావా నువ్వు?'

అంబాపాలి అన్యమనస్కంగావుంది. అతడిప్రశ్న విని ...పడింది. 'ప్రతివారి ప్రేమాభిశాపంలో దగ్ధమవటమే అంబాపాలి సౌందర్యంలోని సార్థకత్వమా? ఆమెకు మరో కల్యాణమార్గమేలేదా? ఆమె పురుషులంటే విసుగెత్తిపోదా? హేమాంక్! నువ్వు వెర్రివాడవు. నిన్నుగురించి ఎన్నో సంవత్సరాలక్రితం కుమారగుప్తుడు చెప్పింది అబద్ధంకాదు' అంది గంభీరంగా.

తర్వాత నెమ్మదిగా – 'మీ పురుషులందరూ ఒకటే – లంపటులు! హేమాంక్! నేను పురుషుల్ని ద్వేషిస్తున్నాను' అంది.

ఇప్పుడు అర్థమయింది హేమాంకునికి తన బలహీనత. 'లేదు, లేదు. నేను చెప్పింది అబద్ధం. నేను నిన్ను ద్వేషిస్తున్నాను' అన్నాడు. అతడి ముఖం కళావిహీనంగా వుంది. అంబాపాలి కొంచెం స్వస్థపడి అట్టహాసం చేసింది.

'నేను నిన్ను ద్వేషిస్తున్నాను. నన్ను ద్వేషించిన మొదటి పురుషుడవు నువ్వు. నేను నాకు తెలియకుండానే నిన్ను ప్రేమించసాగాను. నీద్వేషం నన్ను నీ వైపుకు ఆకర్షించింది. కాని ఇప్పుడా ఇంద్రజాలం బయటపడింది. నువ్విప్పుడు నన్ను ప్రేమిస్తున్నావు. నువ్వు దాయలేవది. మామూలు పురుషులకంటే నువ్వు గొప్పవాడివేంకాదు. వాళ్ళకంటే అతీతుడవూ కాదు. అంబాపాలి నిన్ను ద్వేషిస్తుంది' అని అంది.

ఇద్దరూ మౌనం వహించారు.

అంబాపాలిని తిరిగి ఆమె భవనానికి సాగనంపే సమయానికి అతడుకూడా కొంచెం తేరుకున్నాడు. అతడు రాజమార్గాన గుర్రాలను నెమ్మదిగా తోలుతూ 'నువ్వు చెప్పింది నిజమే దేవీ! పురుషులందరూ ఒకటిగానే వుంటారు; నేనూ నీ వైపుకు ఆకర్షితుడనయ్యాను. నేను అతివిచిత్రంగాతయారై నిన్ను నా వైపుకు ఆకర్షించుకో దలచాను. మీ స్త్రీలు మమ్మల్ని విశృంఖలంగానూ, పిచ్చివాళ్ళగానూ, కవులుగానూ చేసేస్తారు' అన్నాడు.

అతడు ఆమెకేసి చూసి విచిత్రంగా నవ్వాడు. 'నేను చిరసౌందర్యం, శాశ్వత జీవిత రసాయనాన్ని విశ్వసిస్తున్నాను. కాని ఈ పరిశోధనలో నా స్వార్థం వుంది. నువ్వు నాకళ్ళు తెరిపించి జ్ఞానోదయం కల్గించావు. నా జీవితంలోని ఒక బలహీనతను పోగొట్టావు. నేనిహ నిస్వార్థభావంతో' అని అతడు అంబాపాలికేసి చూశాడు. వారు భవనంముందుకు చేరుకున్నారు. అంబాపాలి అతడి మాటల్నేమీ విన్పించుకోవటం లేదు. ఆమె దృష్టంతా రాజమార్గాన వెళుతున్న ఒక బౌద్ధభిక్షునిపై వుంది. అతడు కుమారగుప్తుడు. ఆమె అతణ్ణి గమనించింది.

## 22

ఆ తర్వాత అంబాపాలి జీవితం ఒక్కొక్క క్రొత్తమార్గంలో పయనించింది. ఆమె తిరిగి కుమారగుప్తుణ్ణి కలుసుకోలేదు. 'ఒకరి జీవితకాంక్షను నే నెందుకు నష్టపర్చాలి? ఏ మహత్తర పరివర్తన చక్రంలో పాల్గొనాలని కుమారగుప్తుడు చెప్తూండేవాడో; ఆ సమయం వచ్చేసేవుంటుంది. కుమారగుప్తుడు ఆ సంకేతాన్ని గ్రహించాడు. కుమారగుప్తుడు బౌద్ధసంఘంలో చేరటమే అతడిమార్గం మార్పుకు సంకేతం గాదా? ఇంకా సమయం రాలేదేమో!' అని ఎన్నోవిధాల యోచిస్తూండేది.

ఆనాటితర్వాత హేమాంకుడు మళ్ళీ ఆమెను కలుసుకోలేదు. ఒకనాడు అంబాపాలి చాలా ఉద్విగ్నంగా వుంది. సాయంత్రమవగానే షికారునిమిత్తం నగరం వెలుపలకు వెళ్ళింది. ఆమె తిరిగి వచ్చేప్పుడు ఒక రథం వచ్చి సరిగ్గా ఆమె రథసమీపంలో ఆగింది. దానిమీద హేమాంకుడున్నాడు.

'మంచిది, నువ్వే కలిశావు, మంచిదే అయింది. నే నివాళ వైశాలి వదలి వెళుతున్నాను' అన్నాడతడు.

'ఏం, ఎందుకని? ఏదైనా విశేషకారణం వుందా?' అని ప్రశ్నించిందామె.

'కారణంకూడా వుండవచ్చు' అన్నాడు హేమాంకుడు చిరునవ్వుతో.

ఇద్దరూ మౌనం వహించారు. ఎన్నోరథాలు వారిని తప్పుకుని వెళ్ళిపోయాయి.

'అయితే ఎక్కడికి వెళ్తావ్ ? చంపానగరానికా ?' అని అడిగింది అంబాపాలి మౌనభంగం చేస్తూ.

'అక్కడికే వెళ్తున్నాను. ఈ రసాయనంలోనే నిమగ్నమైపోవాలి.'

'నువ్వు సఫలం చెందాలి. కానీ, హేమాంక్ ! నువ్వు వివాహం చేసుకుని ఒక ఇంటివాడ వవు. జీవిత రథ చక్రాలు చాలా వేగంగా తిరుగుతున్నాయి. అంతకుముందు ఎప్పుడైన మిట్టపల్లాల మార్గమంతా వెనకబడిపోతుంది. నువ్వు నన్నూ, వైశాలినీ మర్చిపోతావు...'

ఆమె చిరునవ్వుతో అభినందనలు తెలియజేసింది. హేమాంకుడు ఎడంచేతితో గుర్రా లకళ్ళేలు పట్టుకొని కుడి చేతిని అభినందించినట్లుపైకెత్తాడు. వెళ్తూ వెళ్తూ 'సూర్యమణిని కలుసుకున్నావా ?' అని అడిగింది అంబాపాలి.

'అతణ్ణి కష్టపెట్టడం మంచిదికాదనుకున్నాను. అతడు ఏ కవిత్వం వ్రాస్తూనో, లేక పరిషత్తువిషయాలాలోచిస్తూనో వుంటాడు' అని బదులు పలికాడు బిగ్గరగా హేమాంకుడు వెళ్తూనే.

రథాన్నదలిస్తూ అతడు ముందుకు సాగిపోయాడు. భవనానికి చేరుకున్న తరువాత అంబాపాలి నవ్వుకుంది. 'ఇద్దరిమిత్రులకు విరోధం కల్గించిన దోషం నాదే' అనుకుంది.

క్రమంగా రోజులు దొర్లిపోయాయి. అజాతశత్రువు తిరిగి ప్రసేనజిత్తునిపై ఆక్రమణచేస్తూ వున్నట్లు రాజగృహం నుంచి సమాచారాలు వస్తున్నాయి. ఇటు అంబాపాలికి

జీవితం రాను రాను మరీ శుష్కమూ, నీరసంగా కన్పించ టంతో చివరి కామె వారణాసి యాత్రకు వెళ్ళాలని నిశ్చ యించుకుంది. ఆమె కుమారగుప్తునికి సాధ్యమైనంత ఎక్కువ దూరంగా వుండాలని వాంఛిస్తోంది.

ఆమె ఒకనాడు చంద్రసేనను పిలిచి 'చూడు, నేను విజయుని వెంట కాశీ వెళ్తున్నాను' అని చెప్పింది.

చంద్రసేన ఆశ్చర్యంగా ఆమెకేసి చూసింది. 'ఈ భవనం నీ సంరక్షణలో వదలి వెళ్తున్నాను. నువ్వు సూర్య మణి సహాయం పొందవచ్చు' అని చెప్పి ఆమె నవ్వింది. 'ఇక్కడినుంచి నేను వెంట ఏమీ తీసుకు వెళ్ళను. కొద్ది ధనం, కొన్ని వజ్రాలు మాత్రమే నాదగ్గర వుంటాయి. వాటితో నే నక్కడ హాయిగా వుండగలుగుతాను'అని అంది.

'దేవీ! మళ్ళీ తిరిగివచ్చే దెప్పుడు ?' అని అడిగింది చంద్రసేన.

'చెప్పలేను' అని గదిలో కాలుపెడ్తూ 'తిరిగి వస్తానో లేదో !' అంది అంబాపాలి. మరింత ఆశ్చర్యంగా చంద్రసేన ఆమెకేసి చూసింది. ఆమెముఖంలో అలసట, విషాదము స్పష్టమవుతున్నాయి.

వారణాసి ఇప్పుడు పూర్వంవలె లేదు. అక్కడ ఇప్ప టికి యజ్ఞయాగాదులు జరిపించే సనాతన హిందూమహా పండితు లున్నప్పటికీ నగరమంతా బౌద్ధవిహారాలతోనూ, సంఘారామాలతోనూ నిండివుంది. బుద్ధుడు తన ధర్మచక్ర

పరివర్తన ఈ నగరంనుంచే ప్రారంభించాడు; అదే చాలా సంవత్సరాలు ఆయనకు కేంద్రంగా వుంది. ఇది అవసరం కూడా అయింది. కాశీ, విద్యకు ఆనాడు ముఖ్య కేంద్రం. అదేవిధంగా యజ్ఞ యాగాలకు కూడా ప్రముఖ కేంద్రంగా వుండేది. ఒకపర్యాయం ఇక్కడ ఒక నూతన మత స్థాపన జరిగిందంటే అది విజయం పొందటంలో మరే సందేహమూ వుండేదికాదు.

అంబాపాలి గంగానదీ తీరాన ఒక భవనాన్ని బాడుగకు తీసుకుని అందులో చాలా నిరాడంబరంగా జీవితం గడుపుకోసాగింది. ఆమె తరచు బౌద్ధ సంఘారామాలకు వెళ్తూ వృద్ధ బౌద్ధసన్యాసుల ఉపదేశాలు వింటూవుండేది.

ఆమె జీవితానికి శాంతి లభించింది. ఆమె ఒకనూతనోల్లాసాన్ని పొందగల్గింది.

కాని ఇది జీవితం. ప్రతిక్షణం గతంలోని మాన ప్రతిబింబం వర్తమానజీవితంపై పడుతూనే వుంటుంది. మనం దాన్ని అంగీకరించం. ఒకమనిషి తన గతజీవితాన్నుంచి సమస్త సంబంధాలు త్రెంచుకుని నూతనసంబంధా లేర్పరచుకోనటంలో నిమగ్నుడై వున్నప్పుడు గతంలోని ఈ భూతాలు అంధకార గర్భంనుంచి వెలువడి అతడి ఎదుట ప్రత్యక్షమవుతాయి. అతడి ప్రశాంతతకు భంగం కల్గుతుంది.

అంబాపాలి ఎదుటకూడా ఒకభూతం ప్రత్యక్షమైంది. అది సమర్థ సత్యకాముని రూపంలో సాక్షాత్కరించింది. సత్యకాముడు బౌద్ధసన్యాసి అయ్యాడు. ఒకనాడు అంబాపాలి

సంఘారామంలో ఉపదేశం వింటూవుండగా ఆమెదృష్టి ఎదురుగావున్న భిక్షుకునిపై నిల్చింది అతడు తనకేసి రెప్ప వాల్చకుండా చూస్తున్నాడు. ఇందులో ఆశ్చర్యపడాల్సిన దేమీలేదు.

అంబాపాలిని గురించి కాశీలో చర్చలు ప్రారంభ మయాయి. ఆమె సౌందర్యం అక్కడి ప్రజల్నికూడా ఆకర్షించింది.

'ఇతడు సమర్థుడే' అనుకుంది అంబాపాలి, అతణ్ణి పరిశీలనగాచూసి.

ఉపదేశం ముగిసినతర్వాత ఆ సన్యాసి ఆమెవద్దకు వచ్చాడు. 'మీ రిక్కడకు వచ్చారా? ఇది నాకింతకుపూర్వం తెలియదు. మీకు నే నేమైనా సహాయం చేయగలనా?' అన్నా డతడు.

అంబాపాలి చిరునవ్వుతో 'సమర్థ! నువ్వు పూర్తిగా మారిపోయావ్. నిన్ను గుర్తించటమే చాలకష్టమైపోయింది. నీ కిక్కడ శాంతి లభించిందా?' అని అంది.

సత్యకాముడు మందహాసం చేశాడు.

'బౌద్ధమతం సంఘర్షణను ఉపదేశిస్తుంది. అనవరత ఆధ్యాత్మిక సంఘర్షణ పేరే శాంతి. మీరు చెప్పేది మోక్షాన్ని గురించైతే నేను దాని నింకా పొందలేదు. నేను సాధన చేస్తూ వున్నాను.'

'నీసాధన సఫలం చెందాలి?' అని అంది అంబాపాలి.

దీనితర్వాత ఆమె తరచు అతణ్ణి కలుసుకుంటూ

వుండేది. బుద్ధుణ్ణి గురించి, సంఘాన్ని గురించి ఎన్నో విషయాలు మాట్లాడేది. అతడంతగా ఎలా మారిపోయాడా అని ఆమెకు ఆశ్చర్యం కలిగేది. ఒకనాడు సముద్ధుణ్ణి ఆ విషయం అడిగింది కూడా. 'ఇక్కడపోగొట్టుకున్న వస్తువును గురించి చర్చించటం సబబు కాదు. కాని ఒక విషయం మాత్రం చెప్తాను. తథాగతుని మతంలో చిక్కు అనేది లేదు. అది నిరాడంబరమైన జీవితాన్ని గురించి మాత్రమే ఉపదేశిస్తుంది. వ్యసనము, ఐశ్వర్యము జీవిత వీణా తంత్రులను ఏమాత్రం బిగుతుగా ఉంచలేవు. సాధన, కఠిన తపస్సు దానిని బిగించి వేస్తాయి. బుద్ధుని మార్గం సరియైనదే' అన్నాడు హేమాంకుడు నవ్వి.

అంబాపాలి ఎవరిని తిరస్కరించిందో, ఎవరి ప్రేమను స్వీకరించ నిరాకరించిందో అతడే క్రమంగా ఆమెకు తథాగతుని మత మూలతత్వాలను పరిచయం చేశాడు.

ఒకనాడు సముద్ధుడు ఆమెతో 'అంబాపాలీ! కోర్కెలు నశించవు. వాటికి మనము నూతనంగా ఇంకా ఎక్కువ ఉన్నత స్థాయిలో క్రొత్త రూపాన్ని యివ్వాల్సి వుంటుంది. అప్పుడది మనకు బాధగా యుండక సాధన అవుతుంది' అన్నాడు.

ఇదేవిధంగా వారణాసిలో అంబాపాలి జీవితం నూతన సంస్కారమార్గంలో నడుస్తూ వుంది. కాని ఒకనాడు సముద్ధుడు వచ్చి 'కుమారగుప్తునికి దెబ్బ తగిలింది' అని చెప్పాడు.

అంబాపాలి తల తిరిగిపోయింది.

సత్యకా! 'ఆర్యకుమారగుప్తుని కేమిజరిగింది?' అని అడిగింది. బౌద్ధ సన్యాసి కుమారగుప్తుడు రాజగృహానికి వెళ్ళాడనీ అక్కడ కోసల సైన్యం ముందు అజాత శత్రువు పరాజయం పొందటం వల్లఅతడు మరోసారి ఖడ్గాన్ని చేపట్టాడనీ యుద్ధంలో గాయపడ్డాడని సమర్థ సత్యకాముడు ఆమెతో చెప్పాడు.

అతడు తన మాటను ముగిస్తూ 'కుమారగుప్తుడు సన్యాస ధర్మ కుతుడైనా' డని అన్నాడు. అంబాపాలి కుమారగుప్త ప్రేమవిషయం అతడికి తెలుసు. కొంచెం పరిచయమున్న కారణంగా కూడా అతడీ సమాచారంలో ఇంతగా ఆసక్తి కనబరచాడు.

ఈ సమాచారము అంబాపాలికి చాల దుఃఖాన్ని కలిగించింది. 'సమర్థ! ఇప్పుడాయన ఎక్కడున్నాడు?' అని అడిగింది. అతడు రాజగృహంలోనే యున్నాడనీ ప్రసేనజిత్తుని కుమార్తె దేవపాలితను వివాహము చేసికొన్న తరువాతనే అజాతశత్రువుకు మోక్షము కలిగిందనీ ఈవిధంగా ఎన్నో సంవత్సరాలుగా రెండు శత్రురాజ్యాలు ఐక్యమయ్యాయని ఇది, వృద్ధ ప్రసేనజిత్తుని రాజకీయ విజయమనీ సమర్థుడు చెప్పాడు.

ఈ వార్త విన్న తరువాత అంబాపాలి విచారంగా ఉండసాగింది. 'ఆయన సంఘాన్ని ఎందుకని వదిలి పెట్టాడు? అసలీ యుద్ధంలో ఎందుకు పాల్గొన్నాడు? ఇప్పుడాయన ఎలా వున్నాడు?' ఇదే ప్రతిక్షణం ఆమె మనస్సులో మెలుగుచున్న జిజ్ఞాస. క్రమంగా ఈ ప్రశ్నలు ప్రముఖంగా ఆమెలో నాటుక

పోయాయి. చివరి కొకనాడామె సంఘారామములో సమ ర్ధుడ్ని కలుసుకున్నప్పుడు హఠాత్తుగా ఆమెకు రాజగృహం వెళ్ళాలని ఆలోచన కలిగింది.

రాజగృహ సైన్యాలు పరాజయంపొంది తిరోగమనం చేస్తున్నాయి. వారి ముఖాల్లో అలసట, పరాజయ చిహ్నాలు స్పష్టంగా కన్పిస్తున్నాయి. కాని దానితోపాటు వివాహపు మేళాలు విన్పిస్తున్నాయి. రాజగృహ ప్రజలు క్రొత్త మహా రాణికి స్వాగతమిస్తున్నారు.

## 23

రాజగృహంనుంచి కుమారగుప్తునివెంట అంబాపాలి వైశాలికి తిరిగివచ్చినప్పుడు ఆమె ఒక నిశ్చయానికి వచ్చింది. ఇహ తనుకూడా సంఘంలో దీక్ష పొందాలి; అన్యవధిలో ఆమె కుమారగుప్తునికి అతి సామీప్యానికి చేరుకుంది. రాజ గృహం వెళ్ళగానే ఆమె తిన్నగా కుమారగుప్తుని ఇంటికి వెళ్ళి, అతడి భారాన్నంతా ఆమే వహించింది. ఈయుద్ధంలో అతడి తండ్రి దివంగతుడయాడు. అతడి తమ్ముడు కిశోర గుప్తుడు వారి హోదాలోకి వచ్చాడు.

ఆమె సేవాశుశ్రూషలతో కుమారగుప్తుడు త్వర లోనే కోలుకున్నాడు. వైశాలి వెళ్ళటానికి తగినంత ఆరో గ్యం చిక్కగానే ఆమె అతణ్ణి వైశాలికి తీసుకు వెళ్ళింది.

కుమారగుప్తుడు అసలు రాజగృహానికి ప్రచారం నిమిత్తం వెళ్ళాడు, కాని అక్కడి పరిస్థితుల ప్రాబల్యం వల్ల అతడిలో వున్న క్షత్రియ రక్తం ఉద్రేక పడింది. అతడు సన్యాస ధర్మాన్ని మర్చిపోయాడు. 'గౌతముని మతం పిరికితనాన్ని ఆహ్వానించదు' అని చెప్తూ అతడు యుద్ధంలో పాల్గొన్నాడు. వైశాలి చేరుకున్న తరువాత, తన చుట్టూ వున్న ప్రపంచం చాలా మారిపోయినట్లు అంబాపాలి గమనించింది. ఆమెదృష్టి ఒక మార్పు పైకి మరింత ప్రముఖంగా ఆకర్షితమయింది. ఆమె అది గమనించి మందహాసం చేసింది. ఏమిటా మార్పు? సూర్యమణి ఆమెపై ఆశ వదలుకున్నాడు. ఇప్పుడతడు చంద్రసేనను ప్రేమిస్తున్నాడు. చంద్రసేన తల్లిదండ్రులు ఉన్నత వర్గానికి చెందినవారని, ఆమె సాధారణ దాసీగాదని అతడు అంబాపాలిద్వారా తెలుసుకునేవున్నాడు. పైగా ఆమె సౌందర్యం ఆమె అభిజాత్యానికి సాక్షిగాదా?

మానవుడు జీవించి వుండాలని కోరడమేగాక తాను జీవించే వున్నాననేది గ్రహించకోరతాడు, తనలోనే కేంద్రీకృతమైవుండి ఎవరూ తాను బ్రతుకుతున్నానని తెలుసుకోలేరు. తాను మరొకరికోసం జీవిస్తున్నాననేది అతడికి కావాలి ఇదే జీవితంలోని వైచిత్ర్యం. అంబాపాలి వెళ్ళిపోయిన తర్వాత సూర్యమణి జీవితంలో ఆ వెలితి ఏర్పడింది. అతడు జీవిత స్పర్శను పొందటానికి మరొక దిక్కుకు తన చెయ్యి చాచాడు, చంద్రసేన ఆ చేతిని పట్టుకుంది.

'ఆమెకుకూడా వైభవప్రేమలు అనుభవం కావాలి' అని ఆలోచించింది అంబాపాలి.

కుమారగుప్తుడు పూర్తిగా కోలుకున్నాడు. అతడు త్వరగా మళ్ళీ సంఘంలోకి వెళ్ళగోరుతున్నాడు. అతడు మంచం పట్టి వున్నంతకాలం తరచు కేకలు పెట్టూ వుండే వాడు. 'కాదు, కాదు, నేనొక మహత్తర పరివర్తనలో పాల్గొంటానికే జన్మించాను. నువ్వు నన్ను పట్టుకుని ఆపలేవు. నేను బంధనాల్నించి విముక్తి చెందాను. నేను స్వతంత్రుణ్ణి. నా అదృష్టదేవత అటు నిలబడి దరహాసం చేస్తోంది. ఆ వెలుగులో నేను ఒక మహత్తర చక్రం తిరుగుతూ వుండటం చూస్తున్నాను, మనందరం దానిపై ఎక్కుతూ దిగుతున్నాం. నావెంట అంబాపాలి వుంది' అంటూ కలవరించేవాడు.

ఈ విధంగా వూహాలతో అలసి ఉన్మాదగ్రస్తుడైన కుమారగుప్తుడు స్పృహ దప్పేవాడు.

అతడిప్పుడు పూర్తిగా ఆరోగ్యవంతుడైన తరువాత అంబాపాలి గృహ ప్రాంగణంలోనూ, ఉద్యానవనంలోనూ కన్పిస్తున్నాడు. అంబాపాలి తానుకూడా సన్యాసిని కావాలనే కోర్కెను వెల్లడించింది అతడి దగ్గర. ఇందుకతడెంతో సంతసించాడు.

'అంబాపాలీ! నేను నీ భవనాన్ని శీఘ్రంగా వదలి పోవాల్సి వుంటుంది. నా ఈ కాషాయదుస్తులు చూస్తున్నావుగా. బౌద్ధ సన్యాసి అంబాపాలి భవనంలో వుండటం సంఘానికి అవమానకరం.

'అంబాపాలియే స్వయంగా సంఘంలో దీక్షపొందితే?'

'అప్పు డిక్కడ ఈ వైభవం కన్పించదు అంబికా! నేను దీనితో విసిగిపోయాను. నీ యీ వైభవమంతా వైశాలి నగరంపై భారమే నని నాకు గోచరిస్తుంది' అన్నా డతడు.

అతడు చిరునవ్వు నవ్వి 'నీ సౌందర్యం కూడా!' అన్నాడు

అంబాపాలి మౌనంగా వుంది.

కాస్సేపాగి 'అంబికా! నేనారోజున ఖడ్గంతో గాయ పర్చిన యువకుడున్నాడే, అతడు బౌద్ధుడైయాడు. ఆఅమ్మాయి కూడా సన్యాసిని అయింది. వారు నాకు జ్ఞానోదయం కల్గించారు. ఆనాడు నీ భవన ప్రాంగణమంతా క్షుదార్తులతో నిండి వున్నపుడు......'అని కుమారగుప్తుడు అంటూవుండగా అంబాపాలి పరధ్యానంగానే 'చాలా భయంకరమైన కాటకం వచ్చిందప్పుడు. నీకు గుర్తుందా?' అంది.

'అవును, ఆరోజున నీ యీ భవన ప్రాంగణ మంతా క్షుధార్తులతో నిండిపోయింది. వారు తిండి కోరుతున్నారు. వారికి అన్నం ఎక్కడ దొరుకుతుంది? వైశాలి రాజ పురుషులు తిండిని తమ భవనాల్లో బంధించివేశారు. నగరంలో బహిరంగ ధాన్యాగారాలన్నీ ఖాళీ అయిపోయాయి. ఆతరువాత నే నొక అనౌచిత్యకార్య మాచరించాను. ఒక రోజున ఆచార్య ప్రబుద్ధకేతుడు తథాగతుని విషయం ముచ్చటిస్తూ ఒక కథ చెప్పారు. ఒకనాడు తథాగతుడు ఉపదేశ మివ్వటానికి వెళ్తూ వుండగా ఆయన ఒక ప్రేతకుడ్ని చూడటం జరి

గింది. అతడు ఊపిరిలేనట్లున్నాడు. అతడా రోజంతా భోజనం చేసివుండలేదు. 'మిత్రులారా! ఈ ప్రపంచంలో అన్నింటికంటే ముఖ్యమైన వస్తువేది?' అని తథాగతుడు ప్రశ్నించాడు.

అందరూ ఆశ్చర్యంతో ఒకరి నొకరు చూసుకో సాగారు.

'ధర్మం,'
'సత్యం.'
'ఓర్పు.'
'దయ.'
'జ్ఞానం.'

ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా చెప్పారు. తథాగతుడు మౌనం వహించాడు. ఆయన గంభీరంగా ఈ విషయాన్ని ఆలోచించాడు. 'అన్నింటికంటే ముఖ్యమైన వస్తువు భోజనమని తెలుసుకోండి. ప్రజలందరికి తిండి లభించేట్లు చూడటమే ఒక దేశం యొక్క ప్రథమకర్తవ్యం' అని చెప్పాడు తథాగతుడు.

తర్వాత ఆయన ఆ క్షుదిత వ్యక్తి కేసి చూపించి 'ఈ వ్యక్తి ఆకలిగొని వున్నాడు. ఇతనికి భోజనం పెట్టండి' అని చెప్పారు.

'ఉపదేశం వాయిదా పడింది, అతడు భోజనం చేశాడు. ఆకలిగొన్నవారికి భోజనం పెట్టినవారు ధర్మానుసారంగా అన్నింటికంటే ఎక్కువ పుణ్యాత్ముడవుతాడని అప్పుడు తథా

గతుడు ఉపదేశించాడు. మన మీా భవనాల్లో విలాస వస్తువుల్ని సమకూర్చుకుంటాం. ఇవన్నీ ఎక్కడినుంచివస్తున్నాయి? వీటినే ఆహారంగా మార్చవచ్చు. దానినే ప్రజల దృష్టి నుంచి మరుగుపర్చటానికి మన మీా మెరుస్తున్న పదార్థాల్లోకి మార్చేశాము.'

అతడి కంఠస్వరం రానురాను ఆవేశపూరితం కావటం అంబాపాలి గమనించింది.

'కుమారగుప్తా! నువ్విప్పుడిప్పుడే కోలుకున్నావు' అని గుర్తు చేసింది అంబాపాలి.

కుమారగుప్తుడిదేమీా విన్పించుకోలేదు. అతడు చెప్పటం ఆపనేలేదు. 'నువ్వీ భవనాన్ని వదిలెయ్యాలి అంబాపాలి! నువ్వు నిజంగా నన్ను ప్రేమిస్తూవుంటే నువ్వీ ఐశ్వర్య విలాసాల హిమశిఖరం నుంచి క్రిందికి జనులు నివసించే సమతల ప్రదేశానికి దిగిరావాలి. వింటున్నావా అంబికా!' అన్నాడు.

'అంబాపాలికి వైరాగ్యం సిద్ధిస్తుందా?' అని అడిగిందామె.

'ఎందుకు సిద్ధించదు? మనం జీవితంలో అనుభవించని సుఖాలేమున్నాయి? మన మింకా ఈ పంకిలంలో ఇరుక్కునే వుంటామా? పైనవుంటే వెలుగు నీకు లభించదా? ఈ శరీరము, దీని సౌందర్య ఉపకరణాలు నశించిపోతాయి. కాదు; రేపటి కివి శిథిలమైపోతాయి. వైశాలీలో సర్వశ్రేష్ఠసౌందర్యవతివైన నువ్వు (అతడు నవ్వాడు, ఒకప్పుడు ఆమెసౌందర్యా

న్ననుభవించిన అతడే ఇవాళ ఉపదేశిస్తున్నాడు) రేపు తిరస్కరించబడతావు !'

అతడి కన్నుల్లో సాత్వికం మెరుస్తోండటం ఆమె గమనించింది. సత్యం మహత్తరమైన ఆ వెలుగులో విరాజిల్లుతున్నట్లుంది.

'నువ్వు చెప్పేది నిజమే. నేను మారవల్సిందే' అంది అంబాపాలి.

చాలారోజులతర్వాత ఒకనాడు సూర్యమణి వచ్చాడు. అంబాపాలి అకస్మాత్తుగా వచ్చినందుకు అతనికి చాలా ఆశ్చర్యం కలిగింది. అత డామెను కలుసుకోవటం మానేశాడు. కాని అతడు తిరిగి మళ్ళీ అంబాపాలిని చేరుకోలేనంత దూరమైపోయాడు.

'నేను పరిషత్తు పనుల్లో మునిగి వుండటంవల్ల రాలేకపోయాను. ఏమైనా బాధకల్గిందా ?' అని అడిగా డతడు.

అంబాపాలి చిరునవ్వుతో 'లేదు' అని తలాడించింది. 'ధన్యవాదాలు ! నా కేమీ బాధకలుగలేదు, హేమాంకుని వద్దనుంచి జాబులేమైనా వచ్చాయా ?' అని అంది ఆమె.

'వచ్చాయి. అతడు ప్రస్తుతం తామ్రలిప్తిలో వుంటున్నాడు. ఎందుకు వుంటున్నాడో ఏమో నే నేమీ చెప్పలేను. బహుశా అతనికి అజాతశత్రువంటే మంటగా వుండివుంటుంది. అంచేతే అతడు అంగదేశాన్నొదిలి వంగదేశానికి వచ్చాడు.'

అంబాపాలి నవ్వుతూ 'అతడి శాశ్వత సౌంధర్యాన్నీ, చిరజీవితాన్నీ పరిశోధించటానికి సహాయపడే తాంత్రికులు అక్కడ అతడికి లభించవచ్చు' అని అంది.

సాయంత్రం కావస్తోంది. అంబాపాలి అతనితో 'ఆర్య సూర్యమణీ! నేను సంఘారామానికి వెళ్ళి కుమారగుప్తుని ఆరోగ్య విషయాలను ఆచార్య ప్రబుద్ధకేతులవారి కెరిగించాలి. మీరు నా వెంట వస్తారా, ఇక్కడే వుంటారా? నే నక్కడ ఆలస్యం చేయను' అంది.

'మీ యిష్టం!' అని అతడా విషయాన్ని అంబాపాలి పైనే వదిలేశాడు.

'అయితే మీ రిక్కడే వుండండి' అని ఆమె మందహాసం చేస్తూ 'చంద్రసేన మీకు ఆతిథ్య మిస్తుంది...ఆనందం' అని అంది. ఆమె గదిలోకి వెళ్తూ 'చంద్రసేనా!' అని పిలిచింది. మధురమైన ఆమెనవ్వు గదంతా వ్యాపించింది.

కుమారగుప్తుడు అప్పటికే చల్లగాలికై ఉద్యానవనంలోకి వెళ్ళాడు. అంబాపాలి గదిలోంచి బైటకు వచ్చేసరికి సూర్యమణి చంద్రసేనలు గుసగుసలాడటం గమనించింది. ఆమెను చూడగానే చంద్రసేన లేచి నిల్చుని అభివందనం చేసింది. వారిని చూసి నవ్వుతూ అంబాపాలి వెళ్ళిపోయింది. ఆమె ఈ నవ్వులో ఈర్ష్యా లేదు, ద్వేషమూ లేదు.

# 24

బుద్ధుడు ఈ పర్యాయం వైశాలికి వచ్చినప్పుడు నగరం వెలుపలవున్న అంబాపాలి మామిడిచెట్ల విహారంలో బసచేశాడు. ఈవిషయం అంబాపాలికి తెలిసింది. తథాగతుడు తన విహారాన్నే ఎందుకు ఎన్నిక చేసుకున్నాడు? ఇందులో

కూడా అదృష్ట సహాయం లేదా? తన కిహ సమయం వచ్చిం దనే భావించుకోవాలా ?

ఆమె తనను ఘనంగా భావించసాగింది. వైశాలిలో ఇందరు రాజపురుషులు, శ్రేష్ఠులు సంఘప్రముఖ విహారాన్ని సైతం వదలి తథాగతుడు తనవిహారంలో బసచేశాడు. ఇది తనకు గర్వకారణంగాదా! తను వారివద్దకు వెళ్ళి తన భవనానికి ఆహ్వానించాలని నిశ్చయించుకుంది. 'బుద్ధుడైనవారు, ఇంత మహాప్రాణులు తనను హేయంగా, అంటరానిదానిగా భావిస్తారా ? ఆ సమదర్శిదృష్టిలో అంబాపాలి స్త్రీ గాదు, పురుషుడూ గాదు, గణిక గాదు' అనుకుంది.

నిన్న ఆమె కుమారగుప్తుణ్ణి రథంలో కూర్చోబెట్టుకొని సంఘారామాన్ని వదలివచ్చినతరువాత తనకుగానీ, నగర ప్రజలకుగానీ బుద్ధుడు వస్తాడనడంలో సందేహమేమీ లేదు. నగరమంతటా నూతనోత్సాహం, కోలాహలం నిండింది. వైశాలి రాజపురుషుల పరిషత్తు బుద్ధుణ్ణి ఆహ్వానించాలని నిశ్చయించింది.

అంబాపాలి బుద్ధుణ్ణి తన భవనానికి ఆహ్వానించి తిరిగి వచ్చుచున్నప్పుడు, లిచ్ఛవి రాజపురుషులు వేగంగా రథాలు తోలుకొని రావటం చూసింది. ఆమె ఎంతో గర్వించింది. నేడు వైశాలిలో తనకంటే అదృష్టవంతులు మరెవరున్నారు ?

వారు పరిషత్తు తరఫున బుద్ధుణ్ణి ఆహ్వానించటానికి వెళ్తున్నారు. వారిలో భీమసేనుడు, సూర్యమణి వుండటం ఆమె గమనించింది.

ఆమె గర్వంతో ఉప్పొంగి రథాన్ని వారి మధ్యకు పోనిచ్చి నవ్వుతూ వారి ముఖాల్లోకి చూసింది.

'అంబాపాలీ! ఏమిటి? నువ్వు లిచ్ఛవి రాజపురుషులతో పోటీచేస్తున్నావా?' అని అడిగాడొక రాజపురుషుడు. అతడు మందహాసంచేశాడు. వారు ఆగి ఆమెనభినందించారు.

'లిచ్ఛవి రాజకుమారులారా! నేను తథాగతుని వద్ద నుంచే వస్తున్నాను' అని చెప్పింది అంబాపాలి.

'మేమూ అక్కడికే వెళ్తున్నాం' అన్నాయి అనేక గొంతులు.

'నేనాయన్ని నా భవనానికి ఆహ్వానించాను' అని చెప్పింది అంబాపాలి.

వారందరూ నిశ్చేష్టులైపోయారు. 'తథాగతుడు రేపు అంబాపాలి భవనంలో ఆతిథ్యం స్వీకరిస్తారు. రాజపురుషులారా! నేను దీనికి మిమ్మల్ని కూడా ఆహ్వానిస్తున్నాను' అన్నది అంబాపాలి గర్వంతో పొంగిపోతూ.

ఇహ అక్కడికి వెళ్ళటం వృథాయే.

'అందుకు మా అభినందనాలు! కాని నువ్వా అవకాశాన్ని మా కివ్వలేవా?' అని అడిగారు వారందరూ అంబాపాలిని.

'వీల్లేదు.'
'ఏదైనా ప్రతిఫలం కావాలా?'
'వద్దు.'
'ఒక లక్ష మద్యం.'

'వద్దు' అంబాపాలి చిరునవ్వుతో వారివంక చూస్తూ 'మీ కింకా నమ్మకంలేదా ?' అని అంది.

'వైశాలి పౌరస్వత్వం దృష్టితో నువ్వు మొదటి ఆతిథ్యావకాశాన్ని పరిషత్తుకు ఇవ్వాలి' అన్నాడు భీమ సేనుడు.

అంబాపాలి తన రథాన్ని ముందుకు పోనిస్తూ 'రాజ పురుషులారా! ఇంత కుతూహలం ఎందుకు ? అయినా, మీరు వారినే మాటతప్పమని కోరవచ్చు' అంది.

అని ఆమె వారికేసి విజయగర్వాలతో చూసి కిలకిల లాడుతూ ముందుకు సాగిపోయింది.

ప్రతి సంవత్సరం ఆమెకు వసంతోత్సవ పర్వదినాన లభించే విజయానికీ, ఇవాళ లభించిన విజయానికీ ఎంతో భేదం వుంది. అది ఒక విలాసిని విజయం. అది ఆత్మకు అపజయమే. రూపానికే విజయం. ఇవాళ రూపం ఆత్మ ఎదుట అపజయం పొందింది. ఆమె పృథివిపై ఎంతో ఉన్నతశిఖరా న్నందుకున్నట్లు భావించింది. అదృష్టం ఆమెని బుద్ధుని మార్గంలో తెచ్చి పడవేసింది. ఆ రాత్రి అంబాపాలికి సంతో షంతో నిద్రేలేదు. క్షణ మొక యుగంగా కనిపిస్తోంది. ఎప్పుడు తెలవారుతుందా, ఎప్పుడు ప్రభువు వస్తారా అనే ఆదుర్దా ఎక్కువయింది. బుద్ధుని వ్యక్తిత్వం ఆమె నెంతగానో ఆకర్షించింది.

మరునాడు బుద్ధుడు వచ్చాడు. వైశాలీ సర్వశ్రేష్ఠ సౌందర్యవతి ఎంతోదూరం ఎదురేగి ఆయన పాదాలపై పడింది.

బుద్ధుని వెనుకనే వస్తోన్న రాజపురుషులు ఆమెకు వినిపించేట్లు 'అంబిక మనను ఓడించింది' అన్నారు.

కాని అంబాపాలికి అదంతా వినే అవకాశమెక్కడుంది? ఆమె బుద్ధునికొరకు భోజనపు ఏర్పాట్లు చేయడంలో మునిగిపోయింది.

భవనం రాజపురుషులతోనూ, ప్రేక్షక సమూహం తోనూ నిండిపోయింది. భోజనానంతరం అంబాపాలి బుద్ధుని చరణాలకు నమస్కరించింది. ఆమె ముఖమండలంలో ఒక విధమైన సాత్వికదీప్తి వుంది.

తథాగతుని పవిత్ర పాదధూళి పొంది నేను ధన్యురాల నయ్యాను. నేను నా భవనాన్ని బౌద్ధసంఘానికి – దానికి ప్రధాన వ్యక్తి అయిన బుద్ధుని కిస్తున్నాను. ఆర్యపుత్రులు దానిని స్వీకరించాలి–'

జనమంతా హర్షధ్వని చేశారు.

బుద్ధుడు చిరునవ్వు నవ్వి గంభీరంగా 'పుత్రీ! నీ యీ దానం నాకు అంగీకారమే' అన్నాడు.

ఆయన మహానముద్రను, ఆయనలో వున్న ప్రతిభా స్పర్శను పొంది అంబాపాలి హృదయం నర్తించింది.

సాయంత్ర మవుతూ వుండగా అంబాపాలి దాన. పత్రాన్ని తీసుకొని, రాజాజ్ఞ పొంది ఆరామానికి చేరుకుంది దానపత్రాన్ని బుద్ధుని చరణాలముం దుంచింది.

మహాత్మబుద్ధుడు ఆకస్మికంగా ఏదో గాఢాలోచనలో లీనమైపోయాడు. ఆయన ఆమె శిరముపై చేయి వుంచి 'నువ్వేమి కోరుతున్నావు ?' అని అడిగాడు.

'శాంతి.'

బుద్ధుడు దరహాసం చేశాడు. 'ప్రతిదీ వ్యక్తివద్దకు వస్తుంది. అతనికి శాంతి లభిస్తుంది. కాని ఆ శాంతి అయస్కాంత అగ్నివలె దానంతటదే లోనినుంచి పుట్టుకొస్తుంది. దాని శ్రేయము దానికే వుంటుంది.'

ఆయన ఆనందుణ్ణి పిలిచి 'ఆనందా! నువ్వు అంబాపాలికి బౌద్ధమతాన్ని గురించి తెలియజెయ్యి' అని చెప్పారు.

'భిక్షువులారా! తథాగతుని ధర్మంలో చిక్కులనేవేవీ లేవు. అది అందరికీ అపరిచితమైన మార్గమే. అది మీ హృదయమే చెప్తుంది, మీ సైగలే చెప్తాయి, స్వచ్ఛమైన జ్ఞానంతో దానిని మీరు తెలుసుకోగల్గుతారు. దీని అవసరం వున్న ప్రతి వ్యక్తికీ మీరు నా యీ సరళజీవిత మార్గాన్ని బోధించండి.'

## 25

క్రమంగా అంబాపాలి సంఘసన్యాసుల, సన్యాసినుల యందు ఆసక్తి కనపర్చసాగింది. వారి జీవితవృత్తాన్ని తెలుసుకొని ఆమెహృదయం ఉల్లాసంతోనూ, ప్రేమికులతోనూ నిండిపోయేది. 'పుత్రీ! రూపము, దానివల్ల ఉత్పన్నమయ్యే ఉన్మాదము దుఃఖకారణాలు. తథాగతుని ఈ పుత్రిక ఆ విషయాన్ని

గుర్తెరిగింది' అని శుభ కాంతిహీనమైన తన కళ్ళతో ఆమె ముఖంలోకి చూస్తూ అనేది. దానితో ఆమె ముఖం దీప్తి జెందేది.

శుభను అంబాపాలే తల్లిగా భావించేది. ఆమెనుంచి ఎన్నో విషయాలు నేర్చుకునేది. ఆమె ఉపదేశిస్తూ వుంటే అంబాపాలి ఆనందంతో వింటూవుండేది. జీవితము, భోగము, వైరాగ్యము, ఇంకా తథాగతుని విషయంలో బౌద్ధసన్యాస సన్యాసినులు సంభాషించుకునేప్పుడు ఆమె అక్కడకు చేరి వింటూ వుండేది. క్రమంగా కుమారగుప్తునియందు ఆమెకు వున్న మోహం తగ్గిపోసాగింది. అతడిప్పుడు వైశాలి సంఘంలో ప్రముఖ బౌద్ధభిక్షువు.

బుద్ధుని వెంట వచ్చిన సన్యాస - సన్యాసినుల్లో అంబాపాలి ఒక సన్యాసిని అధికంగా ఆకర్షించింది. ఆనందుడు ఉపదేశాలిచ్చేప్పుడు మౌనంగా, నీడలాంటి ఒక విషాద ముఖం అతడికేసి చూస్తూవుండేది. కాసేపటికి ఒక పసుపు వన్నె యువతి అతడి చరణాల ముందుకు వచ్చి కూర్చుండేది. అతడు ఉపదేశం ముగించేంతవరకూ ఆమె అక్కడే కూర్చుని అతడి పాదాలకేసే చూస్తూ వుండేది.

ఉపదేశం ముగించిన తర్వాత ఆనందుడు ఆమెకేసి చూసి 'ప్రకృతీ! నువ్వర్థం చేసుకున్నావా?' అని అడిగేవాడు.

యువతి నయనాలు దరహాసంతో వికసించేవి. అతడికేసి చూసేవి. నోరేమీ జవాబు చెప్పేదిగాదు. కానీ, ఆనందుని ప్రశ్నకు అన్నింటికంటే మించిన సమాధానం - ఆమె యొక్క ఈ మౌనమే.

ఒకరోజున అంబాపాలి మామూలుగా ఆనందుని ఉప దేశం వింటూవుంది. ప్రకృతి సమీపంలోనే కూర్చుని వుంది. మౌనంగానే వుంది. ఆకస్మికంగా ఆమె బిగ్గరగా అరుస్తూ - 'వద్దు, వద్దు. అమ్మా! మందారపూమాల వుండనివ్వు. అమ్మా! వుండనివ్వు' అంది.

అంబాపాలి ఆమెకేసి చూసింది. ఆమె చాలా ఉద్రే కంగా వుంది. ఆమె నేత్రాలు ఎర్రబడుతున్నాయి. ఆమె యింకా అరుస్తూనేవుంది. ఆమె ఇంకా అరుస్తూనే వుంది— 'నే నా మహాత్ముని చూస్తున్నాను. అమ్మా! ఆయన వస్తు న్నారు, అదిగో వస్తూవున్నారు. సూర్యచంద్రులు, గ్రహ నక్షత్రాలకంటెకూడా ఎంతో దూరాన వున్నారు; వా రీ క్షుద్రురాలికోరకే వస్తున్నారమ్మా! నేనుతప్ప మరెవరు పూజిస్తా రాయన్ని? ఇంత ఉన్నతాసనంపై మరెవరు కూర్చో బెడతా రాయన్ని? అదిగో వైశాలి సింహద్వారంకేసి సాగి పోతున్నారు. వస్తున్నారు, వస్తున్నారు - నదిలోని నావలో నే నాయన్ని చూస్తున్నాను.'

ఆనందుడు ఆమెను పట్టుకున్నాడు, ఆమె అదేవిధంగా పిచ్చిగా అతడికేసిచూస్తోంది. ఏదో అద్భుతమైన కలగంటూ ఈ ప్రపంచాన్నే మర్చిపోయినట్లుందామె.

సన్యాస సన్యాసినులందరూ ఆమె చుట్టూ మూగారు.

అంబాపాలికి చాలా ఆశ్చర్యం కలిగింది. 'ప్రకృతికి ఉన్మాదరోగం వుంది' అని చెప్పిందాక సన్యాసిని.

ఆనందు డొకసారి ఆమె కేసి చూసి, తర్వాత విచారంగా తలవంచుకుని, తన చేతులపై మృతప్రాయంగా పడి వున్న ప్రకృతి ముఖం కేసి చూశాడు. 'భిక్షులారా! దూరంగా నిలబడండి' అని చెప్పాడు.

తన ఉత్తరీయంతో అతడు ఆమెకు విసరసాగాడు. అంబాపాలి ఆమె ముఖంమీద నీళ్ళు చిలకరిస్తోంది.

కొద్ది క్షణాలకు ప్రకృతి కళ్ళు తెరచిచూసింది. ఆమె విస్మయంతో తనచుట్టూ కలయజూసింది. 'నేను దర్పణం విరగ్గొట్టానా? ఆయనస్పర్శతో నా పాపపరిహారమైందమ్మా! ఆయన రేణువునైన నన్ను పృథ్వివలె భరించి హృదయాన చేర్చుకున్నాడు' అని అంటూ మళ్ళీ ఆమె కేకలు వేయసాగింది... 'వుండనివ్వు, వదిలెయ్యి, చండాలినీ! ఆయనకు తపోభంగం కల్గించవద్దమ్మా! అయ్యో, ఆయన ముఖంలోని శాంతి మాయమైపోయింది. ఆయన ముఖమండలంలో ఏదో తీరని హృదయావేదన వ్యాప్తిచెందింది. హంతకురాలా! వదిలెయ్!'

మళ్ళీ ఆమె పూర్తిగా తెలివిదప్పి పడిపోయింది. క్రమంగా ఆమె ముఖంలో ఒక ప్రశాంతకాంతి విరిసింది.

అంబాపాలి ఆనందుని ముఖం కేసి చూసింది. అతడి ముఖంలో విషాదచ్ఛాయలు నిండివున్నాయి. ఒక క్షణంసేపాగి అతడు చిరునవ్వుతో 'అంబాపాలీ! వీడు ప్రకృతియొక్క విగత జీవిత నాటకాన్ని వీక్షిస్తున్నాడు. ఈ పాత్రను నేను' అన్నాడు.

అంబాపాలి అతడికేసి విస్మయంతో చూసింది. ఆనందుడు స్వగతం మాట్లాడినట్లు నెమ్మదిగా 'ఈమె నన్ను ప్రేమిస్తూవుంది' అని అతడి నోటినుంచి అప్రయత్నంగా వెలువడింది.

'సాధనాపథంలో ఆనందుణ్ణి దృఢంగా వుంచే బుద్ధునికి జయం! శాంతి, శాంతి, నమో బుద్ధాయ' అన్నాడు తర్వాత బిగ్గరగా.

ప్రకృతికి శుశ్రూష చేయటానికి అంబాపాలిని అక్కడ వదలి ఆనందుడు వెళ్ళిపోయాడు.

ఆయన హృదయంలో సంఘర్షణ జరుగుతుందా?

మెల్ల మెల్లగా ప్రకృతి మేల్కొంచింది. ఆమె కళ్ళల్లో ప్రశాంతత వుంది. ఆమె తనచుట్టూ చూసేసరికి ఒక్క అంబాపాలి కన్పించింది. ఆమె నెమ్మదిగా లేస్తూ 'నేను నిద్ర పోయానా?' అని అడిగింది.

అంబాపాలికి ఆమెయందు దయకల్గింది. 'సోదరీ! నువ్వు మతిచెడినదానివలె ఏదేదో మాట్లాడావు' అని చెప్పింది.

'నేను చాలా భయంకర స్వప్నం చూశాను' అని ప్రకృతి చిరునవ్వు నవ్వింది. సంఘారామం బైట శ్రమణులు పాడుతూ వున్నారు—

బుద్ధో సుసుద్ధో కరుణ మహార్ణవో!<br>
యోచ్చన్త సుద్ధవ్వర్ జ్ఞాన్ లోచనో॥<br>
లోకస్స పాపూసకిలేస - ఘాతకో।<br>
వన్దామి బుద్ధం అహమాదరేణ తం॥

అకస్మాత్తుగా ఏదో కలవరం ప్రారంభమైంది. సమీపమందున్న గోశీరస ఘంలో దీక్షాకార్యక్రమం జరుగుతోంది. వేల కంఠాలు కలిసి ఉచ్ఛరిస్తున్నాయి—

'ధర్మం శరణమ్ గచ్ఛామి'

సంఘం శరణమ్ గచ్ఛామి'

'బుద్ధం శరణమ్ గచ్ఛామి.'

అంబాపాలి ప్రకృతి అక్కడికి వెళ్ళి చూశారు. అంబాపాలికి అక్కడి దృశ్యం చూసి చాలా ఆశ్చర్యం కల్గింది. దస్యుశ్రేష్ఠుడయిన నృసింహుడు కేశముండనం కావించుకుని కుపురంగువస్త్రాలు ధరించి బుద్ధుని ఎదుటనిల్చొని వున్నాడు. అతడి వెనుకనే ఆశ్రమమంతా దస్యులతో నిండివుంది. దీక్షాకార్యక్రమం ముగిసింది.

నృసింహుడు బుద్ధునియెదుట చేతులు జోడించి 'మహాబోధిసత్వుడు తన పాదసన్నిధిని నా కాశ్రయమిచ్చాడు. నా జీవితం ధన్యతచెందింది. నా గత జీవిత కళంకమంతా ఆయన కరుణార్ద్రజలంతో పునీతమై శుభ్రపడింది. నేనిహ నిష్కళంకమూ, నిర్మలమూ అయ్యాను. నా జీవితంలో ఒక కంటకం బాధిస్తూవుండేది ! ఇవ్వాళ దానిని కూడా నిర్మూలనం చేసి వేస్తున్నాను' అన్నాడు. అని అతడు మౌనం వహించాడు.

బుద్ధుడు ప్రశాంతంగా మందహాసం చేశాడు.

నృసింహుడు మళ్ళీ చెప్పనారంభించాడు. 'నేనివాళ వైశాలి అమాత్యులైన స్వర్ణసేనుని క్షమార్పణ కోరుకున్నాను. ఇప్పుడిహ ఆయనయందు నా కెంతమాత్రం

ద్వేషం లేదు. నేను క్రోధ ప్రతీకారాలతో ఆయన ఆత్మను సంహరించాలనుకున్నాను. ఇప్పుడు బుద్ధుని ఉపదేశం నాకు మరొక మార్గాన్ని చూపించింది. అమాత్యునియందు నా హృదయంలో దయాభావం ఏర్పడింది. ఆయన బలాత్కారం చేసిన స్త్రీకి జనించిన ఆయన పుత్రుణ్ణి నేను.'

బుద్ధుని ఉపదేశం వినటానికి వచ్చిన వైశాలి రాజపురుషులు స్తబ్ధులైపోయారు.

నృసింహుడు, అతనితోపాటు మిగిలిన దస్యులు - 'నమో బుద్ధాయ' అని ఎలుగెత్తి నినదించారు.

శ్రమణుడు మంత్రాన్నుచ్చరించారు - బుద్ధో సుబుద్ధో కరుణ మహార్ణవో...'

నృసింహుడు అంబాపాలి కేసి చూసి దరహాసం చేశాడు. అతడి రహస్యం ఇంతవరకూ ఆమెకే తెలుసు. ఇక అది వైశాలీ అంతటా తెలుస్తుంది. అతడు తన జీవితంలో ఒక నూతనాధ్యాయాన్ని ప్రారంభించుకున్నాడు. ఇదే అతడి హృదయాని కనగతమౌతోంది.

# 28

నృసింహుడు దీక్ష పొందటం చూసిన తర్వాత అంబాపాలిలో కూడా తీవ్రమైన సంచలనం కల్గింది. మనసా నాడే ఆమె కూడా దీక్ష పొందింది...ఇప్పుడా సమయం రానే వచ్చింది - అనుకుందామె.

ఇంటికివెళ్ళి ఆమె చంద్రసేనను పిలిచింది. భవనపు తాళంచెవులను ఆమెచేతికిస్తూ – 'ఇదిగో, ఇది నీకు అంబాపాలి కానుక !' అని అంది.

ఆమెకు విస్మయం కల్గింది.

'ఇందులో ఆశ్చర్యపడాల్సిందేమీ లేదు చంద్రసేనా! ఈ భవనము, ఈ వైభవము ఇహ వీటితో అంబాపాలికి పనేమీ లేదు. వీటినిగురించి ఇంకా అనుభవమేమీ లేని మీకు వీటిని వప్పగించి వెళుతున్నాను' అని ఆమె సూర్యమణిని పిలిచింది.

'నువ్వు చంద్రసేనను ప్రేమిస్తున్నావా ?' అని అడిగింది.

అని అడిగి ఆమె దరహాసం చేసింది. సూర్యమణి మౌనం వహించాడు.

ప్రేమించటం పాపమేమీకాదు. నేటినుంచి ఈ చంద్రసేన అంబాపాలి వైభవానికి యజమానురాలు. ఆమె కుల రూపాలనుగురించి నీకు తెలుసు. ఆమె ఇహ స్వతంత్రురాలు. ఇప్పుడిహ నువ్వామెను వివాహ సూత్రంతో బంధించవచ్చు' అని అంది అంబాపాలి.

మరునాడు కేశముండనం కావించుకుని కాశేయ వస్త్రము ధరించి ఆమె బౌద్ధ ఉపదేశకురాండ్రు, సన్యాసినుల వెంట వైశాలి రాజమార్గాన బయలుదేరింది. ఆమె వెనుక జనం పెద్ద గుంపుగా చేరారు. రాజపురుషులు ఆమెను చూసేందుకు వస్తున్నారు. బౌద్ధశ్రమణులు ఆమె నిశ్చయానికి అభి

నందిస్తున్నారు. సన్యాసి అంబాపాలి విలాసవతి అంబాపాలి కంటే ఎంతో అందంగా వుంది. ఇప్పు డామె సౌందర్యం సాధన అనే అగ్నిలో ఇంకా మెరుగులు తేలుతుంది.

ఆనాడు నగరంనుంచి తిరిగివచ్చి ఆమె కుమారగుప్తునితో 'చూస్తున్నావా, మనకు తెలియకుండానే ఆ చక్రంలో ఎక్కేశాము. ఇహ మనం దీనినుంచి దిగలేము' అని ంది.

కుమారగుప్తుడు ఆమెకేసి ప్రశంసాసూచకంగా చూశాడు.

శాక్యముని చాతుర్మాస్యము (ఆషాఢశుద్ధము మొదలు కార్తికశుద్ధమువరకు చేసెడు యజ్ఞము) ముగియగానే మల్లదేశానికి వెళ్ళిపోయూరు. ఆయనవెంట ఆనందుడు, ప్రకృతి, ప్రధాన బౌద్ధసన్యాసులు, సన్యాసినులు కూడా వెళ్ళారు.

అటు అజాతశత్రువంటే వైశాలికి రోజురోజుకు భయం మితిమీరసాగింది. ఇప్పు డిహ అతడి సంబంధాలు మగధతోనే. చంపానుకూడా జయించాడు. ఇహ మిగిలివుంది మల్ల వృజ్జి ప్రజాతంత్రాలు మాత్రమే. వాటిల్లోకూడా ఆంతరంగికంగా అసంతోషము, అసంతృప్తి, అంతఃకలహ బీజాలను వెదజల్లటం జరిగింది. కరువుకాలం వెళ్ళిపోగానే వైశాలి ఆర్థికస్థితి కొంత బాగుపడినప్పటికి దాని ప్రభావం మాత్రం అన్ని వర్గాలమీద చ్చుగుద్దుకుంది. పూర్వంలాంటి చైతన్యం మళ్ళీ జనంలో రానేలేదు.

వైశాశాలిక్రమంగా బౌద్ధులనిలయమైపోయింది. ప్రజలోక నూత్నధర్మోత్సాహంతో నిండిపోయూరు. ప్రతి పక్షం పక్షం ఉద్యానంలో సమావేశాలు జరుగుతూ వుండేవి :

అందులో అనేక ధార్మిక విషయాలనుగురించీ, తథాగతుని ఆదర్శాలనుగురించీ అనేక చర్చలు జరుగుతూ వుండేవి. సమావేశం సమాప్తం కాగానే సన్యాసినులు భక్తిశ్రద్ధలతో నిండివున్న భజనసంకీర్తనలు కావించేవారు.

సంఘంలో అంబాపాలి ప్రముఖసభ్యురాలు ప్రతి సమావేశం జరిగినప్పుడు ఆచార్యుని ఉపదేశం సమాప్తమై, సన్యాసినుల భజనలు ముగిసిన తరువాత ఆమెనుకూడా ఏదైనా పాడుమని ప్రజలు ఎంతగానో కోరేవారు. ఎన్నో ప్రార్థన గీతాలు స్వయంగా ఆమెరచనలే అయివుండేవి. ఆమె పాడు నప్పుడు ప్రజలు మంత్రముగ్ధులై వింటూ వుండేవారు.

ఆక్రమణ భయం, నూత్న ధర్మదీక్షా ఉత్సాహాల మధ్య వైశాలి క్రమంగా సంవత్సరాల చరణ చిహ్నాలను విడిపుచ్చుతూ ముందుకు సాగిపోతోంది.

ఒకనాడు సూర్యమణి విహారానికి వచ్చి అంబాపాలిని కలుసుకున్నాడు. 'కొందరు పరిషత్తుసభ్యులు అజాతుని సింహాసనులతో సంబంధాలు కలిగివున్నట్లు నాకు నమ్మకంగా తెలియవచ్చింది. వారికి వైశాలియందూ ఆశక్తిలేదు, వృజ్జి ధర్మప్పు ఆలోచనా లేదు. పరిస్థితు లంతబాగుగా లేవు. రాజ గృహ ఆక్రమణ జరిగేటట్లయితే గణతంత్రపుభవిష్యత్తు ఘోర అంధకారమయ మవుతుంది. ఇటువంటి పరిస్థితిలో నమ్మేల్సి ఏమిచేయుమని నీసలహా' అని అడిగాడు సూర్య మణి అంబాపాలిని.

అంబాపాలి దరహాసంచేసింది. ఆమె కించిత్ పరిహాసంగా 'భిక్షువృత్తిని స్వీకరించిన అంబాపాలికి మీ రాజకీయాలేమి బోధపడతాయి?' అని అంది

సూర్యమణి గంభీరంగా 'ఇదంతా తలక్రిందులవిషయం కాదు, అంబాపాలీ! ఈ తరుణంలో మీ బౌద్ధసన్న్యాస - సన్న్యాసినుల కేమీ బాధ్యత లేదా? నువ్వు, నిన్న మొన్నటి వరకు వైశాలిరాష్ట్రపు ప్రముఖవ్యక్తి వేగదా!' అని అతడు మౌనం వహించాడు. ఒక క్షణకాలం ఎవరూ ఏమీ మాట్లాడలేదు. ఇద్దరూ మౌనం వహించారు.

తర్వాత అంబాపాలి సూర్యమణి నుద్దేశించి 'ఇంత మంది ప్రజలు ధర్మపరివర్తన చెందటంవల్ల రాష్ట్రం బలహీన పడిపోయిందని మీ రనవచ్చు. అది సంభవంకూడా. కానీ, బుద్ధభగవానుని నిదానము ఆత్మరోగాలకోసం, రాష్ట్రరోగాల కోసం కాదు. సమయంవచ్చినప్పుడు సన్న్యాసులు ఖడ్గధారణ చేయరా!' అని అంది.

సూర్యమణిముఖంలో కించిత్ హాస్యరేఖలు పొటమరించాయి. 'నా కా విశ్వాసం లేదు. తథాగతుని ధర్మము ఒక్కసారిగా మానవునిమూలాన్నే పరివర్తన చేయాల్సిన అవసరంలేదు. ఇదుగో, ఈ అజాతశత్రువునే చూడు. అతడు మాత్రం బౌద్ధుడుకాడా? ప్రసేనజిత్తు, అతడి ప్రజలు బౌద్ధుల్లు కారా? మరి భగవానుడు అహింసను అన్నింటికంటె గొప్ప తపస్సుగా ఎంచలేదా? అటువంటిపరిస్థితుల్లో ఒక బౌద్ధ రాష్ట్రం వరొక బౌద్ధరాష్ట్రం రక్తపాతంలో ఓలలాడాలన్న

ఉవ్విళ్ళూరటమనేది ఏమిటిమరి ! కానీ, ఎదురుగా కన్పిస్తున్న దానిని దృష్టిలోవుంచుకుచూసినా రాష్ట్రం క్రమక్రమంగా కేంద్రచ్యుతి చెందిందనికూడా చెప్పవచ్చు. ఎన్నికసమయంలో ఇప్పుడా వుత్సాహమూ కన్పించటంలేదు, విద్రోహలక్షణాలూ గోచరించటంలేదు. రాష్ట్రంయొక్క అంతరాత్మ బాగా అలసటచెందినట్లు, నిద్రపోతున్నట్లుగా వుంది. వైశాలి రాష్ట్రంయొక్క పూర్వపు రాజకీయఔన్నత్యాన్ని దృష్టిలో వుంచుకునిచూస్తే ఇదొక పెద్ద విడంబనమే అవుతుంది' అన్నాడు సూర్యమణి.

అంబాపాలి ఎదురుగా ఆకాశంలో ఎగురుతూన్న కొంగలబారుకేసి చూస్తోంది ఆషాఢపూర్వపు మేఘాలు నల్దిశల వ్యాప్తిచెందుతున్నాయి. క్రమక్రమంగా వెలుగు సన్నగిలుతోంది.

'మారిపోయిన నగరజీవితాన్ని నేను గమనించాను. మనం మగధఆక్రమణను ఎదుర్కొనజాలమన్నది నిజం కావచ్చు' అంది అంబాపాలి.

'అయితే మన మేంచేయాలి మరి ?'

'ఈ విషయంలో పరిషత్తు అభిప్రాయం ఏమిటి ?'

'నాకు పరిషత్తుయందు ఏమాత్రం నమ్మకంలేదు. అందులో మోసకారులు, పిరికిపందలు, ముఖస్తుతిపరాయణులు నిండివున్నారు. అజ్ఞానంలోవున్న ప్రజలమదతును, అనుకూలాభిప్రాయాన్ని 'పొందటం ఎంత తేలికయో నీకు

తెలుసు. ప్రజలు ఇవాళ ఎవరైతే తను సర్వంగా భావించి శిరసావహిస్తారో వాళ్ళనే రేపు తనుకాళ్ళతో మట్టగించి వేస్తారు కూడా. మనం మట్టగించివేయబడతామేమో ననే ఇవాళ్టి భయం.

'నిరాశచెందాల్సిన పనేమీ లేదు సూర్యమణీ! మీకు శీఘ్రంలోనే మార్గం లభిస్తుంది. ఈ విషయాన్ని గురించి నేను కుమారగుప్తునితోనూ. నృసింహునితోనూ సంప్రదిస్తాను. ఇప్పటికైనా వైశాలి మా మాతృభూమే' అని అంబాపాలి ఆ ప్రసంగాన్ని మార్చుతూ 'చంద్రసేన అనారోగ్యంతో బాధపడుతోందని విన్నాను. నువ్వామెను తీసుకురాలేదు!' అంటూ ఆమె దరహాసం చేసింది.

సూర్యమణి సిగ్గుపడ్డాడు; అతడు కొంచెం తేరుకుని 'చంద్రసేన వచ్చినప్పుడు తన అనారోగ్యానికి సంజాయిషీ చెప్పుకుంటుంది మీకు దేవీ! మీ పాటలు చాలా గుర్తున్నాయామెకు. అవంటే ఆమె కెంతో ఇష్టం' అన్నాడు.

'నా పాటలా!'—అని అంబాపాలి మధురహాసంతో 'తథాగతుని పాదాలపై అర్పించబడిన నా పుష్పాంజలు లవి చంద్రసేన వాటిని పాడుతుందాయేం?' అని అడిగింది.

'అవును' అని ఉత్సాహంగా, ఎంతో గర్వపడుతూ సిగ్గుగా అన్నాడు సూర్యమణి. 'ఆమె వాటిని పాడుతుంది. నిన్న అంగడిలో ఒకక్రొత్తవీణనుకూడా తీసుకుంది. కౌశంబీ నుంచి ఒక వీణాశిల్పి వచ్చాడు...'

అంబాపాలి మాటమధ్యలో అందుకుని 'కౌశంబి వీణ విద్యకు పుట్టిల్లు. నేనొక పర్యాయం ఉదయన మహారాజు గారు వీణవాయించగా విన్నాను' అంది.

'ఈ వీణాశిల్పి ప్రసిద్ధమైన వారి 'హస్తికాంతరవీణ'ను తయారుచేశాడు. చంద్రసేన ఆ వీణను మీ వద్దకు తీసుకు వెళ్ళమని చెప్పింది' అన్నాడు సూర్యమణి.

ఒక క్షణకాలం అంబాపాలి ముఖం నల్లనైంది. తర్వాత తేరుకుని ఆమె 'అంత కష్టపడవద్దని చెప్పండి చంద్రసేనతో నేను త్వరలోనే అక్కడికి వస్తాను. అప్పుడు ఆమె బహూకరించే ఆ వీణను స్వీకరిస్తాను' అని అంది.

ఇంతలో ఒక శ్రమణబాలిక ప్రవేశించి 'దేవీ! స్నానమాచరిస్తారా?' అని అడిగింది.

అంబాపాలి లేస్తూ 'అయితే సూర్యమణీ! నేనావిషయాన్ని గురించి ఆలోచించి ఏదోఒకటి స్థిరపరుస్తాను. ఆకాశమంతటా భయంకరంగా మబ్బులు కమ్ముకుంటున్నాయి. కాస్సేపట్లో చినుకులారంభమవుతాయి. మరి నువ్వు తిరిగి వెళ్తున్నావా?' అని అడిగింది.

'అవును దేవీ, నేను నగరానికి చేరుకోవల్సిందే' అన్నాడు సూర్యమణి. అంటూ అతడు విహారంలో తనరథం ఆగి వున్నవైపుకు చేతితో సంజ్ఞచేశాడు.

'వెళ్ళిరా, చంద్రసేనకు నా ఆశీర్వాదాలందజెయ్యి' అని అంబాపాలి కుమారగుప్తునితో కలిసి ఆ గృహాన్ని వదలి స్నానాగారంవేపుకు వెళ్ళింది.

మధ్యాహ్నసమయమే అయినా దట్టంగా, నల్లని నేరేడుపండురంగుగల ఆషాఢమేఘాలు విజృంభించటంతో సాయంసమయమైనట్టు తోస్తుంది.

## 27

వైశాలినగరంలో స్వర్ణకారుల వీథియందలి ఒక అంగడికి సంబంధించిన విషయం.

హేమంతఋతువు. ప్రభాతసమయం. అప్పటికే సూర్యుడు నడినెత్తిపైకి వచ్చాడు. నగరమంతటా చాలా కోలాహలంగావుంది. ముఖ్యంగా వీథుల్లోనూ అంగళ్ళలోనూ జనసందోహపుసందడి ఎక్కువగా వుంది. అక్కడ కన్పించే అనేకమంది విదేశీయుల ఇతరరాష్ట్రాల వ్యాపారులు, వారి విచిత్రవస్తువులు ప్రజల్ని హటాత్తుగా ఆకర్షిస్తున్నాయి.

రత్నసేనుడు తన అంగడి తెరుస్తూవుండగానే ఒక వ్యక్తి అతిసుందరమైన ఒక బంగారు కంకణాన్ని తీసుకుని అతనివద్దకు వచ్చాడు.

'దీనిని తీసుకుంటారా?'

'ఏమిటది?'

'కంకణం.'

'ఇలా ఇవ్వు.'

రత్నసేనుడు ఆ వ్యక్తిచేతినుండి కంకణాన్ని తీసుకుని గీటురాయిపై రుద్దిచూచాడు. ఆ తర్వాత దానిని తూకం కూడా వేశాడు.

'నాకు దీనికి బదులుగా నందసువర్ణాలు కావాలి' అన్నాడు దానిని అమ్మటకు వచ్చిన వ్యక్తి.

ఆ మాటతో రత్నసేనుడు దానిని తిరిగి ఇచ్చివేస్తూ 'అంత విలువ చేయదది' అని చెప్పాడు.

'అయితే ఎంతవుతుంది?'

'నేను దీనికిగాను మీకు యాభై సువర్ణాలుమాత్రమే ఇవ్వగలను.'

'దీనికి మీరు పత్రం వ్రాసివ్వాలి. ఈ విషయంలో అనుసెట్టిగారు చాలాగట్టిగా వుంటారని మీకు తెలిసిందేగా' అన్నాడు రత్నసేనుడు.

'పత్రం వ్రాసిస్తాను. కానీ...కొంచెం, అధికంగా ఇప్పించండి' అన్నాడా వ్యక్తి.

రత్నసేనుడు బంగారు కంకణాన్ని వేలితో త్రిప్పుతూ 'సువర్ణంధర ఇప్పుడంతలేదు. మీకు తెలిసివున్న విషయమేగా. కాటకసమయమందు...' అని అన్నాడు.

ఆ వ్యక్తి మధ్యలోనే అందుకుని 'సరే, ఏదన్నా కానివ్వండి, మీరు నాకు డెబ్బదిముద్ర లివ్వగలరా?' అని అడిగాడు.

రత్నసేనుడు కాస్సేపు ఆలోచించాడు తర్వాత అతడు ఒక పల్చని భోజపత్రాన్ని, లేఖినిని అతడిముందుంచాడు.

ఆవ్యక్తి వాటిని అందుకుని వ్రాయ నారంభించాడు రత్నసేనుడు అతడికేసి తేరిచూస్తూ హఠాత్తుగా 'మీరు ఇంతకుపూర్వం ఒకపర్యాయం వచ్చారా?...చాలా సంవత్సరాలై వుంటుంది' అన్నాడు.

ఆ వ్యక్తి తల పైకెత్తకుండానే 'అప్పుడు నేను తామ్రపర్ణినుంచి తిరిగివస్తున్నాను' అని బదులు చెప్పాడు.

'అది చాలా విచిత్రమైన ప్రదేశం.'

ఆవ్యక్తి అదేవిధంగా వ్రాస్తూ తలవంచుకునే 'విచిత్ర ప్రదేశమే సెట్టీ! మేము దాని లోపలిభాగానికి ఎప్పుడూ వెళ్ళము. అక్కడ యక్షులు, రాక్షసులు వుంటారు' అని బదులు పలికాడు.

'మీరు స్వర్ణలంకను చూశారా?'

'లేదు' అని అవ్యక్తి పత్రాన్ని రత్నసేనునిముందు వుంచుతూ 'నే నక్కడకు ఒక్కపర్యాయం మాత్రమే వెళ్ళాను. రెండవసారి మానావలు కొట్టుకుపోయాయి లక్షలు నష్టమయింది. ఎక్కడిసామాను అక్కడే కొట్టుకుపోయాయి. ఆ మహాసముద్రంలో కాటకం మమ్మల్ని ఎక్కడికో విసరి వేసింది...! సరే. మీరు డబ్బు యివ్వండి!' అన్నాడు.

రత్నసేనుడు నాణాలు లెక్కించి ఆ వ్యక్తిముందుంచాడు.

ఆ వ్యక్తి వాటిని తనఉత్తరీయంలో ముడుచుకుంటూ నావికుని జీవితం చాలా కష్టాలతో కూడి వుంటుంది సెట్టీ!' అని అన్నాడు.

'నువ్వు ఎవరినావపై నావికుడుగా పనిచేస్తున్నావ్?'

'మహాసెట్టి నాగరాజుగారినావమీద పనిచేస్తున్నాను' అన్నాడా వ్యక్తి.

'ఓహో! వారా? వారు స్వర్ణభూమితో వ్యాపారం చేస్తున్నారు?' అన్నాడు రత్నసేనుడు.

'అవును. వారే, వారికి చాలానావ లున్నాయి!' అన్నాడావ్యక్తి వెళ్తూవెళ్తూ.

కాస్సేపాగిన తరువాత ఇంకోవ్యక్తి అంగడివద్దకు వచ్చాడు. రత్నసేనుడు అతనికి నమస్కరించి 'మీరు విపణి వీధినుంచే వస్తున్నారా?' అని అడిగాడు.

'అవును' అని ఆ వ్యక్తి 'ఇ టెవరూ లేదా! అని అడిగాడు.

'లేదే!'

'ఇంద్రసేనసెట్టిగారికి ఇవాళ చాలానష్టం వాటిల్లింది. ఇహ ఇప్పు డాయన ఒక సాధారణపౌరుడుమాత్రమే! 'అని చెప్పా డా రెండవవ్యక్తి.

'ఏమిటీ? ఇంద్రసేనసెట్టియా? ఏం జరిగిందేమిటి' అంటూ ఆశ్చర్యంగా ప్రశ్నించాడు రత్నసేనుడు.

'వారినావలు ఇవాళ రెండు మునిగిపోయాయి. ఇవాళ ఆయన పాచికలేమీ పారలేదు' అంటూ ఆ వ్యక్తి దరహాసం చేశాడు. 'ఆయన సామ్రాగ్రిధర రాగాపడిపోయింది, దానితో నగరశెట్టి ఆయన్ని హెచ్చరించాల్సికూడా వచ్చింది. ఇప్పుడు నే నక్కడనుంచే వస్తూవున్నాను.'

'ఇది జూదానికి ఫలితం.'

'విపణివీధిలో వస్తువుల వెలగట్టటం జూడమా ?'

'మ రేమిటి ? క్షణకాలంలో మహా శెట్టిని దరిద్రునిగా, భిక్షుకునిగా చేయగల్గిందే, దా న్నేమనాలి ?' అన్నాడు రత్న సేన శెట్టి.

ఇంతలో కొందరు గ్రామీణ ప్రజలు రాజమార్గంగుండా తమగోవుల్ని తోలుకు వెళుతూవుండటం కన్పించింది. బానసలు తీరినట్లు చాలామంది వున్నారు.

'ఇదేమిటి, ఇంతమంది గోపాలకులు వచ్చా రెందుకో నగరానికి ?'

'మీరు ఇవాళ పరిషత్తు గ్రామమంత్రిని కలుసుకుంటారు. (చిరునవ్వు నవ్వి) ఇవి మరీ పాడురోజు లొచ్చి పడ్డాయి. వైశాలిలో సంతృప్తిగా, సంతోషంగావున్న వ్యక్తి ఒక్కడూ లేడు. వాళ్ళు పరిషత్తు విధించిన కొన్ని అవరోధాలను గురించి విన్నవించుకోవా లని వచ్చారు.'

గోపాలకులయొక్క ఆ విచిత్రసైన్యం ముందుకు సాగి పోయింది.

'గ్రామముఖ్యులను ఎవరూ లక్ష్యపెట్టటం లేదు. అందరూ నేరుగా పరిషత్తుపైనే విరుచుకుపడుతున్నారు. సమయ మంతా అద్భుతంగా వుంది' అన్నా డా వ్యక్తి. అని అతడు లేచి వెళ్ళిపోసాగాడు.

రత్నసేనుడు అతణ్ణి ఆపి 'సరే, ఒకవిషయం చెప్పి వెళ్ళు. స్వర్ణసేన మంత్రికుమారు డున్నాడే భీమసేనుడు,

అతడు సింహాపాదుల్లో కలిసిపోయాడని అంటా రందరూ, అది నిజమేనా ?' అని అడిగాడు.

రెండవవ్యక్తి సందిగ్ధంధ్వనించే గొంతుతో 'కావచ్చు. నేను చెప్తోందేమిటి ? ఈ సమయనే చాలా 'అద్భుతమైం దన్నానుగా అలా కాదంటారా ? అదీ సంభవంకావచ్చు' అన్నాడు.

ఆ రెండవవ్యక్తి వెళ్ళిపోయాడు.

అప్పటి వైశాలిస్థితినిగురించి చెప్పాలంటే, స్థైర శబ్దం ఏదైనా వుంటే అది ఈ 'అద్భుతం' అనేదే. నగర మంతటా భయము, సందిగ్ధము, అరాచకపు చిహ్నాలు స్పష్టంగా గోచరిస్తున్నాయి.

ఒకవంక ఒక పెద్దగుంపు గుమికూడివుంది.

'ఎవరు మీరు ?' అన్నాడొక వ్యక్తి.

'నేను మగలద్దకుణ్ణి.'

'ఈ గుం పేమిటి ?'

'ఇవాళ కామదేవుని పూజ చేయాలి. అందుకుగాను నగరధనికుల్నించి చందాలు వసూలుచేస్తున్నాము. మీ రెవరు ?'

'నే సాదుణ్ణి.'

సరిగ్గా ఆ సమయానికే చేత ఆయుధాలు ధరించి తూర్యధ్వానాలతో అశ్వములపై అధిరోహించిన కొందరు

సైనికులు ఆ దిక్కుగా వెడలిరి. గుంపుగూడిన జనసందోహం ఎక్కడి దక్కడ చెదిరిపోయింది. ఆ సైనికులు నగరం వెలుపలికి వెళ్తుతూవుండిరి.

'యుద్ధం జరుగుతుందా ఏమిటి ?' అన్నాడు గుంపులో నుంచి ఒకవ్యక్తి.

'బహుశా జరగవచ్చు.'

'రాజగృహంతోనా ?'

'అవును.'

నెమ్మదిగా సైనికులు ముందుకు సాగి రాజమార్గం దాటి వెళ్ళిపోయారు.

'ఇంతకుముందు మీతో మాట్లాడుతున్న వ్యక్తి ఎవరు ?' అని రత్నసేనుడు తనచెంత నిలబడివున్న మరొక వ్యక్తిని ప్రశ్నించాడు

'పాషణ్ కోట్టక్. ఇతడు నూతన్నవిహారంలో పనిచేస్తున్నాడు.'

'అబ్బా, ఎంతమందో క్షత్రియులు బౌద్ధభిక్షులైపోయారు; అందుకనే వైశాలి ఇంత నిరుత్సాహంగా నిరాశగా కన్పిస్తుంది. పౌరులందరు యుద్ధం చేయలేరు' అన్నాడు రత్నసేనుడు.

అతని ప్రక్కనవున్నవ్యక్తి 'ఆ పెద్దపెద్దవిషయాలేవీ నాకు తెలియవు. కానీ, ఒకటుంది. బంగారంధర బాగా పడిపోతూంది. నిన్న రోజులతా నే నిలాగే కూర్చుని వుండాల్సి వచ్చింది. 'అని అన్నాడు.

'భిక్షు నృసింహుడా !'

అని ఎవరో బిగ్గరగా అరిచారు.

నృసింహుడు బౌద్ధసన్యాసి వేషంలో కాషాయి వస్త్రాలు ధరించి ఒక ఉన్నతపీఠంపై నిల్చునివున్నాడు.

అతడి కుడిచెయ్యి పైకి లేచివుంది. అత డేదో చెప్పాలనుకుంటున్నాడు. క్రమంగా అతడిచుట్టూ కొద్దిపాటి గుంపు చేరింది.

అతడు చెప్ప నారభించాడు : 'వైశాలిపౌరులారా ! రాష్ట్రం కష్టాల్లో పడివుండటం మీరు చూస్తూనేవున్నారు. అజాతశత్రు త్వరలోనే వృజ్జిసంఘంపై దండయాత్ర చేయనున్నాడని మీకు తెలియునా ? అతడి సైన్యాలు సిద్ధమవుతున్నాయి. తథాగతుడు దేహయాత్ర చాలించి నేటికి మూడు సంవత్సరాలు గతించినాయి. అయినా, భవిష్యత్తులో లీనమై చూసే ఆయన దూరదృష్టిని గమనించి నేడు నాకు చాలా ఆశ్చర్యం కల్గుతోంది. రాజగృహమంత్రి ఆనాడిచ్చిన జవాబునే ఇవాళకూడా ఇస్తాడా? వృజ్జిప్రజలు పరిషత్తులో నియమపూర్వకంగా సమావేశ మౌతున్నారా ? వారు ఒకేమాటపై వుంటూ, ఐక్యంగా పనులుసాగిస్తూ, ఐక్యతతో వృజ్జి కార్యాల్ని, ధర్మాన్ని, వృజ్జి చైత్యాల్ని, బుద్ధదేవుణ్ణి పూజనీయదృష్టితో చూస్తున్నారా? అజాతుని గూఢచారులు మన శక్తిని ఛిన్నాభిన్నంచేయ లేదా ? మనం అవినీతి మార్గాన చరించటంలేదా ? జవాబు చెప్పండి!'

అందరూ మౌనం వహించారు.

'ఈ సంఘము, రాష్ట్రము ఇనాళో రేపో నశించి పోతాయి. మనం అసఫలతను, వినాశనాన్ని ఆహ్వానించాము. మనలో వైరభావం, ఈర్ష్య, ద్వేషం నిండిపోయివున్నాయి. పరిషత్తు తగినంత శక్తివంతంగా వుందా ?'

గుంపులో కోలాహలం బయలుదేరింది.

ఒక నవయువకుడు ముందుకువచ్చి 'ఇందుకు పరిషత్తు దోషమేమీ లేదు. యుద్ధానికి సంబంధించినవర్గమంతా బౌద్ధ సన్యాసులైపోయారు. ఇవాళ వైశాలిరక్షణకు ఖడ్గం చేబూనే దెవరు ?' అని అన్నాడు.

నృసింహుని బాహువులు ఉద్రేకంతో కంపించ సాగాయి. అతడు తన ప్రతిమాటను నొక్కి చెప్ప నారంభించాడు_'బుద్ధుని ధర్మం పిరికితనంకాదు. నువ్వు తథాగతుణ్ణి అవమానపరుస్తున్నావ్' అంటూ నృసింహుడు మరింత ఉద్రేకంతో 'మా మార్గం వేరు. వైశాలిపరిషత్తు ఆయుధాలు ధరించి పురోగమించాలి_ ఇదొకమార్గం. బౌద్ధసన్యాసుల మార్గం_వారు ఆయుధాలు చేబూనరు. కానీ, శత్రువును ఎదుర్కొంటారు. తెలిసిందా నీకు? నువ్వు యువకుడవుగదూ?' అని అతడొక క్షణకాలం ఆగాడు.

'రాజకీయం, అహింస రెంటికీ సంబంధం కలవదు. అయితే యువకులకు ఇందువల్ల భయ మెందుకు ? తథాగతుని ఈ పవిత్ర ధర్మంచాటున మీరు మీ నపుంసకత్వాన్ని దాచుకుంటున్నారనేది మీరు గుర్తించటంలేదా ? యుద్ధం జరగాలి !'

భిక్షాపాత్రలు చేబూని మరికొందరు భిక్షువులు అక్కడికి వచ్చి చేరుకున్నారు. వారిలో అంబాపాలికూడా వుంది.

'ఇదిగో, ఈమె మీ అంబాపాలి. ఈమె, మీ యువకుల్ని కోరుతోందేమిటి? మీరు వైశాలి రక్షణకు ప్రాణత్యాగం చేయరా?' అన్నాడు నృసింహుడు.

'అంబాపాలీకి జై! దేవికి జై!' అంటూ జనసందోహం ప్రతిధ్వనించింది.

అంబాపాలి చేతులుజోడించి వారిస్నేహాభిమానాన్ని స్వీకరించింది. నృసింహుడు అంతటితో తన ప్రసంగాన్ని ఆపివేశాడు.

అంబాపాలి తనకంఠస్వరాన్ని హెచ్చించి జనసందోహాన్నుద్దేశిస్తూ 'వైశాలి పౌరులారా! ఈ యుద్ధం త్వరగానే జరుగుతుంది. కారుమేఘాలు లావరిస్తున్నాయి. నేడో రేపో ఉరుములతో, గర్జనలతో వర్షిస్తాయన్నట్లుంది. సమయం వచ్చినప్పుడు మేము సన్యాస సన్యాసినులం, మా మార్గాన్ని నిర్ణయించుకుంటాం. కానీ, మీరు మాత్రం యుద్ధం చేయాల్సిందే. రాజనీతిలో యుద్ధాలు, రక్తపాతము, కుట్రలు అవసరం. ఇవి అందులోని విశిష్టావయవాలు' 'అని చెప్పింది.

ఆమె మౌనం వహించింది. 'యుద్ధం జరుగుతుంది! వైశాలిపౌరులు ప్రాణా లర్పిస్తారు' అంటూ జనసందోహం ఎలుగెత్తి చాటింది.

ఒకేసారి అనేకచేతులు పైకిలేచాయి. బిగించిన వారి పిడికిళ్ళు ఐశ్వర్యవిలాసాలతో శిథిలమై కూలిపోతున్న ఒక రాష్ట్రానికి కడపటి దృఢత్వాన్ని సూచిస్తూ వాలిపోయాయి.

# 28

వృద్ధ మృగశిర క్రమంగా మంచంలోనుంచి లేచేశక్తిని కోల్పోయాడు. అతడు తన దుఃఖాన్ని మరెవ్వరిపైనా వ్యక్త పరిచేవాడు కాదు; కానీ, లోలోపల ఎంతగానో కుమిలి పోతున్నాడు. ఎన్నో రోజులు అతడు అంగడిముందు కూర్చుని నిరీక్షించాడు. పానశాలను తెరవటమే మానేశాడు.

'ఇహ పానశాలను తిరిగి తెరవనా యేం ?' అని ఎవరో ఒకరు అడిగేవారు.

'అరే, నేను పాపం ప్రోగుచేసుకుని మూటకట్టుకోవాలనే మీ వుద్దేశ్యమా! కొడుకు, కూతురు ఇద్దరూ భిక్షువులై పోయిన తర్వాత వ్యాపారంచేయగలిగేదెలా ?' అని వృద్ధుడు జవాబుచెప్తూ వుండేవాడు.

జవాబుతోపాటే అతడి ముఖంలో, కలతపరచివేసే విషాదంతో కూడిన దరహాసం తొంగిచూచేది.

ఆ తర్వాత అతడు బైటకు రావటమే పూర్తిగా మాని వేశాడు. రోజురోజుకూ ఆరోగ్యంకూడా దిగజారిపోయింది. క్రమంగా రోగం పెరిగి మరీ బలహీనమైపోయాడు.

శరత్ ఋతువు వెన్నెలరాత్రి. వెన్నెల విరగగాస్తోంది. ఆ వెలుగులో అతడి దరిద్రకుటీర వైభవం వెలవెలబోతోంది. పాడుపడినదానివలె వుంది. మృగశిర అర్ధచైతన్యంతో పడి వున్నాడు. పొరుగునవున్న వృద్ధురాలు అతడికేదైనా సహాయ పడుతూవుండేది. ఆమె అప్పుడప్పుడువచ్చి అతడి మంచిచెడ్డలు చారించి తగినసేవ చేస్తూవుండేది. అతడి కుటీరం బాగాశిథిలా

వస్థలోవుంది. అతడి పోషణభారాన్ని వహించే దిక్కెవరూ లేరు. ఆ కుటీర ద్వారానికి తలుపులుకూడాలేవు. ఏసమయం లోనైనా నిరాటంకంగా ప్రతివారూ లోనికి వచ్చిపోవచ్చు.

విరిగిపోయిన తన కుక్కిమంచంచెంత ఏదోనీడ కదిలి నట్లు కన్పించింది మృగశిరాకు. అతడు నెమ్మదిగా ప్రక్కకు వత్తిగిలాడు. ఆమె ఎవరై వుంటుంది. సుభాగా!

అవును, సుభాగాయే!

'నువ్విక్కడికెలావచ్చావ్ సుభాగా?' నూతిలోనుంచి మాట్లాడినట్లు అడిగాడు. రోగంతో కంఠస్వరం మరీ క్షీణించి పోయి వుంది. 'ముసలివాడు చనిపోవటాన్ని చూడాలని వచ్చావా?'

సుభాగ ఏమీ మాట్లాడలేదు. పైనకప్పుకుని వున్న కాషాయవస్త్రాన్ని తీసివేసి వృద్ధుని తలవద్ద కూర్చుంది. 'బాబా, నేనూ చాలా అపరాధం చేశాను. క్షమిస్తావా?' అని అడిగింది సుభాగ మృగశిరాను.

మృగశిరా ఏమీ మాట్లాడలేదు.

'రేపు నేను శిలాజీని; జమదగ్నిని తీసుకువస్తాను. వారు కూడా బౌద్ధులయారు' అని చెప్పింది మళ్ళీ సుభాగ.

'వచ్చావా తల్లీ సుభాగా!' అన్నాడు వృద్ధుడు అదే క్షీణస్వరంతో. ఆనందంతో అతడి కంఠస్వరం కంపించింది.

'నేను ఎంత వెర్రివాడనమ్మా!' అంటూ చెక్కిళ్ళ నిమురుతూ చిరునవ్వుతో 'నేను నీయందు కోపం వహించాను. మీరు నాకు అంతదూరంగా లేకపోయినా, నేను మీవద్దకైనా రాలేదు' అన్నాడు.

సుభాగ సిగ్గుపడుతూ 'నేనుమాత్రం వచ్చివుండ కూడదా బాబూ!...ఇంతకూ ఏమైనా ఆహారం తీసుకు న్నారా; లేదా?' అని అడిగింది.

వృద్ధుడు చిరునవ్వు నవ్వాడు. 'ఎంత పిచ్చిదానవమ్మా నువ్వు? రేపు నువ్వు వెళ్ళనద్దు. ఇక్కడకు రావలసిందని శిలాజీతో చెప్పు. జమదగ్గిని తీసుకురా. తర్వాత ఇక్కడే ఉండిపో తల్లీ!' అని అన్నాడు.

'ఏదైనా ఆహారం తీసుకోలేదా బాబా?'

'నువ్వు ఇక్కడేవుండిపో తల్లీ!'

'నేను ఇక్కడేవుంటాను' అంది సుభాగ.

రెండవరోజు శిలాజీ, జమదగ్గి కూడా వచ్చారు. వృద్ధుడు నెమ్మది నెమ్మదిగా కోలుకున్నాడు. ఇప్పుడిహ అతడు బైటకువెళ్ళి అరుగుమీద ఎండలో కూర్చుంటూ వున్నాడు. 'చూశారా మీరు? మా అమ్మాయి వచ్చేసింది' అని చెప్తూవుండేవాడు.

ఒకరోజున సుభాగ మగ్గశిరావద్దకు వచ్చి 'బాబా! మే మిహ విహారానికి వెళ్ళిపోతున్నాం' అని చెప్పింది.

ఆమె చెప్పేదేమీ తనకు బోధపడటంలే దన్నట్లుగా చూశాడు వృద్ధుడు సుభాగకేసి.

'ఏమిటమ్మా విషయం? నువ్విప్పుడు విహారానికి వెళ్ళటం ఎందుకు?' అని అడిగాడు.

'నేను బౌద్ధసన్యాసినిని బాబా! తథాగతుడు ఉపదే

శించిందిదే. ఎక్కడైతే దుఃఖాలు, బాధలు, కష్టాలు వుంటాయో సన్యాసిని అక్కడే వుంటుంది. ఆమె తథాగతుని పుత్రిక. పితృసంపదగా వారినుంచి మాకు లభించిందీ కరుణే. ఇహ నేను మరొకరోగి నెవరినైనా వెతుక్కుంటాను' అంది సుభాగ.

వృద్ధుని ముఖం వెలవెలబారింది. 'నువ్వు చెప్పే దేమిటో నాకు బోధపడటంలేదమ్మా. నువ్వు నన్నొదిలి ఎలా వెళ్తావు?' అన్నాడు.

సుభాగ చాలా శాంతంగానే 'బాబా, బుద్ధుని ధర్మం ఎవర్నీ నిశ్చితంగా కూర్చోనివ్వదు. నేను వెళ్ళిపోవాల్సిందే' అని అంది.

ఆమె వెళ్ళటానికి బయలుదేరేసరికి వృద్ధుడు ఆమె ముందుకువచ్చి నిలబడ్డాడు. ఎంతో మమకారంతో, కళ్ళ నిండా నీళ్ళునింపుకుని 'అమ్మా, వృద్ధుడు వట్టి పనికిమాలినవా డనుకుంటున్నారా మీరు? నేనుకూడా మీ వెంట వస్తాను. నేనుమాత్రం ఇక్కడ పడివుండి ఏంచేస్తాను?' అన్నాడు.

ఆ తర్వాత నలుగురు కలిసి సంఘారామానికి బయలు దేరారు. వృద్ధుడు త్రోవపొడుగునా ఏదో గొణుగుతూనే వున్నాడు. సుభాగమాత్రం ఏమీ మాట్లాడలేదు. శిలాజి జమదగ్నికి తథాగతుని జీవితగాథను దేనినో చెప్తూవున్నాడు.

ఆ నలుగురూ విహారానికి చేరుకునేసరికి సన్యాసినులు, సన్యాసులు అందరూ నగరంలోనికి వెళ్ళిపోయారు. రాజ గృహపు సైన్యాలు వైశాలిమీదికి బయలుదేరాయి.

వైశాలి అంతా ఒక సైనికగుడారంగా మారిపోయింది. నగరసింహద్వారాల వెనుక దుంగలు, రాళ్ళు గుట్టలుగా పేర్చి, ఆక్రమణనుంచి కాపాడుకొనుటకు బలంగా ఏర్పాట్లు చేస్తున్నారు. వైశాలిసైన్యంలో దస్యులు, ఇతర వృత్తుల జనం, అనేకమంది శూద్రులు సైతం చేర్చుకోబడుతున్నారు. గోపురాలక్రింద జనం గుంపులుగాచేరి 'రాజగృహసైన్యాలు దగ్గరకొచ్చాయా?' అని మాటిమాటికి అడుగసాగారు.

'ఇంకా లేదు, త్రోవలోనే వైశాలిసైన్యం వాళ్ళను ఎదుర్కొంటుంది. మీరందరూ ముందుకువచ్చి సైన్యంలో చేరరేం?' అని పైనుంచి విన్పిస్తూవుండేది.

వైశాలిచిహ్నమైన నెలవంక జండాలు చేబూని జనం దళాలుగా అటునిటు తిరుగుతున్నారు. పూర్వీకుల చంద్రవంశపు ఈ చిహ్నం అలాగేవస్తూవుంది. 'ఈ రాష్ట్రం మాజన్మభూమి. ఈమట్టిలో మేము జన్మించాం. బాల్యంలో ఆటల్లో, యౌవనంలో మధురస్వప్నాలను ప్రసాదించిన భూమి ఇది, మా చేతులు దీనిరక్షణకే. పొడవైన మా శిరోజాలు వింటినారిగా బిగిస్తాం. వైశాలి మా మాతృభూమి. మేమెంతో ఋణపడివున్నాం దీనికి' అంటూ జనంపాటలు పాడుతున్నారు.

వైశాలి సైన్యాలు యుద్ధానికి నగరం వెలుపలకు వెళ్ళిపోయాయి. ఇహ నగరంలో ఒక చిన్న సైనికదళం మాత్రమే మిగిలివుంది.

గత సంవత్సరమే ఆచార్య ప్రబుద్ధకేతుడు కాశినార్ వెళ్ళివున్నారు. తథాగతుని నిర్వాణ ప్రాప్తిచిహ్నంగా

అక్కడ ఒక స్థూపాన్ని నిర్మిస్తున్నారు. ఒక విహారము, సంఘారామంకూడా నిర్మించటం జరిగింది. ఆచార్యులవారు అక్కడేవుండి ఉపదేశాలిస్తూ, స్థూపనిర్మాణ కార్యక్రమాన్ని చూస్తున్నారు. వైశాలిలోని సంఘ కార్యకలాపా లన్నింటినీ కుమారగుప్త, నృసింహులకు ఒప్పగించివేయటం జరిగింది.

వీరు నలుగురూ వెళ్ళినప్పుడు ఆశ్రమంలో ఒక్క కుమారగుప్తుడు మాత్రమే వున్నాడు. ఆయన చిరునవ్వుతో వారిని ఆహ్వానించాడు.

'సుభాగా ! నువ్వు చాలా మంచిదానవు. మీతండ్రిని కూడా నువ్వు సంఘంలోకి ఆకర్షించి తీసుకొచ్చావు' అన్నాడు కుమారగుప్తుడు.

సుభాగ చిరునవ్వు నవ్వింది. 'ఆ పుణ్యమంతా మీదే. మీరు చెప్పి వుండకపోతే, నేనావైపుకు వెళ్ళటానికే సాహసించేదానిని కాదు. మళ్ళీ ఆ మోహపాశంలో చిక్కుకుంటా ననే భయంగా వుండేది' అంది ఆమె కుమారగుప్తునితో.

తర్వాత కుమారగుప్తుడు తనపనిలో లీనమైపోయాడు. ఆచార్య ప్రబుద్ధకేతుడు తథాగతునిముఖతః విన్న కొన్ని ఉపదేశాలను లిపిబద్ధం చేశాడు; ప్రస్తుతం కుమారగుప్తుడు దానికి మరొక ప్రతిలిపిని వ్రాసేపనిలో వుంటున్నాడు.

సాయంత్ర మయింది. అంబాపాలి, నృసింహుడు, మిగిలిన బౌద్ధ సన్యాసులందరూ తిరిగివచ్చారు. అప్పుడు కుమారగుప్తుడు భోజనపాత్రమనుల వరుసగా వుంచి ఆవల పెట్టాడు.

'నగరపరిస్థితు లేమిటి? ప్రజలు భయపడుతున్నారా?' అని అడిగాడు వాళ్ళను కుమారగుప్తుడు.

'ప్రథమరంగంలో వైశాలిసైన్యం ఓడిపోయింది. దానివలన భయం మరీ ఎక్కువైంది. వైశాలి రక్షణ చాలా కష్టం' అని చెప్పాడు నృసింహుడు.

'సమస్య చాలా కఠినమైనదే. మనమార్గ మేదో అన్వేషించాలి మనం' అన్నాడు ఎంతో గంభీరంగా కుమారగుప్తుడు.

'ప్రజలు బౌద్ధుల్ని దూషిస్తున్నారు.'

'వైశాలి రాష్ట్రపు బలహీనతకు తామేమీ కారణం కాదనే వారి వుద్దేశ్యం' అన్నాడు నృసింహుడు.

'వాళ్ళు పిచ్చివాళ్ళు. స్వప్నాల్లో, ఉన్మాదము మదిరా పానాల్లో మునిగిన వైశాలి పూగిసలాడుతూ ఎంతోకాలం వుండదు. పైగా లిచ్ఛవీలకు, వైదేహులకు వైరం. వాళ్లిప్పుడు తమ వైరాన్ని మర్చిపోయి, ఐక్యమై ఒక ప్రచండ శత్రువును ఎదుర్చలేరా! ఇది సాధ్య మవుతుందా?' అన్నాడు కుమారగుప్తుడు.

'మీరు చెప్పేది ఏం చేయమని?'

'ఇంతవరకు నే నేమీ ఆలోచించలేదు. కానీ, ప్రజల్ని సంతృప్తిపరచటం కోసమనే మనం యుద్ధాలు చేపట్టము. వాళ్ళు మనను పిరికివాళ్ళు అనుకొన్నాసరే అది జరుగదు.'

చాలారోజులవరకు వైశాలిసైన్యాలు రాజగృహంబలా

లను ఎదుర్కొంటూ వచ్చాయి. వైశాలికి చాలా దుర్దినా లివి. సైన్యాలు ఓడిపోతున్న సమాచారాలు అందుతూ వుండేవి. ప్రజలు మరింత ఉద్ధృతితో బౌద్ధుల్ని చూపిస్తూవుండే వారు.

ఆ సమయమందుఅంబాపాలి కొంచెం అనారోగ్యంగా వుంది. కుమారగుప్తుణ్ణి గురించి ఆమెకు చాలా విచారంగా వుంది. అతను ఆరామంలోనే ఎక్కువభాగం వుంటూ వుండే వాడు. భిక్షువులమధ్యవున్న సమయాలందుకూడా ఎక్కువగా మాటాడేవాడు కాదు. గత అనుభవాన్ని పురస్కరించుకుని అతని మనస్సు ఇప్పుడు చాలా చంచలంగా వుంటూ వుందని అంబాపాలి గ్రహించుకుంది. అజాతశత్రుని సైన్యాలు వైశాలి లోకి చొచ్చుకుని వచ్చినప్పుడు అత డే మార్గా న్నవలం బిస్తాడో ఎవరికీ ఏమీ తెలియదు. అతడి ఆంతర్యాన్ని ఆమె స్పష్టంగా చూడగలుగుతుంది.

ఒకనాడు వారందరూ సంఘారామం వెలుపల విశాల మైన వటవృక్షంక్రింద కూర్చుని వున్నారు. తథాగతుని చేతితో విత్తబడిన ఈ మహాబోధివృక్షం ఛత్రంవలె విస్తరిల్లి ఒక మహత్తరమైన స్మృతిచిహ్నంవలె నిలిచివుంది. హేమంత ఋతువు, మధ్యాహ్నసమయం.

'రేపటికి మగధసైన్యం ఇక్కడికి చేరుకుంటుంది. మనం కోటలోనికి ఎందుకు వెళ్ళకూడదు ? దానివలన కొంతవరకు ప్రజలభయం తీరుతుంది' అని చెప్పింది అంబాపాలి.

ఇవ్వాళ్టికి పూర్తయిన ప్రతిలిపే అప్పుడు కుమార గుప్తుని చేతుల్లో వుంది. 'నృసింహా! నీ యీ పద్ధతి నాకు సబబుగా కన్పించటంలేదు. నువ్వు మనతరఫున ప్రజలకు ఇంతగా అభయ మెందు కిచ్చావు? ఒకవేళ మనం నాల్గు మూడు వేలనుంది భిక్షువులం, ఆయుధాలు చేబూని ముందు నిలబడినంతమాత్రాన చేయగల్గిందేమిటో చెప్పు?' అన్నాడు కుమారగుప్తుడు,

'ఒక్కపర్యాయమైనా మనం వైశాలినీ, సంఘాన్నీ రక్షించగల్గుతాము. మీరు మా దస్యుల విషయం ఎరుగరు' అన్నాడు నృసింహుడు బదులుగా.

కుమారగుప్తుడు గంభీరంగా 'నాకు తెలుసు. కానీ, మనం ఇప్పుడు ఈ కాషాయవస్త్రాలు ధరించి ఆయుధాలు తీసుకుని పురోగమించటం సరియైనదేనా అనేదే సమస్య' అన్నాడు.

'అయితే మరి ఉపాయం ఏమిటి?'

'మనం వైశాలి సింహద్వారంముందు వుందాము. అజాతశత్రువుకూడా బౌద్ధుడే! అప్పుడిహ అతడు చేయవలసింది నిరాయుధులమైన మనను వధించాలి, లేదా వైశాలిని వదలిపోవాలి.'

'అది సంభవంకాదు. ఈ విధంగా మనం అజాతుని హృదయంలో పరివర్తన కల్గించగలమనేనా మీరు చెప్పేది?' అని అడిగాడు నృసింహుడు.

'నాకా విశ్వాసంవుంది. మానవుని అంతరంగంలోపల మైత్రీభావనే అధికంగా వుంటుంది. మనం మన త్యాగం ద్వారా అజాతుని సైన్యాలను నిరాయుధుల్ని చేయవచ్చు' అని చెప్పాడు కుమారగుప్తుడు.

'ఇది మీా భ్రాంతి' అని అందుకుంది అంబాపాలి. కుమారగుప్తుడు ఒక క్షణకాలం మౌనం వహించాడు. ఆ తర్వాత అతను తిరిగి మెల్లగా 'కావచ్చు. నువ్వు చెప్పేది నిజమే. అంబికా! కుమారగుప్తుణ్ణి నువ్వు అర్థం చేసుకోగలవు; చేసుకోలేవు కూడా. ఇప్పుడు నేను నీకు చెప్పింది నా అంతరాత్మలోని విషయం. ఆయుధాలు ధరించి మనం అజాతశత్రుని విశాల సైన్యవాహినిని ఎదిరించలేము. ఒక ఉపాయం వుంది...అదే నేను నీకు చెప్పాను' అన్నాడు.

ఇంతలో గోపురాలమీాదినుంచి తూర్యనినాదం ప్రతిధ్వనించింది. సింహద్వారంపైనవున్న పెద్ద రణదుందుభిపై దెబ్బపడింది; దానితో ఒక గంభీరమైన, భయంకర శబ్దం వైశాలి అంతటా, వెలుపలా మారోగ్మోగింది.

'ఆత్మరక్షణకై వైశాలి సిద్ధపడుతోంది. నేనీ విధంగా కర్తవ్యశూన్యుడనై కూర్చుని చూడలేను. ఇహ మనం కోటలోనికి వెళ్దామా?' అన్నాడు నృసింహుడు.

'మీారు నన్నిక్కడే వదలివేయండి. నాకు మీాతోనూ పనిలేదు, వైశాలీతోనూ పనిలేదు. అజాతశత్రునితోనూ ఏమీా పనిలేదు. ఇక్కడ సంఘారామంలో అతడి సైన్యం ఏమీా ఉపద్రవం కల్గించదు' అన్నాడు కుమారగుప్తుడు.

నృసింహుడు లేచి నిలబడుతూ 'అంబాపాలీ, నువ్వి క్కడే కుమారగుప్తునివద్ద వుండు. నేను నగరంలో వుండటం చాలా అవసరంగా భావిస్తున్నాను. బుద్ధుని అనుచరులుగా పిరికి వాళ్ళని ప్రజల్ని భావించనీయను నేను' అని అన్నాడు.

'అయితే నువ్వు ఆయుధం ధరించి ఎదుర్కొంటావా?'

'అవును, దేశస్వాతంత్ర్యం వ్యక్తి యొక్క ధర్మంకంటే గొప్పది. తథాగతునిధర్మాన్ని నేను నా పద్ధతిలో అర్థం చేసుకున్నాను. వేలప్రాణాల అదృష్టంతో సంబంధంవున్న ఈ తరుణంలో నృసింహుడు మౌనంగా కూర్చోలేడు' అన్నాడు నృసింహుడు.

అతడు వారినుంచి శలవు తీసుకుని సంఘారామం దిశగా వెళ్ళిపోయాడు.

ఒక అశ్వారోహుడు తమవంకకే వస్తూ వుండటం కన్పించింది. అతను సూర్యమణి. అతడు వారి సమీపానికి వచ్చి 'మీ సంఘసభ్యులు నగరం వెలుపలే వుండిపోతారా?' అని అడిగాడు.

'అవును' అని చెప్పింది అంబాపాలి.

'కానీ, ఇది చాలా అపాయకరమైన విషయం. వైశాలి పౌరునిదృష్టితో మీరుకూడా దాని రక్షణకు తగిన ఉపాయాన్నాలోచించాలి.

'ఇక్కడ సంఘారామంలో ఏమీ ఉపద్రవాలు జరుగవు. ఈ ప్రదేశం వైశాలీకంటే ఎంతో నిరపాయకరమైనది' అని అన్నాడు కుమారగుప్తుడు.

'మరికొద్ది క్షణాల్లో సింహద్వారాలు మూసివేయబడతాయి. మనం త్వరపడాలి' అని అతడు విచారం వ్యక్తమయే కంఠస్వరంతో అంబాపాలికేసి వంగి 'చంద్రసేన తన కుమారుని రక్షణకు చాలా దుఃఖిస్తోంది' అని చెప్పాడు.

'నువ్వామెను సంఘారామానికి పంపు. ఇక్కడ ఆమే, ఆమె బిడ్డా కూడా సురక్షితంగా వుంటారు' అని చెప్పింది అంబాపాలి.

'మరి మిగిలిన వైశాలి ప్రజలు ఏమంటారు? అది సాధ్యంకాదు, అంబాపాలీ! ఈ యుద్ధంలో నేను ప్రాణాలర్పించటమే జరగవచ్చు. అప్పుడు నువ్వు, కుమారగుప్తుడు చంద్రసేనను, ఆమె కుమారుణ్ణి చూడండి' అంటూ అంటూ అతడి నేత్రాలు అశ్రుపూరితాలయాయి. వాటిని దాచుకుంటానికి అతను గిరుక్కున గుర్రాన్ని త్రిప్పి చాలా వేగంగా సింహద్వారం దిశకు సాగిపోయాడు.

'పద; సంఘంలోనికి వెళ్దాం. ఆ కోటగోడపై అటునిటు పరుగెత్తే వ్యక్తి, చేతిలో జండాకూడా వుంది, అతడు నృసింహుడా!' అన్నాడు కుమారగుప్తుడు అంబాపాలితో.

'అవును, అతడి రూపురేఖలే' అని అంది విచారసూచక కంఠస్వరంతో అంబాపాలి.

# 29

ఆ రోజు పగలు, రాత్రి అంతా ఆక్రమణ జరుగుతుం దనే భయంగావుంది. మరునాటికి విజయంపొందిన రాజగృహ సైన్యం వైశాలిదిక్కుగా పురోగమించి వస్తూవుండటం కన్పించింది. రాత్రి మొదటిజాము గడచిపోయిన తరువాత సంఘంలోనికి ఒక వ్యక్తి ప్రవేశించాడు. అతడు కుమార గుప్తునివద్దకు వచ్చి 'నేను వ్యాపారిని. మా వ్యాపారులు నగ రానికి పశ్చిమాన గుడారాల్లో వున్నారు' అని చెప్పాడు.

'మీరు ఎక్కడనుంచి వస్తున్నారు?' అని అడిగాడు కుమారగుప్తుడు.

'నేను శాకలనుంచి వస్తున్నాను. వైశాలి పశ్చిమ సింహద్వారంవద్ద మగధసైన్యపు ఆక్రమణ జరిగేట్లు తెలియ వస్తోంది. అటు సైనికులు అంత ఎక్కువగా లేరు. ప్రధాన మైన సైన్యం ఇటు రాదు. మీరు మా వ్యాపారులకు మీ సంఘంలో ఆశ్రయ మివ్వగలరా ?' అని అన్నాడు.

కుమారగుప్తుడు ఆలోచనలోపడ్డాడు.

'ఈ వార్త లోనికి తెలియచేయగలిగితే, వైశాలి మరికొద్దిరోజులు స్వతంత్రంగా వుండవచ్చు...మీరు మా విషయంలో ఏం చెప్తారు ?' అని అడిగాడా వ్యాపారి.

'మీ రిక్కడ వుండిపోవచ్చు. ఇక్కడ ఏమీ ఉపద్ర వాలు జరుగవు' అన్నాడు కుమారగుప్తుడు చాలావిచారంగా.

ఆ వ్యక్తి వెళ్లిపోగానే కుమారగుప్తుడు అంబాపాలి వద్దకు వెళ్ళాడు. అతడు ఆమెగదిలోనికి తొంగిచూచాడు

అంబాపాలి శయ్యచెంత దీపం వెలుగుతూవుంది. ఆ దీపకాంతి లోనే ఆమె ముఖంలోని విచారరేఖలు స్పష్టమవుతున్నాయి. ఆముఖంలో ఎంతో తీవ్రాకర్షణ వుంది. ఆ విషయం మళ్ళీ ఇవాళ కుమారగుప్తుడు తెలుసుకున్నాడు. ఒక క్షణకాలం వరకు నిలబడి ఆమెకేసి చూస్తూవుండిపోయాడు. ఆ తర్వాత అతడు తలుపుపై శబ్దంచేశాడు. అంబాపాలి నిద్రపోయి చాలా సమయమైంది. అయినప్పటికీ మాటిమాటికీ నిద్ర చెదిరి పోతూవుంది. ఆమె శబ్దంవిని మేల్కొంది.

అలసిపోయివున్న నేత్రాలను సరిగ్గా తెరవకుండానే ఆమె వెలుపలకు వచ్చింది. అక్కడ కుమారగుప్తుడు కన్పిం చాడు. ఆమె తన పెదవులమీదికి చిరునవ్వు తెచ్చుకుని 'ఎందుకు ? నువ్వు రాత్రంతా మేల్కొనే వున్నావా ?' అని అడిగింది.

'ఇంతకుముందే ఒక వ్యాపారి వచ్చాడు. వారికి సంఘంలో ఆశ్రయ మివ్వాలి. నువ్విప్పుడు నగరంలోనికి వెళ్ళాలి. ఆక్రమణభయంవల్ల సింహద్వారాలన్నీ మూసి వేశారు. అందువల్ల మరెవ్వరూ అక్కడికి వెళ్ళలేరు. కనుక నువ్వు లోనికివెళ్లి సింహద్వారంపై ఆక్రమణజరిగే సూచనలు ఏమీలేవనీ, అజాతుని సైన్యాలు పశ్చిమద్వారంవద్ద సమీకరించ బడుతున్నాయి కనుక జాగ్రత్తగా వుండవలసిందనీ చెప్పాలి' అని చెప్పాడు కుమారగుప్తుడు అంబాపాలితో.

అంబాపాలి ఒకక్షణకాలం సంశయించి 'నువ్వె ఎందుకు వెళ్ళగూడదు? నాకు నిన్ను గురించి భయంగావుంది. నువ్వు చేయదలుస్తోం దేమిటి?' అని అంది.

కుమారగుప్తుడు కొద్దిగా దరహాసంచేస్తూ 'నీభయం వ్యర్థమే. నే నిక్కడ సంఘభవనంలో శాంతంగా వుంటాను. నే నిక్కడ వుండటం చాలా అవసరం' అని చెప్పాడు.

'నేను మళ్ళీ తిరిగి రాగలనా?' అని అడిగింది అంబా పాలి కుమారగుప్తుణ్ణి.

'అది నాకు తెలియదు. అజాతుసిసైన్యం ఇప్పుడెక్కడ వుందోకూడా నాకేమీ తెలియదు. అతడు సింహద్వారం పైకి వస్తాడో లేదో ఎవరు చెప్పగలరు? నువ్వీ వార్తను నగరంలోనికి చేర్చగలిగితే వైశాలి పౌరులమైనందుకు నీ బాధ్యత, నాబాధ్యత తీరిపోతుంది' అన్నాడు కుమారగుప్తుడు.

అంబాపాలి అతడివెనుక సంఘభవనం వెలుపలకు వెళ్ళింది. ఆమె నగరంకేసి చూసింది_ గోపురాలపైనా, సింహద్వారంమీదా చాలా సందడిగా వుంది. వాటిపైన వున్న వెలుగు కళ్ళకు మిరుమిట్లు గొలుపుతోంది. అంబాపాలి కుమారగుప్తునివద్ద శలవు తీసుకుంటూ 'నా మన స్సేమీ బాగులేదు కుమారగుప్తా! నే నక్కడినుంచి శీఘ్రంగా నే తిరిగి వస్తాను. నాలో ఎవరో ఎలుగెత్తి విన్పిస్తున్నట్లు_ అక్క డికి వెళ్ళటంవల్ల శుభం జరుగదు_ అని చెప్తున్నారు. నువ్వు మరెం కెవరినైనా పంపలేవా అక్కడికి?' అని అంది.

'లేదు' అన్నాడు కుమారగుప్తుడు మెల్లిగా. అంబాపాలి క్రమంగా రాత్రియొక్క ఆఖరిజాము అంధకారంలో కలిసిపోయింది. కుమారగుప్తుడుఅటుకేసిచూస్తూనిల్చున్నాడు. చాలాసేపటివరకు. తర్వాత అతడు సంఘభవనంలోనికి తిరిగి వచ్చాడు.

కాస్సేపటికి రణనినాదాలు విన్పించాయి. అజాతశత్రుని సైన్యంలోని ఒక అశ్వారోహుడు వైశాలి సింహద్వారం దిక్కుగా సాగిపోతున్నాడు.

సూర్యోదయమైంది. సింహద్వారంపై దాడి జరుగుతోంది. గోపురాలపైనుంచి అశ్వారోహులపై భీషణ బాణవర్షం కురుస్తోంది. అందువల్ల మగధ సైన్యాలకు సింహద్వారాన్ని ధ్వసంచేయటం సాధ్యపడటంలేదు. సింహద్వారం ముందున్న కందకంపై దుంగలతో వంతెనవేసి పెద్దపెద్ద ఆయుధాలతో సింహద్వారాన్ని విరగగొట్టుటకు ప్రయత్నిస్తున్నారు. వైశాలిలోని మిగలుబడులు, దస్యులు ధనుర్విద్యలో సిద్ధహస్తులని తేలిపోయింది.

అయినా, ద్వారం క్రమంగా బలహీనపడిపోసాగింది.

ఇంతలో అకస్మాత్తుగా సంఘభవనంనుంచి ఒక పెద్ద భిక్షువుల సముదాయం సింహద్వారంకేసి సాగివస్తూవుండటం గోచరించింది. కుమారగుప్తుడు వారికి నాయకత్వం వహిస్తున్నాడు.

ఆయన వైశాలి సింహద్వారానికీ, మగధసైనికులకూ మధ్య వచ్చి నిల్చున్నాడు. ఆయన తనచేతుల్ని పైకెత్తాడు.

'భిక్షువులారా! ఇదేమిటి? మీకు కావల్సిందేమిటి!' అని ప్రశ్నించాడు అశ్వారోహులనాయకుడు ముందుకువచ్చి.

కుమారగుప్తుడు కూడా ముందుకువచ్చి 'మేము యుద్ధాన్ని వ్యతిరేకిస్తున్నాము. మేము తథాగతుని పుత్రులం. తథాగతుని మైత్రీసందేశాన్ని ప్రచారంచేయటానికి మేము మా ప్రాణా లర్పించటానికికూడా వెనుదీయము' అని చెప్పాడు.

'నేను నిన్ను గుర్తించాను. సైన్యాధ్యక్షుడు కిశోర గుప్తుని సోదరుడువుగదూ! రాజగృహానికి నువ్వెంతో ఋణ పడి వున్నావు. అది తీర్చేవిధ మిదేనా?.......భిక్షువులు రాజకీయాల్లో తలదూర్చడం మంచిది కాదు' అన్నాడు అశ్వారోహకుల నాయకుడు.

గోపురాలపై చాలా కోలాహలంగా వుంది వైశాలి లోని రాజపురుషు లెందరో అక్కడికి వచ్చారు.

సింహద్వారపు గోపురంమీదికి వచ్చి నృసింహుడు బిగ్గరగా అరుస్తూ 'కుమారగుప్తా. ఏమి టీ చిన్నతనపుపనులు? వైశాలి ప్రజలు అంతిమ సమయంవరకు ఆత్మరక్షణ చేసు కుంటారు. నిరాయుధులై, నిస్సహాయులైన భిక్షువుల పాపా న్నది భరించదు' అని చెప్పాడు.

సేనానాయకుడు తలపైకెత్తి అతడికేసిచూచి చిరు నవ్వుతో 'ఇదుగో, ఇంకేం భిక్షువులు ఆయుధాలు తీసుకొని యుద్ధానికి తలపడ్డారు' అన్నాడు.

'కుమారగుప్తా! ఇది నీమంకు పట్టుమాత్రమే దీనివలన వైశాలికి నష్టమే సంభవిస్తుంది' అన్నాడు తిరిగి నృసింహుడు.

కుమారగుప్తుడు అతనిమాటలను ఏమాత్రంవిన్పించుకోలేదు. అతడు భిక్షువులనుద్దేశిస్తూ 'భిక్షువులారా ! ఈ యుద్ధ స్వభావానికి విరుద్ధంగా మనం ఈ ప్రదేశంనుంచి కదలవద్దని నిశ్చయించుకున్నాము. రాజగృహ సైనికులు మననైనా సంహరించాలి; లేదా వైశాలి వదిలిపోవాలి. పరతంత్రంవంటి భయంకరపాపం మరొకటిలేదీ ప్రపంచంలో. మగధ వైశాలిని పరతంత్రంగావించి దాని ఆత్మను హత్య చేసివేస్తుంది. వైశాలి, వృజ్జీ సంఘంలోని వేనవేల ప్రాణుల జీవితాలను జ్వాలల్లో మాడ్చివేస్తుంటే, మనం చూస్తూ సహించివుండలేము. భిక్షువులారా! మనం యుద్ధానికి వ్యతిరేకంగా సత్యాగ్రహం చేస్తున్నాము. తథాగతుని ధర్మసూత్ర జ్యోతితో మన మీా అంధకారాన్ని పారద్రోలాలి' అని విన్పించాడు.

'బుద్ధభగవానునికి జై!' అంటూ నినదించారు భిక్షువులందరూ.

సేనానాయకుడు ముందుకు వచ్చి 'సింహద్వారంపై ఆక్రమణచేయాలనే నాకు ఆదేశించబడింది. భిక్షువులు తొలగిపోవాలి. రాజగృహ సైనికులు బౌద్ధులపై చేయిచేసుకోరు; కానీ, బౌద్ధులను అడ్డుగా నిలుపుకొని యుద్ధం చేయటం వైశాలిసైన్యానికి అవమానకరం' అని అన్నాడు.

అంటూ తలపైకెత్తి గోపురాలకేసి చూస్తూ దర హాసం చేశాడు.

అకస్మాత్తుగా సింహద్వారగోపురంమీాద అంబాపాలి కన్పించింది. అందరూ ఆమెకేసే చూడసాగారు.

ఆమె సౌందర్యం అందర్నీ ముగ్ధుల్ని చేసివేసింది. ఆ కాషాయ వస్త్రాల్లో, మధ్యాహ్నపు ఎండలో ఆమె నిజంగానే శాంతి దేవతలా కన్పించింది.

'భిక్షువులారా! వైశాలిప్రజలు యుద్ధానికి సిద్ధంగా వున్నారు. సాధ్యమైనంతవరకు వారు ఆత్మరక్షణ చేసుకుంటారు. వైశాలిప్రజల సాహస పరాక్రమాల కిదొక పరీక్ష. పైగా వారు తమ బాధ్యతను గుర్తించారు. ఈ విధంగా మీరు ప్రాణా లర్పించడం సరియైనది కాదు' అని చెప్పింది అంబాపాలి.

సరిగ్గా అదే సమయంలో గోపురం పైనుంచి రంయ్ మంటూ దూసుకువచ్చిన బాణం సేనానాయకుని శిరస్త్రాణానికి తగిలింది. ఆ విసురుకు అతడు పడిపోతూ పడిపోతూ అంతలోనే నిలదొక్కుకున్నాడు.

'భిక్షువులారా! ఇక్కడినుండి తొలగిపొండి. నిరాయుధుల్ని హత్యగావించటం నాకిష్టంలేదు' అని సేనానాయకుడు ఎలుగెత్తి చెప్పాడు.

ఎవరూ ఒక్క అడుగుకూడా కదల్చలేదు. అంబాపాలి గోపురంపైనుంచి క్రిందికి దిగివచ్చింది.

సేనానాయకుడు మళ్ళీ బిగ్గరగా 'భిక్షువులారా! సింహద్వారమార్గంనుంచి తొలగిపొండి' అని చెప్పాడు.

అయినా అందరూ ఎక్కడివా రక్కడే శాంతంగా నిలబడివుండటంచూసి సేనానాయకుడు ఆక్రమణచేయవల్సిందిగా ఆదేశించాడు. సైనికులఅశ్వాలు ముందుకు సాగాయి, భిక్షువులకు అతిసమీపంగా వెళ్ళి ఆగిపోయాయి.

సేనానాయకుడు బిగ్గరగా అరిచాడు.

'ఆక్రమణ చేయండి'

అతడి కంఠస్వరం ప్రతిధ్వనించింది.

ఒక అశ్వానికి తగిలి వాడల్లా నిలదొక్కుకున్నాడు కుమారగుప్తుడు. అతడు వెంటనే స్థిమితపడి తిరిగి తన యథాస్థానంలో నిల్చున్నాడు.

పైనుంచి బాణవర్షం కురిసింది. ఎంతోమంది అశ్వారోహులు గాయపాడి నేలకొరిగారు.

కుమారగుప్తుడు గోపురాలకేసి చేతులెత్తి 'ఇహ యుద్ధాన్ని వెంటనే విరమించండి మీరు వైశాలికి నష్టం కల్గిస్తున్నారు' అని చెప్పాడు.

కానీ, అంతలోనే అశ్వారోహులు సింహద్వారంపై దాడిచేశారు. భిక్షువుల అడ్డుగోడ వారినేమీ నిరోధించలేక పోయింది. భీషణమైన ఈదాడిలో భిక్షువులు నలిగిపోసాగారు.

నృసింహుని కంఠస్వరం బిగ్గరగా విన్పించింది. అతడు వైశాలిసేనానాయకుణ్ణుద్దేశించి 'ఆపివెయ్, ఆపివెయ్— ఇంకా భిక్షువుల్ని హత్యగావిస్తారా!' అంటూ అరిచాడు బిగ్గరగా.

సేనానాయకుడు భీమసేనుడు క్షుబ్ధుడై 'అది జరగటానికి వీల్లేదు. వైశాలిలో శక్తిసామర్థ్యా లున్నంతవరకు, అది పోరాడితీరుతుంది. లేనిచో సింహద్వారం విరిగిపోతుంది' అన్నాడు.

ఇరువైపులా యుద్ధం సాగుతూనేవుంది.

ఇంతలో దూరంగా తూర్యధ్వని విన్పించింది. ఒక చిన్న సైనికదళం వెంటరాగా రాజగృహపు ప్రధాన సేనానాయకుడు అక్కడికి వచ్చాడు.

'యుద్ధాన్ని ఆపండి' అని ఆదేశించాడతడు. యుద్ధం ఆగిపోయింది. పైనుంచికూడా బాణవర్షం ఆగిపోయింది.

సైన్యాధ్యక్షుడు కిశోరగుప్తుడు ముందుకువచ్చి 'మనం వైశాలిపై విజయం పొందాము పశ్చిమద్వారంగుండా మన సైనికులు నగరంలోనికి జొరబడ్డారు. ఇప్పుడిహ నిరాయుధులైన భిక్షువుల్ని సంహరించటం మంచిదిగాదు' అని చెప్పాడు.

భిక్షువులనుద్దేశిస్తూ 'బుద్ధభగవానికీజై!' అన్నాడు.

కిశోరగుప్తుడు కుమారగుప్తునిచెంతకు వెళ్ళి గుర్రం నుంచి క్రిందికి దిగాడు. అతడు అన్నగారికి పాదాభివందనం గావించాడు. కుమారగుప్తుని ముఖంలో భీషణమైన అంత ర్వేదన తొంగిచూస్తోంది.

అతడు అతణ్ణి ఆశీర్వదించాడు. వెనుదిరిగి అతడు భిక్షువులనుద్దేశించి 'భిక్షువులారా! మనం మన కర్తవ్యాన్ని నెరవేర్చాము. మనకదే సంతోషం. బౌద్ధరాష్ట్రాలు ఈ విధంగా యుద్ధాలు చేసుకుంటూ వుండటమే చాలా దుఃఖ కరమైన విషయం. ఈవిజయపిపాసవల్ల తథాగతుని ధర్మశక్తి క్షీణించిపోతుంది. మనం మైత్రీభావంతో మెలగలేమా!' అని అన్నాడు.

అతడిపాదాలు భూమిపై నిలవటంలేదు. కంపించిపోతున్నాయి. కిశోరగుప్తుడు అతణ్ణి ఆసరాయిచ్చి పట్టుకున్నాడు. కుమారగుప్తుడు నిర్జీవంగా అతడిపైకి ఒరిగిపోయాడు.

'నా వక్షంలో బాణం నాటుకుంది. పెరికి పారవేశాను. నేనిహ ఎంతోసేపు జీవించను' అన్నాడతడు.

అంటూ కుమారగుప్తుడు తన ఎదురురొమ్ముపైనుంచి చేతిని తీసివేశాడు. రక్తధార విజృంభించింది. బాధతో అతడు వెలవెలబోతున్నాడు.

'నన్ను సంఘారామానికి తీసుకువెళ్ళండి' అని చెప్పాడు కుమారగుప్తుడు బాధగా.

కిశోరగుప్తునికి దుఃఖం పొంగుకొచ్చింది. 'సోదరా! నన్ను క్షమించు. నేనే నీ హత్యకు కారకుణ్ణి' అని వేడుకున్నాడు.

కుమారగుప్తుడు మరింతగా అతడిమీదికి వాలిపోయి 'తమ్ముడూ, నువ్వనేదేమిటి? నువ్వు నీకర్తవ్యాన్ని పాలించావు. నా జీవితచక్రం ఈనాటితో సమాప్తి చెందింది. దీనికి కారకకారణా లెవరూ కాదు. నువ్వు వైశాలి పౌరుల్నెమీ బాధించకు. కుమారగుప్తుడు తన జీవితంలోని మధుర దినాల్లో వైశాలికి అతిథిగా వున్నాడు' అని కుమారగుప్తుడు భిక్షువులకేసి తిరిగి 'నన్ను సంఘభవనానికి తీసుకువెళ్ళండి. గాయపడిన మిగిలిన భిక్షువుల్ని కూడా తీసుకురండి' అని చెప్పాడు.

కిశోరగుప్తుడు కుమారగుప్తుణ్ణి తన చేతులపై ఎత్తుకుని భిక్షువుల వెనుక సంఘారామం దిశగా నడిచాడు.

అప్పటికి సింహద్వారం తెరువబడింది. ఇరువతూల సైనికులూ ఆయుధాలు దింపివేసి, భిక్షువుల వెనుక బయలు

దేరారు. అందరికంటే వెనుక నృసింహుడు, అతడి దస్యులు అంబాపాలి వున్నారు. ఆమె నృసింహుని సహాయంతో నడుస్తోంది.

సంఘారామానికి వెళ్ళినతరువాత కుమారగుప్తుణ్ణి అతడి గదిలో పరుండబెట్టారు. తెలివితప్పి పడిపోయాడతడు. రక్తమంతా పోవటంవలన అతడినాడికూడా ఎక్కడో మినుకు మినుకు మంటోన్నట్లు కొట్టుకుంటూంది.

'అజాతశత్రు మహారాజుగారు వస్తున్నా రిక్కడికి' అన్నారు ఇంతలోనే ఎవరో. ఆ మాటతోపాటు కుమారగుప్తుడు కన్నులు తెరిచి నల్దిశల పరికించి చూచాడు. తరువాత అతడు చాలాక్షీణస్వరంతో 'అంబాపాలి ఎక్కడవుంది? ఆమెను పిలువు' అని చెప్పాడు కిశోరగుప్తునితో.

# 30

అంబాపాలికి కుమారగుప్తుని అంత్యసందేశం ఇంకా ఇప్పటికీ విన్పిస్తున్నటే వుంది. 'ఛీ, ఛీ! ఏడుస్తున్నావానువ్వు అంబాపాలీ! బుద్ధునిధర్మంలో మృత్యువు, నిరాశ, నాశనము అనేవే లేవు. నేను చేసిన ఈ పనికి నేను దోషినీకాను. నాకా గొప్పతనమూరాదు. అంతా తథాగతుని ఇచ్ఛ! నేను తథాగతుని ధర్మసందేశాన్ని నీచేతుల్లోవుంచుతున్నాను. నీద్వారా ఇది వేనవేల పీడితప్రాణులకు అందుతుంది' అని చెప్పాడు.

అంబాపాలి మనస్సు చాలా కలత చెందింది.

కుమారగుప్తుడు చిరునవ్వు తెచ్చుకుని 'అంబికా! ఇందులో దుఃఖపడాల్సిన అవసరమేమీ లేదు. నువ్వు నా జీవితమంతటా మార్గదర్శకురాలవయావు. నిన్ను కలుసుకోనుటకు చాలా సంవత్సరాలపూర్వం గాంధార దేశంలోనే నేను నిన్ను కలుసుకున్నాను. నువ్వు ఆజన్మాంతం నాకు స్నేహితురాలిగా వున్నావు. ఎప్పుడూ అలాగే వుంటావు ప్రేమ, కర్తవ్యబంధనాల ద్వారా ఐక్యమైన ఈ రెండు ఆత్మలను మృత్యువు వేరుచేయలేదు. చూడు, దుఃఖించవద్దు......' అన్నాడు.

ఒక సంవత్సరం గడచిపోయింది. మళ్ళీ సంఘకార్యకలాపాలు యథాప్రకారం కొనసాగుతున్నాయి. ఒకనాడు అంబాపాలి నృసింహునివద్దకు వచ్చి 'ఈ వైశాలితో నాజీవితంలోని సుఖదుఃఖాలెన్నో మిళితమై వున్నాయి. మనం దీనిని వదలి మరెక్కడికైనా పోగూడదా? దానివలన నాకు శాంతి లభిస్తుంది. పైగా ఇక్కడి ప్రచార కార్యక్రమం కూడా ముగిసిపోయింది' అని అంది.

'అయితే ఎక్కడికి వెళ్దాం??

'ఎక్కడైతే ప్రజలకు తథాగతుని ధర్మసందేశం అందలేదో అక్కడికి. ఏదైనా చాలా దూరప్రాంతానికి వెళ్దాము.'

నృసింహుడు కాసేపటివరకు ఆలోచనలో మునిగిపోయాడు. 'బాగానేఉంది ఇది. ఇక్కడి కార్యక్రమాన్ని

శిలాజీకి వప్పగిద్దాం. ఇప్పుడిహ ఇక్కడిపని ఒక మార్గాన పడింది. మనవెంట ఎవరెవరు వస్తారు?' అని అడిగాడు నృసింహుడు.

అంబాపాలి పరధ్యానంగా 'నువ్వు ఎవర్ని నిర్ణయించి నాసరే! భైరవి నా వెంట వస్తానని తెలియజేసింది' అని చెప్పింది.

నృసింహుడు గాంభీర్యంవహించాడు. 'అవును, ఆమెను తీసుకురా. ఆ యువకుణ్ణి నేనా రోజున రక్షించాను. ఆ రోజున అతడు లేకుండా వుండివుంటే నేనీ ప్రపంచాన్నే విడిపోయేవాడిని. నాముందుకు వచ్చి ఖడ్గానికి తనరొమ్మునిచ్చాడు!'

'ఈ భైరవిని చూసినప్పుడు నేను ఆకలిదప్పులనే మర్చిపోతాను. ప్రచండుని మరణం ఈమెను పిచ్చిదానిగా చేసివేసింది!...అయితే మనం ఎక్కడికి వెళ్ళేది ఇంకా ఏమీ నిశ్చయమేలేదు. అప్పుడిహ మనవెంట పెద్దగుంపును తీసుకు వెళ్ళి ఏం చేద్దాం? తథాగతుని భక్తులెవరూ ఇంతవరకూ వెళ్ళివుండని దూరదేశాని కెక్కడికైనా వెళ్దాం. దుఃఖాలు, క్లేశాలు, కష్టాలు లేని తావెక్కడుంది? అటువంటి తావులన్నీ మన కార్యక్షేత్రాలే. అయినా వైశాలిని వదలివెళ్ళటమే మంచిది' అని అన్నాడు నృసింహుడు.

అంబాపాలి చాలా విచారంగావుంది. ఆమె ఏమి ఆలోచిస్తోందో ఏమో! ఆమె నృసింహునితో మెల్లగా 'ఆర్య కుమారగుప్తుడు ప్రారంభించినపనిని మనం పూర్తిచేయాలి. నే నిహ దుఃఖించను. అతడి ఆదేశంకూడా ఇదే. నృసింహా! నే నతణ్ణి ఇంకా నాచెంతనే వున్నట్టు చూస్తున్నాను. ఇంకా అతడి స్పర్శ తగిలినట్లే వుంది నాకు' అని చెప్పింది.

నృసింహుడు నెమ్మదిగా ఆమె భుజంపై చేయివేసి అంబాపాలీ! నువ్వు దుఃఖిస్తున్నావా? ధర్మమార్గంలో ప్రాణాలను త్యజించినవారికి మృత్యువే లేదు. అతనికి పూర్తిగా నిర్వాణం ప్రాప్తిస్తుంది. లే! మనం కూడా ఆయన జీవితాన్నుంచి వెలుగును పొంది, ఆయన చూపిన మార్గాన నడుద్దాం. శాంతి, అవసాదాలమార్గం బౌద్ధుని మార్గంకాదు' అని అన్నాడు.

ఇంతలో భైరవి వారిదగ్గరకు వచ్చింది. ఆమెనేత్రాలు ఎరుపెక్కుతున్నాయి. ఈ లోకంలో తాను లేనేలేనన్న భావమేదో ఆమెలో మూర్తీభవించింది. ఆమె వచ్చి వారిద్దరి ఎదుట నిల్చుంది.

అంబాపాలి ఆమెను అక్కున జేర్చుకుంది. ఆమెను ఆవిధంగా అక్కున జేర్చుకుని చెదిరిన ఆమె ముంగురులను సరిచేస్తూ 'వెళ్దాంపద, భైరవీ! మనిద్దరం దుఃఖ పీడితులమే. మనం ఇక్కడినుంచి చాలాదూరం వెళ్ళిపోదాం. మన దుఃఖాలన్నీ మర్చిపోదాం' అని అంది.

ఇదంతా తనకేమీ అర్థం కానట్లుగా భైరవి తల పైకెత్తి రెప్ప వేయకుండా అంబాపాలి ముఖంలోకి చూడసాగింది.

అంబాపాలి భైరవి చెక్కిళ్ళపై చిన్నగా చిటికవేస్తూ 'పాపం! అమ్మాయికి తెలియటం లేదు' అని అంది.

నృసింహుడు కరుణాభావంతో వారికేసి చూస్తూ 'దేవీ! బుద్ధుని ధర్మం దీనులకు, దుఃఖితులకు పాపులకు. తథాగతుని పాదములయందు విశ్వాసం వుంచండి. ఆయన మనకు శాంతి నిస్తాడు' అని అన్నాడు.

అంబాపాలి వారిని వెంటతీసుకుని సంఘ భవనం లోకి బయలుదేరింది. వారున్నచోట ఎండపడుతోంది.

'ముందు మనం కుశనార్ వెళ్దాము. అక్కడ ఆచార్య ప్రబుద్ధకేశుల్ని కలుసుకొని అక్కడనుండి ఎక్కడికైనా వెళ్దాం. మనం తీసుకువెళ్ళవలసిందేమీ లేదు' అని అంది అంబాపాలి.

రెండవరోజు సూర్యుడంత పైకెక్కకముందే నృసింహుడు, అంబాపాలి, భైరవి సంఘారామపు ద్వారంలోనుంచి వెళ్తూవుండటం కన్పించింది. వారి వెనుక శిలాజీ, సుభాగ, ఇంకెందరో భిక్షువులు నిల్చుని వున్నారు. నగరప్రజలు వారికి వీడ్కోలివ్వటానికి క్రితం రాత్రి మొదటి జామునుంచే సమావేశమయ్యారు. 'దేవీ అంబాపాలీకి జై!' అంటూ వారు ఆనందోత్సాహంతో నినదించారు.

అంబాపాలి శిరము వంచి ప్రజల జయనినాదాన్ని హృదయపూర్వకంగా ఆహ్వానించింది.

వారు బోధివృక్షచ్ఛాయకు వెళ్ళి ఆగిపోయారు.

'తథాగతుడు నాటిన ఈ వృక్షము నేటికి విస్తరిల్లి ఈ విశాల రూపాన్ని పొందింది. తథాగతుని ధర్మంకూడా ఈ విధంగానే అనేక శాఖలుగా విస్తరిల్లి ప్రతిప్రాణికీ నీడ నిస్తుంది. మనం దీనికి నమస్కరిద్దాం' అని చెప్పాడు నృసింహుడు.

అనేక వేల శిరములు ఆ బోధివృక్షం ఎదుట భక్తిగా వంగిపోయాయి. జనుల జయనినాదం నల్దిశల ప్రతిధ్వనించింది.

'తథాగతునికీ జై! మహాబోధి సత్యానికీ జై! బోధి వృక్షానికీ జై!'

నృసింహుడు అక్కడ చేరిన జనసమూహానికి తథాగతుని ధర్మసూత్రాలను ఉపదేశించాడు. తర్వాత భిక్షువుల వెపకు తిరిగి 'భిక్షువులారా! 'చరథ భిక్ఖవేచారికం బహుజనహితాయ బహుజన సుఖాయ లోకాను కమ్పాయ అత్థాయ, హితాయ సుఖాయ దేవమనుస్సానం' అని తథాగతుడు మనకు ఉపదేశించాడు. తథాగతుని పుత్రులారా! మనం తథాగతుని ఈ ఆదేశాన్ని పాలిస్తున్నాము. రేపు మీరు మమ్మల్ని అనుసరించాలి. మేము తథాగతుని ధర్మాన్ని ఉపదేశిస్తూ దేశదేశాలు తిరుగుతాము. తథాగతుడు మాకు

మార్గాన్ని చూపించు గాక. సంఘప్రతిష్ట భిక్షువుల చేతుల్లో వుంటుంది. వైశాలి భిక్షువుల సంఘము తథాగతుని ఆదేశాలపై దృఢంగా వుండుగాక!' అని చెప్పాడు.

వారు బయలుదేరారు. ప్రజలు, సన్యాసినులు, సన్యాసులు వారి వెనుక నడిచారు. నృసింహుడు వెనుదిరిగి 'రాజుల వలె ఆడంబరంగా పీడ్కోలివ్వడం భిక్షువులకు శోభించదు. మీరు తిరిగి వెళ్ళండి. మీ అందరి స్నేహము ఎల్లప్పుడూ మాకు తోడుగా వుంటుంది' అని అన్నాడు.

అతడు చిరునవ్వు నవ్వాడు.

క్రమక్రమంగా జనం వెనక్కి తగ్గారు. భిక్షువులందరు సంఘభవనం కేసి బయలుదేరారు.

వారు మరికొంతదూరం ముందుకు సాగిపోయారు.

వారి వెనుక ఒక రథం వస్తున్నధ్వని వినవచ్చింది. అంబాపాలి వెనుదిరిగి చూచింది: 'ఇదేమిటి, ఆర్య సూర్యమణి!' అంది ఆమె.

'అవును, ఆర్య సూర్యమణి, చంద్రసేనలు' అని నృసింహుడు వెనుదిరిగి వారిని చూస్తూ అన్నాడు.

వారు సూర్యమణి చంద్రసేనలే. చంద్రసేన ఒడిలో సంవత్సరన్నర బిడ్డ వున్నాడు. వారి సమీపానికి వచ్చి సూర్యమణి రథాన్ని ఆపాడు.

వారు క్రిందికి దిగారు.

చంద్రసేన బాలుణ్ణి అంబాపాలి ఒడిలో పడవేసింది. ఆమె మరేమీ మాట్లాడలేదు. ఆమెకంఠం రుద్ధమైపోతోంది. అంబాపాలి బిడ్డను ముద్దాడి తిరిగి చంద్రసేనకు వప్పగించింది.

మధుర దరహాసంతో 'ఒకప్పుడు నిన్నుచూచి ఈర్ష్య పడ్డాను చంద్రసేనా! ఇవాళ మళ్లీ నేను నిన్నుచూసి ఈర్ష్య పడుతున్నాను. (ఆమె సూర్యమణి కేసి తిరిగి) సూర్యమణీ! ఈ బిడ్డన్ను, చంద్రసేనను ప్రేమగా చూసుకో' అని చెప్పింది.

సూర్యమణి నేత్రాలు అశ్రుపూరితా లయాయి. 'దేవీ, నీ స్మృతిచిహ్నం ఈ చంద్రసేనే! నీ ఋణాన్ని తీర్చ గల్గినన్ని అశ్రువులులేవు వైశాలి కన్నుల్లో. అంబాపాలీ! నేను పరతంత్ర నగరపౌరుణ్ణి. నాకెంత అవమానం? నేనీ సంకె ళ్ళను తెగ్రతెంచలేకపోయాను' అని, చిరునవ్వుతో 'దేవీ! నువ్వు నన్ని కఠినమైన సంకెళ్ళతో ఎందుకు బంధించావు?' అని అన్నాడు.

ఆమె బాలుని కేసి, చంద్రసేన కేసి తిరిగింది.

అంబాపాలి బాలుని బుగ్గమీటుతూ 'ఈ బాలుడు నీ కవిత్వంవలెనే అందంగా వున్నాడు. ఇతడికి ఆర్యకుమార గుప్తుని కథ విన్పించు' అని అంది.

ఆమాట పూర్తయేసరికి అంబాపాలి కన్నులనిండా నీళ్ళు నిండాయి.

నృసింహుడు వారివద్ద శలవుతీసుకుని బయలుదేరాడు. సూర్యమణి రథంలోనుంచి ఒక వీణను తీసి అంబాపాలికి

అందించాడు. 'ఇది మీకు చంద్రసేన కానుక' అని చెప్పాడు.

సంధ్యా సంధ్య తన బాలునికేసి, దూరంగా ఉదయిస్తున్న సూర్యునికేసి తదేకంగా చూస్తున్న భైరవిని చూస్తూ నిలబడింది, చంద్రసేన.

నృసింహుడు వారికి నమస్కరిస్తూ వీణను అందుకున్నాడు. అతడు దానిని భుజంమీద వుంచుకున్నాడు. తర్వాత భైరవి చెయ్యిపట్టుకుని 'ఈమూగది ఇప్పటికైనా మాట్లాడుతుందా? అంబాపాలీ! బయల్దేరు. మనం ఎంతో దూరం వెళ్ళాలి' అని అన్నాడు.

వారిని అక్కడే వదలి వారు ముగ్గురూ ముందుకు సాగిపోయారు.

ముందు నృసింహుడు, భైరవి నడుస్తున్నారు. ప్రయాణానికి తెచ్చుకున్న ఫలహారపుమూట, వీణ నృసింహుని భుజాలపై వున్నాయి. అతను భైరవిచేతిని పట్టుకుని నడుస్తున్నాడు. వారివెనుక అంబాపాలి నడుస్తోంది. కుమారగుప్తుడు వ్రాసిన తథాగతుని ఉపదేశాల ప్రతిలిపి ఆమె చేతిలో వుంది. కుమారగుప్తుని చిహ్నమే ఆమెవెంట వెళ్తుంది. ఆమె చాలా నెమ్మదిగా నడుస్తోంది. ఏదో భారంతో క్రుంగిపోతున్నట్లుగా మెల్లగా అడుగులు వేస్తోంది.

వైరవి మధ్యమధ్య వెనుదిరిగి సూర్యమణిని, చంద్ర సేనను, వారిబిడ్డను చూస్తూ నడుస్తోంది. రథంవద్ద నిలబడి వున్నవారిని ఆమె చూస్తూనేవుంది.

'ధర్మం శరణమ్ గచ్ఛామి'
సంఘం శరణమ్ గచ్ఛామి'
బుద్ధం శరణమ్ గచ్ఛామి.'